# భగవాన్

# శ్రీ రమణ మహర్షుల వారి

# ఉపదేశసారము

వ్యాఖ్య :

“అభినవ వ్యాస” “జ్ఞానప్రపూర్ణ”

**శ్రీ దేవిశెట్టి చలపతిరావు**, B.Sc..(Ag)

వ్యవస్థాపకులు

అధ్యాత్మిక జ్ఞాన పీఠం :: చిలకలూరిపేట.

# భగవాన్ శ్రీ రమణ మహర్షుల వారి
# ఉపదేశసారము

## ఉపోద్ఘాతం

ఈ లోకంలో ప్రతి మానవుడు – అతడు తెలివిగలవాడైనా – తెలివి తక్కువవాడైనా, ఉన్నవాడైనా – లేనివాడైనా, చదువుకున్న వాడైనా – అక్షరజ్ఞానం లేనివాడైనా, చిన్నవాడైనా–పెద్దవాడైనా, స్త్రీ యైనా – పురుషుడైనా ఎవరైనా సరే హాయిగా, ఆనందంగా ఉండాలని, సుఖంగా జీవించాలని; ఏ కష్టాలు, బాధలు, భయాలు, దు:ఖాలు లేకుండా ఎప్పుడూ నవ్వుతూ త్రుళ్ళుతూ బ్రతకాలనీ కోరుకుంటాడు. అలా కోరుకోవటమే కాదు, అలా ఆనందంగా జీవించటానికి బుద్ధితో జాగ్రత్తగా ఆలోచించి అనేక నిర్ణయాలు తీసుకుంటూ ఉంటాడు. అనేకమైన కర్మలు చేస్తుంటాడు. వ్యాపారం చేస్తాడు, ఉద్యోగం చేస్తాడు, ఏదో వృత్తిని చేపడతాడు, లేదా రాజకీయాలలో దిగి ఉన్నత పదవులు సంపాదిస్తాడు. అందుకొరకు నిజాయితీగా కష్టపడి పనిచేస్తాడు, లేదా అక్రమ మార్గాలలో సంపాదిస్తాడు. అనేక వస్తువులను సంపాదిస్తాడు, ధనాన్ని సంపాదిస్తాడు, ఇళ్ళు కడతాడు, తోటలు పెంచుతాడు, స్విస్ బ్యాంకులలో ధనాన్ని నింపుతాడు. ఎలాగో ఒకలాగా ఆనందాన్ని పొందాలని ప్రయత్నిస్తుంటాడు. అనేక సందర్భాలలో ఆనందం వచ్చినట్టే వస్తుంది. ఆ తర్వాత వస్తువు పోవటం వల్లనో, పదవులు పోవటం వల్లనో, శత్రువుల వల్లనో, లేదా తనలోని కోరికల స్వభావం మారటం వల్లనో ఈ వచ్చిన ఆనందం వచ్చినట్టే వచ్చి ఆవిరైపోతుంది. మళ్ళీ మనస్సులో అసంతృప్తి. దానిని పోగొట్టుకోటానికి మళ్ళీ ప్రయత్నాలు ప్రారంభం. మళ్ళీ వాటివల్ల ఆనందం వస్తుంది. కాని అదీ తాత్కాలికమే. మళ్ళీ అసంతృప్తి. కొందరికి ఎన్ని సంపదలున్నా ఎంత ధనమున్నా

చాలదు. ఇంకా ఇంకా కావాలి. అసంతృప్తి. ఇక కొందరికి తమకు లేదని గాక, ఎదుటివాడికి ఉన్నదే అని బాధ, అసూయ. కొందరికి ఉన్నవి చేజారిపోతాయేమోననే భయం. ఏ క్షణం ఏమౌతుందోననే భయం. ఈశోకం–భయం ప్రతి మానవుడిని వెంటాడుతూనే ఉంటాయి. "శోకస్థాన సహస్రాణి – భయస్థాన శతానిచ" వేలకొద్దీ శోకాలు, వందల కొద్దీ భయాలు. ఈశోకాలు – భయాల మధ్య ఇంక ఆనందం ఎక్కడ? ఒక వేళ ఉన్నా ఎంతకాలం ఉంటుంది? ఒక వేళ అన్నీ బాగున్నా క్రమక్రమంగా ఈ దేహంలో మార్పులుచోటు చేసుకుంటున్నాయి. ఇంద్రియాలు క్రమంగా పనిచేయటం లేదు. వృద్ధాప్యం మీద పడుతున్నది. రోగాలు రాగాలు తీస్తూ వచ్చి కూర్చుంటున్నాయి. చివరికి ఏదో ఒకనాటికి ఈ దేహం రాలిపోవాల్సిందే. మళ్ళీ మరోజన్మ. ఆ జన్మలో మళ్ళీ ఆనందం కోసం పరుగులు. ఇంతకు ముందు ఎన్నో జన్మలలో పరుగులు తీశాం. ఈ జన్మలోనూ తీస్తున్నాం. అయినాసరే మనం కోరుకున్న శాశ్వత ఆనందం లభ్యం కావటం లేదు. మనకు కావలసింది దు:ఖం లేని ఆనందం. శాశ్వతంగా ఉండే ఆనందం. మార్పులు లేని ఆనందం. కానీ మనకు వస్తున్నది తాత్కాలిక ఆనందం. దు:ఖంతో –భయంతో కూడి ఉన్న ఆనందం. ఏ మాత్రం పరిస్థితులు మారినా జారిపోయే ఆనందం. ఇదికాదు మనం కోరుకుంటున్నది. మరి మనం కోరుకొనే ఆనందం మనకు ఎందుకు రావటం లేదు? పుట్టిన దగ్గర నుండి చచ్చేదాకా ఎన్ని కర్మలు చేసినా, ఎన్ని సంపదలు కూడబెట్టినా,ఎందరు వ్యక్తులను తనవారిగా చేసుకున్నా – ఎందుకు ఈ శాశ్వతానందం దక్కడం లేదు? ఈ ప్రపంచంలో ఎంతదూరం పరుగెత్తినా పరుగులే తప్ప శాశ్వత ఆనందం లభించటం లేదేమిటి? పైగా ఆనందం కోసమని కర్మలు చేస్తున్న కొద్దీ కర్మ ఫలాలు, వాసనలు కూడుకొని అవి మనను మరింత బంధిస్తున్నాయి. జనన మరణ

చక్రంలో పడేస్తున్నాయి. జన్మ-కర్మ వలయంలో - సుడిగుండంలో త్రిప్పుతున్నాయి. ఎందువల్ల? ఈ లోకంలోని వస్తువులు గాని, విషయాలు గాని, భోగాలు గాని అనిత్యమైనవి. అనిత్యమైన విషయాలు అనిత్యమైన ఆనందాన్నిస్తాయే గాని శాశ్వతానందాన్నివ్వలేవు. మరి ఏమిటి దీనికి పరిష్కారం ? శాశ్వతమైన ఆనందం నీకు కావాలంటే అశాశ్వతమైన, అనిత్యమైన వస్తువుల వెంట, విషయాల వెంట పడరాదు. శాశ్వతమైన వస్తువేదో తెలుసుకొని అట్టి వస్తువును పొందటానికి ప్రయత్నం చేయాలి. శాశ్వత వస్తువు పరమాత్మ.కనుక ఆ పరమాత్మను తెలుసుకొని ఆయనను ఆశ్రయించాలి. ఆయనకు దగ్గర కావాలి. ఆయనతో ఐక్యం కావాలి. అప్పుడే ఆనందం. శాశ్వతానందం. దానితో దు:ఖాలన్నీ మటుమాయం.

అయితే పరిమితమైన వస్తువులు పరిమితమైన ఆనందాన్నిస్తాయే గాని శాశ్వతానందాన్ని ఇవ్వలేవని ముందుగా గ్రహించాలి. తర్వాత తాను అనుభవిస్తున్న దు:ఖాల నుండి విడుదల పొందాలంటే తాను సమస్త కర్మ బంధనాల నుండి విడుదల పొంది, శాశ్వత పరమాత్మను తెలుసుకొని ఆయనతో ఐక్యమై పోవడం, మోక్షాన్ని పొందటం ఒక్కటే శాశ్వత పరిష్కార మార్గమని గుర్తించాలి. అట్టి మోక్ష సాధనకు తీవ్ర ప్రయత్నం చెయ్యాలి.

మోక్షమంటే మరేమీకాదు. నీ సహజ స్థితియే మోక్షం. నీవు పరమాత్మ స్వరూపుడివే. నీవు మోక్ష స్వరూపుడివే. నీవు శాశ్వత ఆనంద స్వరూపుడివే. అయితే ఆ సంగతి నీవు మరచావు. నీవెవరో నీవు మరచావు. నిన్ను నీవు తెలుసుకోకపోవటమే నీ బాధలకు కారణం. కనుక ఇప్పటికైనా నీ కళ్ళు తెరచి నీవెవరో తెలుసుకో. నీ సమస్యలన్నీ తీరిపోతాయి.

అయితే ఎలా తెలుసుకోవాలి? ఎవరు చెబుతారు? శాస్త్రాలు చెబుతాయి. అయితే మనకు ఎన్నో శాస్త్రాలున్నాయి. భౌతిక శాస్త్రం,

రసాయనిక శాస్త్రం, గణిత శాస్త్రం, పదార్ధ విజ్ఞాన శాస్త్రం, జంతు శాస్త్రం, వైద్య శాస్త్రం, జ్యోతిష్య శాస్త్రం.. అని – ఇవన్నీ ఈ ప్రపంచాన్ని గురించి; ఇందులోని వస్తువులు, ప్రాణులు, విషయాల గురించి; దేహాదుల గురించి చెబుతాయే గాని నీ గురించి చెప్పవు. ఈ శాస్త్రాల ద్వారా ఎన్ని విషయాలు తెలుసుకుంటున్నా – ఎన్నిరకాల సౌకర్యాలు పొందుతున్నా – ఎన్ని నూతన వస్తువులు కనిపెడుతున్నా నీలోని అసంతృప్తి పోతున్నదా? శాశ్వత ఆనందం కలుగుతున్నదా ? లేదు. అందుకే ఈ శాస్త్రాలన్నీ మూగబోయిన చోట వేదాంత శాస్త్రం దర్శనమిస్తుంది.

జాగ్రదవస్థలో ఒక ప్రపంచం ఉన్నది. అది దృశ్యం. ఈ దృశ్యాన్ని చూచే వాడొకడున్నాడు. అతడే ద్రష్ట. కళ్ళు మూసుకొని నిద్రపోతే – ఈప్రపంచం కాస్తా అదృశ్యం. కొంతమంది కళ్ళు సగం తెరుచుకొనే నిద్ర పోతుంటారు. అంటే వారికి నిద్రలో కూడా ఈప్రపంచాన్ని వదిలి పెట్టటం ఇష్టం లేదేమో! అయితే వారికీ ఈ ప్రపంచం అదృశ్యమే, నిద్రించే వాడికి ఏ ప్రపంచం లేదు.

ఈ ప్రపంచాన్ని 'ఇదం' వస్తువు అంటారు. ఇది ఇది అని చూడబడేది. దానిని చూచే 'నేను' 'అహం' వస్తువును. జాగ్రదవస్థలోఈ రెండూ ఉన్నాయి. అలాగే స్వప్నావస్థలో కూడా ఒక ప్రపంచం ఉంది. దానిని చూచే వాడూఉన్నాడు. అంటే అక్కడా ఇదం – అహం రెండూ వున్నాయి. అయితే సుషుప్తి సంగతేమిటి? అక్కడ ఏ ప్రపంచము లేదు. అంటే ఏ దృశ్యము లేదు. ఏమీ లేదు కనుక చూచే వాడొకడు ఉండే వీలులేదు. అయితే అక్కడ రెండూ లేకపోయినా రెంటికి ఆధారమైన 'తాను' ఉన్నాడు. అలా ఉండి ఉండకపోతే ఆ అనుభవాన్ని చెప్పటం గాని, మళ్లీ నిద్ర లేవటం గాని జరగదు గదా ! అయితే ఇక్కడే 'నేను'కు – 'తాను'కు మధ్యనున్న తేడా గ్రహించాలి.

'నేను' కొంతకాలం ఉండేది. తర్వాత పోయేది. జాగ్రదవస్థలో ఉంటుంది. సుషుప్తిలో ఉండదు. 'తాను' మాత్రం అన్ని అవస్థలలో ఉండే నిత్యసత్యం. 'నేను' అనగానే కొన్ని భావాలు, ఆలోచనలు, సంకల్పాలు, కోరికలు, ఇష్టాఇష్టాలు ఉంటాయి. 'తాను'లో ఇవేవీ ఉండవు. 'నేను' రాకముందు ఎందరో ఉన్నారు. 'నేను' పోయిన తర్వాత కూడా ఎందరో ఉంటారు. కాని 'తాను' అనేది ఒక్కటే. తనకన్నా వేరే ఎవరూ ఎప్పుడూ వుండరు.

ఈ ప్రపంచం – నేను – తాను – ఈ మూడింటి మధ్యనడిచే కథ ఏమిటో చూద్దాం. జాగ్రదవస్థలో ఒక ప్రపంచం, దానిని చూస్తూ తెలుసుకుంటూ ఉండే 'నేను' ఉన్నాను. అయితే నిద్రలోకి జారుకోవటంతో ఈ ప్రపంచమంతా చుట్టచుట్టుకొని నేనులోనికి పోతుంది. ఈ నేను 'తాను'లోనికి పోతుంది. ఇదే సుషుప్తి. మళ్ళీ జాగ్రత్త లోకి రావటంతో 'తాను'లో నుండి ఈ నేను లేస్తాడు. 'నేను'లో నుండి ఈ ప్రపంచం లేచి దర్శనమిస్తుంది. మారిపోతుండే ఈ ప్రపంచాన్ని, ఈ ప్రపంచాన్ని చూచే నేను ను స్వరాన్నీ ప్రకాశింపజేసేదే మార్పులు లేని ఈ 'తాను'. తాను నిత్యం – సత్యం – శుద్ధం – బుద్ధం – ముక్తం.

ఈ దేహేంద్రియాలతో తాదాత్మ్యం చెంది, కర్మలు చేస్తూ ఫలితాలను అనుభవిస్తూ ఉండే జీవుణ్ణి 'నేను' (అహం) అనే పదంతోను – ఈ జీవుడికి ఆధారమైన ఆత్మను – నిత్య – సత్య పరమాత్మ చైతన్యాన్ని 'తాను' అనే పదంతోను రమణ మహర్షి తెలియజేయడం జరిగింది. ఈ 'తాను' యే మన నిజస్వరూపం. మన నిజస్వరూపాన్ని తెలియజేసే జ్ఞానాన్నే 'ఆత్మజ్ఞానము' అంటారు. ఈ ఆత్మజ్ఞానము వల్లనే మన యదార్థ స్వరూపం ఏదో తెలుస్తుంది. అలా మన స్వరూపం మనకు తెలిసి స్వస్థితిలో ఉ ండటమే మోక్షం. అదే శాశ్వత ఆనంద స్థితి. ఆత్మజ్ఞానం లేకుండా ఎన్ని

కర్మలు చేసినా మోక్షం లేదు. ఆత్మజ్ఞానాన్ని సందేశాల ద్వారా – ఆదేశాల ద్వారా తెలుసుకొనే వీలు లేదు. కేవలం 'ఉపదేశం' ద్వారానే తెలసుకోవాలి. ఈ ఉపదేశాన్ని అందించేవే ఉపనిషత్తులు. ఉపనిషత్తులందించే జ్ఞానాన్ని పిండి ఆసారాన్ని అందించేదే ఉపదేశసారం అనే గ్రంథం. ఈ ఉపదేశ సారాన్ని అందించింది సామాన్య పండితుడు కాదు, గ్రంథ పరిశోధన చేసిన కవీ కాదు. ప్రపంచానికి అతీతంగా – మనస్సుకు అతీతంగా – నేనుకు అతీతంగా – తనలో తానుగా ఉంటూ, ఈ ప్రపంచంలో అందరి మధ్యన నడయాడిన ఆత్మజ్ఞాన సంపన్నుడైన ఒకమహాత్ముడు – మానవాతీత శక్తి – కదులుతున్న దేవాలయం – సాక్షాత్ భగవంతుడే అయిన భగవాన్ శ్రీ రమణ మహర్షి, తన అనుభవాన్నంతా పిండి సారంగా అందించారు ఈ ఉపదేశసారమనే 30 శ్లోకాలు గల చిన్న గ్రంథంలో...

## భగవాన్ రమణ మహర్షి

భారతదేశంలోని మహాత్ములలో, ఆత్మానుభూతి చెందిన పరమ జ్ఞానులలో అతి ముఖ్యమైన వారు భగవాన్ రమణ మహర్షి.

ఆయన 1879సం॥రం డిసెంబరు 30వ తేదీన అర్ధరాత్రి ఒంటిగంట వేళ తమిళనాడులోని "తిరుచ్చుళి"లో జన్మించారు. తండ్రి సుందరం అయ్యరు, తల్లి అళగమ్మాళ్. ఆయనకు తల్లితండ్రులు పెట్టిన పేరు 'వెంకటేశ్వరన్'. అయితే అందరూ 'వెంకటరామన్' అని పిలిచేవారు. తండ్రి ప్లీడరు వృత్తిలో చాలా గౌరవింపబడేవారు. ఆయనకు ముగ్గురు సంతానం. అందులో రెండవ వారే మన మహర్షి.

బాల్యంలో ఎటువంటి ప్రతిభ కాని, ప్రత్యేకత గాని లేకుండానే పెరిగారు. చదువులో గాని, లౌకిక విషయాలలో గాని, మత విషయాలలో గాని, ఏ ప్రత్యేకత లేని సామాన్య జీవితం ఆయనది. అయితే ఆటల యందు బాగా ఆసక్తి ఉండేది. బలం గల ధృడమైన శరీరం ఆయనది.

ఆటలాడటం, స్వేచ్ఛగా తిరగటం తప్ప చదువులో ఎట్టి శ్రద్ధ చూపలేదు.

చిన్నతనంలోనే తండ్రి చనిపోవటంతో పినతండ్రి ఇంటిలోనే పెరుగుతున్నాడు వెంకటరామన్. ఆయనకప్పుడు 17 సం॥ల వయస్సు. అది 1896 వ సం॥రం జూన్ నెల. ఒక రోజున తన పినతండ్రి ఇంటి మొదటి అంతస్తులో ఏకాంతంగా కూర్చున్నాడు. ఆరోగ్యం బాగానే ఉంది. కాని ఉన్నట్టుండి అతడిలో మరణ భయం కలిగింది. తాను చనిపోబోతున్నాను అనే భీతిపట్టుకుంది. అకస్మాత్తుగా అతడికీ ఆలోచన కలిగింది. ఇప్పుడు నేను చనిపోతున్నాను గదా ! చనిపోయేది ఏది? ఈ శరీరమే గదా ! ఇలా అనుకుంటూ పడుకుని చనిపోయిన వానిలా అన్ని అవయవాలు బిగించాడు. సరే ఈ దేహం చనిపోయింది. దీనిని స్మశానికి తీసుకెళ్ళి కాల్చేస్తారు. మరి ఈ శరీరం పోతే నేను కూడా పోయినట్లేనా? ఈ శరరమే 'నేనా'? కాదు.ఎందుకంటే ఈ శరీరం కట్టెలా బిగుసుకు పోయి, కదలక మెదలక ఉన్నా నేను ఆలోచనలు చేయగలుగుతున్నాను గదా! అంటే ఈ శరీరం కన్నా ఆలోచనలు చేసే నేను వేరే వున్నాను గదా! అంటే నేను ఈ శరీరం కాదు. ఈ శరీరం కన్నా వేరేగా ఉన్నాను – అనే భావన కలిగింది. 'నేను' అనే మాట – భావం అతడి మనసంతా ఆక్రమించింది. ఇదే ఆ తర్వాత ఆయన జీవితంలో గొప్పమార్పు తెచ్చింది.

ఈ 'నేను' ఎవరు? అనే చిక్కుప్రశ్నకు సమాధానం వెతుకుతున్నాడు. ఇక రెండవ ఆలోచనే లేదు. చదువు మీద, బంధువుల మీద, మిత్రుల మీద, ఆటపాటల మీద ఆసక్తి తగ్గిపోయింది. పూర్వం లాగా అన్ని విషయాలకు చలించటం లేదు. ఎటువంటి ఆహారం ఇచ్చినా మారు మాట్లాడకుండా దానినే తింటున్నాడు. రుచులు, వాసనలు పట్టటం లేదు. వినయము, సాధు స్వభావము, ఉదాశీనత పెరిగినవి. మధుర లోని మీనాక్షీ దేవాలయానికి వెళ్లి గంటల తరబడి శివుని ఎదుట,మీనాక్షీ దేవి

ముందు మౌనంగా కూర్చొనేవాడు. భగవానుని అనుగ్రహం కావాలని భావిస్తూ 'నేను' అనే భావనలోనే మౌనంగా గడిపేవాడు. ఆరువారాలు ఇలాగే గడిచింది. చివరకు ఆగష్టు 29, 1896న తాను చదువుతున్న తరగతి పుస్తకాలను కట్టగట్టి ఆవలపారవేసి ధ్యానంలో నిమగ్నమయ్యాడు. ఇదంతా చూస్తున్న అన్నగారు నాగస్వామి "ఈచదువు సంధ్యలు పట్టనివాడికి నీకు ఇక్కడ ఏంపని"? అని చీవాట్లు వేశాడు. ఇలాంటి మాటలు ఇంతకు ముందు విన్నా ఈ సారి మాత్రం మనస్సు చివుక్కుమన్నది. "అవును. నాకిక్కడేం పని"? అని మనస్సులోనే భావించాడు. వెంటనే కొన్ని నెలల క్రిందట జరిగిన సంఘటన గుర్తుకు వచ్చింది.ఒక బంధువు ఎక్కడెక్కడో పుణ్యక్షేత్రాలు తిరిగి రాగా,ఆయనను 'ఎక్కడకు వెళ్ళారు'? అని వెంకటరామన్ అడిగారు.దానికాయన 'అరుణాచలం' అన్నారు. ఆమాట వినటంతోనే ఆబాలునిలో ఏదోతెలియని అనుభూతి – పారవశ్యం – ఆశ్చర్యం కలిగింది. అరుణాచలం అనేది ఎక్కడో దేవలోకంలో గాక ఈభూమి మీదనేఉన్నది అనే విషయం ఆయన హృదయాన్ని కదిలించింది. అంతే 'అరుణాచలం' ఆయన మనస్సులో నిలిచిపోయింది. ఇప్పుడది గుర్తుకు వచ్చింది.

వెంటనే అన్నగారితో తాను బడికిపోతున్నానని చెప్పగా నాగస్వామి "క్రిందనున్న పెట్టెలో 5/–లున్నాయి. అవి తీసుకెళ్ళి నా కళాశాల జీతం చెల్లించమన్నాడు. అదికూడా తనకు దైవ ఆదేశమేనని భావించాడు. వెంటనే అరుణాచలానికి రైల్వేమార్గాన్ని మ్యాప్‌లో గుర్తించి, దానికి 3 రూపాయలు సరిపోతాయని అంచనా వేసి, మిగిలిన రెండురూపాయలు కనిపించే స్థలంలో ఉంచి, లెటరు వ్రాసిపెట్టి కట్టుబట్టలతో 3/–లు తీసుకొని స్టేషనుకు వెళ్ళాడు. ఆ లేఖలోఇలా ఉన్నది.

"నా తండ్రిని అన్వేషించుటకై ఆయన ఆదేశంతో నేనిక్కడ నుండి వెళుతున్నాను, 'ఇది' ఒక సత్కార్యానికే బయలు దేరుతున్నది.కనుక

ఈ విషయమైఎవరూ చింతించవద్దు. దీనిని వెదికి కనిపెట్టటానికి డబ్బు ఖర్చు చేయనవసరం లేదు. నీకళాశాల జీతం చెల్లించలేదు. 2/–లు ఇక్కడే విడిచిపెట్టబడ్డాయి. ఇట్లు ..... (సంతకం లేదు)

ఈ లేఖలో మొదటి వాక్యం 'నేను'తో మొదలు పెట్టి తర్వాత 'ఇది' అని వాడటం జరిగింది. అంటే అప్పటికే దేహాన్ని వేరుగా చూడటం ప్రారంభమయిందన్న మాట.

అలా స్టేషన్‌కు వెళ్ళి మధ్యలో విల్లుపురంలో దిగి, అనేక బాధలు పడి, తన చెవిపోగులు తాకట్టు పెట్టి, 4 రూపాయలు తీసుకొని వారిచ్చిన మిఠాయితో సెప్టెంబర్ 1వ తేదీన తిరువణ్ణామలైలో దిగాడు. అక్కడకు చేరగానే ఉద్విగ్న హృదయంతో దేవాలయానికి పరుగెత్తాడు. తనకు స్వాగతం చెప్పటానికా! అన్నట్లు దేవాలయ ద్వారాలన్నీ తెరచే ఉన్నాయి. అక్కడెవ్వరూ లేకపోవటంతో సరాసరి గర్భగుడిలోనికి పోయి స్వామికి తన రాకను తెలియజేశాడు. తండ్రీ ! నీ దగ్గరకు వచ్చేశాను. ఇక నీయిష్టం అన్నాడు.

తరువాత గుడి బయటకు వచ్చి, అయ్యంగుళం అనే చెరువు దగ్గరకు వచ్చి, ఇంక ఈ మొద్దుకు (శరీరానికి) మిఠాయి ఎందుకు ? అని క్రితం రోజు ఎవరో విందులో ఇచ్చిన మిఠాయిని ఆ చెరువులోనికి విసిరి వేశాడు. కొంత దూరం పోగానే ఒకడు కనిపించి నీ జుట్టు తీసివేయమంటావా? అని అడగటంతో అంగీకరించాడు. తరువాత తన వస్త్రాన్ని చింపి చిన్న పేలికను గోచీపెట్టుకొని మిగిలిన వస్త్రాన్ని, జంధ్యాన్ని, తన దగ్గర మిగిలి ఉన్న చిల్లర డబ్బులను దేవాలయానికి ఎదురుగా ఉన్న కోనేరులో పారవేశాడు. ప్రాపంచిక బంధాలన్నింటిని అలా విడిచిపెట్టి వేసి, "నీ ఆజ్ఞ ప్రకారం చేరుకున్నాను" అని చెబుతూ అరుణాచలేశ్వరునకు తనను తాను సర్వ సమర్పణ గావించుకున్నాడు. అక్కడి వేయిస్తంభాల

మండపంలో తపస్సుకు కూర్చున్నాడు. అక్కడ పిల్లల అల్లరి ఎక్కువ కావటంతో పాతాళ లింగమనే భూగర్భ గుహలోనికి చేరాడు. అక్కడికి ఎవ్వరూ వెళ్ళరు. అతడెన్నాళ్ళు అక్కడున్నాడో తెలియదు. తీవ్రమైన తపస్సమాధిలో మునిగిపోయాడు. తన దేహం మీద పురుగులు పాకుతున్నా, దేహాన్ని పురుగులు తొలిచేస్తున్నా,స్మారకం లేదు. తన చుట్టూ ఉన్న ప్రపంచం గురించిన ఎరుకే లేదు. ఎప్పుడో గాని ఆహారం తీసుకొనే వాడు కాదు. శరీరం జీర్ణించి పోయింది. గోళ్ళూ, కేశాలు వికృతంగా పెరిగాయి. ఈస్థితిలో రెండు మూడు సంవత్సరాలు గడిచిపోయాయి. ఎవరో చూచేటప్పటికి అతడి దేహము నందలి అధోభాగం నుండి వచ్చిన చీము, నెత్తురుతో నేలంతా తడిసి పోయి ఉంది. అక్కడి పురుగులు ఆయన శరీరాన్ని ఆహారంగా చేసుకున్నాయి. ఆ తర్వాత ఆయన ఎక్కడకు మారుతున్నా, సాధువులు ఆయన క్షేమాన్ని విచారిస్తూ రక్షిస్తున్నారు. ఆయన ఎన్నో దేవాలయాలు, తోటలు,వాహనాల గదులు, గుహలు మార్చి తపస్సు కొనసాగించారు. 1896లో అక్కడికి చేరినప్పటి నుండి 1950లో దేహం చాలించేంతవరకు ఆయన అరుణాచలాన్ని వీడలేదు. ఆయన ఏ పుణ్యక్షేత్రాన్ని దర్శించలేదు. అన్నీ తీర్థాలు, అన్ని క్షేత్రాలు ఆయనలోనే ఉన్నాయి. కనుకనే 54 సం॥ములు అరుణాచలాన్ని వదలలేదు.

ఆయన అరుణాచలంలో ఉన్న సంగతి తెలుసుకొని పినతండ్రి వచ్చాడు. ఆయనకేమీ సమాధానం చెప్పక పోవటంతో తిరిగి వెళ్ళాడు. తరువాత తన తల్లిగారు, అన్న నాగస్వామి కలిసి వచ్చారు. కాని స్వామి మనస్సు మారలేదు. వారితో మాట్లాడకుండా కాగితంపై ఇలా వ్రాశాడు. "వారి వారి ప్రారబ్ధ కర్మలను బట్టి జగన్నియంత జీవుల గతిని నడుపుతుంటాడు. ఏది జరుగవలెనో అది జరుగుతుంది. ఏది జరుగరాదో అది జరుగదు. ఇది సత్యము. కనుక సర్వోత్తమమైన మార్గం మౌనమే".

దానితో చేసేది లేక వారు వెళ్ళారు. అప్పటి నుండి స్వామి కొండమీది విరూపాక్ష గుహకు వెళ్ళి మౌనముదాల్చి తీవ్రతపస్సు చేశారు. అనేకమంది స్వామిపట్ల ఆకర్షితులై వారి దర్శనానికి వస్తూ ఉండేవారు. వారి సమక్షంలోఎందరికో శాంతి లభించింది. కొందరు తమ సందేహాలు తీర్చుకొనుటకు వచ్చేవారు. కొందరు సాధకుల కిచ్చే బోధల కోసం వచ్చేవారు. కొందరు తమ సమస్యలను నివేదించుకొనుటకై వచ్చేవారు. ఏకారణంతో ఎవరువచ్చినా వారి నిరాడంబరతకూ, వినమ్రతకు అందరూ మంత్రముగ్ధులయ్యేవారు. ఆయన అందరికీ అన్ని వేళలా అందుబాటులో ఉండేవారు. నలుగురితో బాటే ఆయన కూర్చొనేవారు. క్రమంగా ఆయన చుట్టూ ఆశ్రమం వెలిసింది. 1916వ సంవత్సరంలో ఆయన తల్లి కుమారుని వద్దకు వచ్చి 1922లో చనిపోయే వరకు అంతిమ కాలమంతా కుమారునితోనే గడిపింది.

స్వామి అనుగ్రహం సంపాదించాలని వచ్చినవారిలో కావ్యకంఠ గణపతి శాస్త్రి ముఖ్యులు. ఆయన గొప్పకవి. సంస్కృత పండితులు, బహు గ్రంథకర్త, 12 సం॥లు తపస్సు చేసినప్పటికి ఆయనకు ఫలితం కలుగలేదు. అనేకమంది శిష్యులు గల ఆయన స్వామిని చేరి స్వస్థచిత్తుడయ్యాడు. ఆయనే స్వామికి 'భగవాన్ రమణ మహర్షి' అని పేరు పెట్టిన వారు. ఆ తర్వాత అనేక మంది మహర్షి శిష్యులయ్యారు. రామస్వామి అయ్యర్, శేషాద్రిస్వామి, శివ ప్రకాశం పిళ్ళై, ఎచ్చెమ్మాళ్, బి.వి.నరశింహ అయ్యరు, శుద్ధానంద భారతి, యోగి రామయ్య మొదలగు వారు ఎందరో. వీరుగాక విదేశయులైన హంఫ్రిస్, పాల్ బ్రంటన్, గ్రేంట్ డఫ్ మొదలగు వారెందరో మహర్షిని ఆశ్రయించి చిత్తశాంతిని పొందారు. మనుష్యులేకాదు గోవులు, కోతులు, కుక్కలు, ఉడతలు, నెమళ్ళు.. ఎన్నో. వాటన్నింటిని జంతువులుగా కాక, వారిని స్నేహితులుగా గౌరవించే వాడు మహర్షి.

రమణ మహర్షి ఘనత దేశవిదేశాలకు వ్యాపించింది. అనేక ప్రాంతాల నుండి, అనేక దేశాల నుండి అభిమానులు మహర్షిని దర్శనము చేసుకొని భక్తులుగా ఇక్కడే ఉండిపోయారు.

రమణ మహర్షి అక్షరమణిమాల, విచార సంగ్రహం, అరుణాచలాష్టకం, ఉపదేశసారం అనే కొన్ని గ్రంథాలు మాత్రమే వ్రాశారు.

'నేనెవడను'? అని నీలో నీవు విచారణ చేస్తే మనస్సు అణగి సత్యమైన ఆత్మను తెలుసుకొని ముక్తుడవవుతావు" అనేదే స్వామి యొక్క ప్రధాన ఉపదేశం.

తన సాన్నిధ్యం చేత, చూపు చేత, వాక్కుచేత, ఒక్కొక్క చేష్ట చేత ఆశ్రితుల దు:ఖాన్ని పోగొట్టి శాంతిని, తత్త్వ జ్ఞానాన్ని అనుగ్రహిస్తూ తన అవతార కార్యమును పూర్తిగావించుకొని 1950 ఏప్రియల్ 14 శు క్రవారం రాత్రి గం. 8.47 కు విదేహముక్తులైరి. 1949లో ఎడమ మోచేతిపై లేచిన కురుపు పెరిగి పెరిగి 4మార్లు శస్త్ర చికిత్స, రేడియం చికిత్స చేసినను అణగక భగవానుని శరీరాన్ని కొల్లగొట్టింది. ఎంతోబాధ కలిగించే ఈ పుట్టకురుపు భగవానుని ప్రశాంతతను గాని, అనుగ్రహ కృత్యములను గాని, ఆటంకపెట్ట లేకపోయినది. మత్తుమందు లేకుండా శస్త్రచికిత్స జరుగుతున్నంత సేపూ చిరునవ్వుతో ఉండటం దేహతాదాత్మ్యం వీడిన భగవానునికే చెల్లింది. ప్రపంచంలో లక్షలాది మందికి ఆధ్యాత్మిక చైతన్యం కల్గించిన వారు రమణ మహర్షి. ప్రపంచ ప్రఖ్యాత తత్త్వవేత్త డా॥ రాధాకృష్ణన్ మహర్షిని దర్శించి ఆయన ముక్తుడని సెలవివ్వటం జరిగింది.

కౌపీన ధారులు, ఆజన్మ బ్రహ్మచర్య వ్రత సంపన్నులు, మౌనవ్రతులు, మహర్షులు, బ్రహ్మజ్ఞాన సంపన్నులు, సాక్షాత్ భగవదంశ సంభూతులు, లక్షలాది దేశవిదేశీయులకు ఆరాధ్యదైవము, నిరాడంబరులు, కరుణా సముద్రులు, శాంతి ప్రదాత అయిన భగవాన్ రమణ మహర్షి ఈ

ఉపదేశసారమనే గ్రంథాన్ని వ్రాయడానికి ప్రేరణ 'మురగనార్' అనే ఒక తమిళకవి. దీనికి సంబంధించిన కథ ఒకటి ఉన్నది.

శివ పురాణంలో ఒక కథ ఉన్నది. దారుకావనంలో కొంత మంది మునులు వైదిక కర్మకాండలకు సంబంధించిన యజ్ఞయాగాదులు చేస్తూ జీవిస్తూండేవారు. వారు ఎంతో భక్తి శ్రద్ధలతో ఈ కర్మకాండను సాగించేవారు.వారు చేసే ఈ యజ్ఞ యాగాది కర్మల వల్లనే తమ కోరికలు సిద్ధిస్తాయని, తమకు సుఖ సంతోషాలు కలుగుతాయని, తద్వారా మోక్ష ప్రాప్తి కలుగుతుందని నమ్మేవారు. వారు ఎన్నో యోగసిద్ధులు కూడా పొందటంతో వారిలో కొంత అహంకారం కలిగింది. తాము నిర్వహిస్తున్న కర్మల వల్లనే తమకు ఈ సిద్ధులు లభించాయని,ఇందులో భగవంతుని ప్రమేయం ఏమీ లేదని నిశ్చయించారు. ఎన్ని సిద్ధులు పొందినా వారు సంపూర్ణమైన ఆనందాన్ని, తృప్తిని, పొందలేక పోతున్నారు. వారందరికి ఆత్మజ్ఞానాన్ని కలిగించి, వారి భ్రమలను పోగొట్టి; వారి దు:ఖాన్ని, అసంతృప్తిని పోగొట్టి; వారికి శాశ్వత ఆనందం కలిగించాలనే సంకల్పం కలిగింది పరమశివునికి. వెంటనే పరమశివుడు ఒక యువకుడైన సాధువు రూపంలో కర్మకాండలు సాగిస్తున్న మునుల వద్దకు చేరుకున్నాడు. ఇక్కడే మనకొక అనుమానం కలుగుతుంది. ఏమాత్రం జ్ఞానం లేకుండా, కేవలం యజ్ఞ యాగాది క్రతువులు ఆచరించే మునులకు భగవంతుని సాక్షాత్కారం ఎలా కలిగింది? పైగా వారు తమ కర్మలే తమకు ఫలితాన్నిస్తాయని నమ్మిన వారు గదా! భగవంతుని ప్రమేయం ఏమీలేదని నమ్మినవారు గదా! ఇక్కడే మనం ఒక కిటుకును తెలుసుకోవాలి. శాస్త్రాలలో యజ్ఞ, దాన, తపస్సులు సత్కర్మలని, వాటిని చేస్తూండాలని చెప్పటం జరిగింది.వారుభక్తి శ్రద్ధలతో యజ్ఞ కర్మలను చేశారు. అయితే వాటి కారణంగా కలిగిన సిద్ధులతో అహంకారం పెరిగి భగవంతునికి దూరమయ్యారు. అయినా కర్మలను

వదలలేదు. ఎవరైతే సత్కర్మలు ఆచరిస్తారో, వారికి భగవంతుని అనుగ్రహం తప్పక కలుగుతుంది. ఆ అనుగ్రహం ఒక మహాత్ముని రూపంలోనో, ఒక గురువు రూపంలోనో కలిగి వారి ద్వారా ప్రయోజనం సిద్ధిస్తుంది. మహాత్ముల దర్శనం వల్ల, గురువుల సాంగత్యం వల్ల 'జ్ఞానసిద్ధి' కలుగుతుంది. ఐతే వారిని విశ్వసించి వారి ద్వారా ఉన్నత స్థితికి వెళ్ళేందుకు కొందరు ప్రయత్నం చేస్తారు. కొందరు ప్రయత్న లోపంతో విఫలమవుతారు. అది వేరే విషయం.

ఇప్పుడు జరిగింది కూడా అదే. మునుల యొక్క సత్కర్మల కారణంగానే భగవంతుని అనుగ్రహం లభించింది. అయితే ఆ మునులు దానిని ఎలా ఉపయోగించుకున్నారో చూద్దాం. తమ ఎదుట ప్రత్యక్షమైన యువకుణ్ణి వారసలు చూడనే లేదు. చూచినా పట్టించుకోనే లేదు. వారు వారివారి కర్మలలో నిమగ్నమయ్యారు. అయితే ఆ మునుల భార్యలు మాత్రం ఆ యువకుణ్ణి చూచి అతడి రూపానికి మోహపరవశులై అతడి వెంటబడి పోయారు. అలా ఎంతదూరం వెళ్ళారో, ఎక్కడకు వెళ్ళారో వారికే తెలియదు. అయితే ఆ యువకుణ్ణి వదలకుండా తిరుగుతున్నారు. ఇక్కడ ఈ మునీశ్వరులు తమ భార్యలు కనిపించక పోవటాన్ని గమనించి, చేస్తున్న కర్మలను ఎక్కడివక్కడే వదిలేసి తమ భార్యలను వెతుక్కుంటూ ఆ వనమంతా తిరుగుతున్నారు. అలా తిరిగి తిరిగి ఒక ప్రదేశంలో తమ భార్యలను కనుగొన్నారు. వారుభర్తల వైపుకు చూడకుండా ఆ యువ సాధువు వెంటపడి వెళ్తున్నారు. ఇది చూచిన మునులకు ఆగ్రహం కలిగింది. దీనికంతటికి కారణం ఆ యువసాధువే నని నిశ్చయించుకొని, అతణ్ణి హతమార్చటానికి వారి యోగ శక్తులను, సిద్ధులను ఉపయోగించి అనేక ఆయుధాలు సృష్టించి అతడి మీదికి వదిలారు.అయితే ఎన్ని రకాల ఆయుధాలు తనపై పడుతున్నా ఏమాత్రం చలించకుండా, బెదరకుండా ఆ యువ సాధువు చిరునవ్వుతో ప్రశాంతంగా ఉండిపోయాడు. మునులు తమకున్న సిద్ధులన్నింటిని

ప్రయోగించారు కాని ఆ యువకుణ్ణి ఏమీ చేయలేకపోయారు. భగవంతుడిచ్చిన సిద్ధులు భగవంతుణ్ణేమి చేయలేవు. అతడు చిరునవ్వులు చిందిస్తూ విలాసంగా అటూఇటూ తిరుగుతూన్నాడు. ఈ దృశ్యాన్ని చూచిన మునులకు కనువిప్పు కలిగింది. తమకు లభించిన సిద్ధులు ఏవీ తమను రక్షించలేక పోయాయని, దీనికి కారణం ఆ వచ్చినవాడు సామాన్య సాధుయువకుడు కాదు, సాక్షాత్తు పరమశివుడేనని గ్రహించారు. తమ తప్పులను క్షమించి తమను అనుగ్రహించమని అతని పాదాలపై పడి వేడుకున్నారు. తమ దు:ఖాలన్నీ తొలగి, ఆనందం కలగటానికి తగిన సిద్ధులు ప్రసాదించమని వారు పరమశివుని వేడుకున్నారు. దు:ఖాలు కలగటానికి, అవి తొలగక పోవటానికి కారణం 'సిద్ధులు' లేక పోవటం కాదని, ఆత్మజ్ఞానం లేకపోవటమేనని, ఆత్మజ్ఞానం వల్లనే సమస్త దు:ఖాలు నివృత్తియై శాశ్వత ఆనందం కలుగుతుందని పరమశివుడు వారికి హిత బోధచేసి, వారి అభ్యర్థనపై వారికి ఆత్మజ్ఞానాన్ని ప్రసాదించాడు.

శివపురాణంలోని ఈ కథను తమిళ కవి 'మురుగనార్' గ్రంథ రూపంలో వ్రాసి, చివరిలో పరమశివుని చేత మునులకు బోధించబడిన ఆత్మజ్ఞానాన్ని మాత్రం వ్రాయకుండా వదిలేశాడు. ఎందుకంటే ఆత్మజ్ఞానాన్ని గురించి చెప్పాలన్నా, వ్రాయాలన్నా కేవలం గ్రంథాలు చదివే కవులకు, పండితులకు అర్హత లేదు. దానికి ఆత్మజ్ఞాన సంపన్నులు, బ్రహ్మ నిష్ఠులైన వారే అర్హులు – అని నమ్మినవాడు మురుగనార్ కవి. అందుకే ఆయన భగవాన్ రమణ మహర్షిని సందర్శించి, తన గ్రంథాన్ని గురించి చెప్పి, చివరిలో పరమశివుని జ్ఞానబోధను తాను విడిచిపెట్టిన సంగతి చెప్పి 'తమరే ఈగ్రంథాన్ని పూర్తిగావించాలి' అని ప్రార్థించాడు. ఆ అర్థించిన సమయం ఎట్టిదో – ఆ కవి అదృష్టం వల్ల, మనందరి అదృష్టం వల్ల మహర్షి అంగీకరించి, తమిళంలో ఈ ఉపదేశసారాన్ని వ్రాశారు. ఆ తరువాత

ఆయనే దీనిని మళయాళం,తెలుగు, సంస్కృతంలోనికి అనువదించారు. ఇది సంస్కృతంలోని ఉపదేశసారం.

# ఉపదేశసారం

## 'కర్మయోగం'

ఇది 30 శ్లోకాలతో ఉన్న చిన్న గ్రంథం. ఈ శ్లోకాలను 'లలిత వృత్తాలు' అంటారు. చిన్న చిన్న పదాలతో సూత్రాల రూపంలో కనిపిస్తాయి. అయితే అనంతమైన అర్థంతో విలసిల్లే జ్ఞానరత్నాలు ఇవి. ఈ 30 జ్ఞాన రత్నాలలో అనంతమైన విజ్ఞానాన్ని మహర్షి నిక్షిప్తం చేశారు. తినబోతూ రుచి అడగటమెందుకు? ప్రథమ రత్నాన్ని చూడండి.

**శ్లో॥ కర్తు రాజ్ఞయా ప్రాప్యతే ఫలం ।**
**కర్మకింపరం కర్మతజ్జడం ॥ –1**

**ప్రతిపదార్థం** :– కర్తు: ఆజ్ఞయా = సృష్టికర్త (భగవంతుని) ఆజ్ఞ ప్రకారమే; ఫలం ప్రాప్యతే = కర్మఫలం వస్తున్నది; కర్మజడం = కర్మ జడం గనుక, కిం = ఏ విధంగా; తత్ కర్మ = ఆ జడమైన కర్మ: పరం = శ్రేష్టమైనది ఔతుంది?

**భావం** :– జగత్తుకు కర్త అయిన భగవంతుని నిర్ణయం ప్రకారంగానే మనకు కర్మఫలాలు లభిస్తున్నాయి. కర్మ ఏమో జడమైనది. కనుకనే తనంతట తానుగా ఫలితాలనివ్వలేదు. అట్టి జడమైన కర్మ ఏవిధంగా శ్రేష్టమైన దౌతుంది? ఏ విధంగా అది ఆత్మసాక్షాత్కారాన్ని – మోక్షాన్ని కలిగిస్తుంది?

**వ్యాఖ్య** :– ఏ గ్రంథాన్నైనా ప్రారంభించేటపుడు భగవంతుని స్మరించటం లేదా మంగళవాచకాన్ని ప్రయోగించటం శిష్టాచార సాంప్రదాయం. అనేక ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు 'అథ' అనే మంగళ వాచకంతో ప్రారంభించబడ్డాయి. వేదాంతోపన్యాసం ప్రారంభించేటప్పుడు కూడా

ఓంకారంతో ప్రారంభిస్తాం. ఇదంతా దేనికి ? అంటే – మనం ప్రారంభించిన కార్యం నిర్విఘ్నంగా పరిసమాప్తి కావాలి, అనే ఉద్దేశంతోనే ఇలా చేస్తాం. మరి ఇక్కడ కూడా శ్రీ రమణ మహర్షి కర్తు: ఆజ్ఞయా అంటూ జగన్నియామకుడైన కర్తను – భగవంతుని స్మరిస్తూ గ్రంథాన్ని ప్రారంభిస్తున్నారు. కర్త అంటే సృష్టికర్త – స్థితి కర్త – లయకర్తయై, త్రిమూర్తి స్వరూపుడైన పరమాత్మయే. ఆయనే ఈ సమస్త ప్రపంచమునకు కారణమైనవాడు, ఆధారభూతమైనవాడు. అట్టి పరమాత్మ స్మరణతో ఈగ్రంథాన్ని ప్రారంభించటం శిష్టాచార సాంప్రదాయానికి అనుగుణమే.

**కర్తు**: ఆజ్ఞయా ప్రాప్యతే ఫలం అంటున్నారు మహర్షి. అంటే భగవంతుని ఆజ్ఞ వల్లనే ఆయన నిర్ణయానుసారంగానే కర్మఫలం లభిస్తున్నదీ అని.

ప్రపంచమంతా కర్మలతో నిండిఉన్నది. ఈ లోకంలో ప్రతి ప్రాణీ నిరంతరం ఏదో కర్మ చేస్తూనే ఉండాలి. కర్మలు చేయకుండా ఒక్కక్షణం కూడా జరగదు. అందుకే భగవద్గీతలో "నహికశ్చిత్ క్షణమపిజాతు తిష్ఠత్యకర్మకృత్" అన్నారు. మానవులు తప్ప మిగిలిన ప్రాణులన్నీ ఏ ఇన్‌టెన్షన్ లేకుండా, ఏ ఉద్దేశము లేకుండా, వాటి ప్రేరణలను బట్టి, అలవాట్లను బట్టి, ఇన్‌స్టింక్ట్‌ను బట్టి అవి కర్మలు చేస్తుంటాయి. కాని మానవుడు మాత్రం బుద్ధిలోని కోరికలకు, సంకల్పాలకు, ఆశలకు, ఆశయాలకు అనుగుణంగా కావాలని కర్మలను చేస్తుంటాడు. కొన్ని నిత్యకర్మలను అతడు అలవాటుగా చేస్తుంటాడు. అవిగాక కొన్ని నైమిత్తిక కర్మలను – అవి శ్రౌత కర్మలు గాని, స్మార్త కర్మలు గానీ, లౌకిక కర్మలు గాని ఒక ఇన్‌టెన్షన్‌తో, ఆలోచనతో, ఆశతో, ఆశయంతో, ఉద్దేశంతో చేస్తుంటాడు. అలా చేసిన కర్మలకు ఫలితాలను పొందుతుంటాడు. కాకపోతే అవి తనకు సంతృప్తిని, సంతోషాన్ని కలిగించనూ వచ్చు; కలిగించకపోనూ వచ్చు.

అయితే ఈ వచ్చే కర్మ ఫలాలన్నీ చేసిన కర్మల కారణంగా వస్తున్నవే గనుక; ఆ ఫలాలనిచ్చేది ఆ కర్మలేనని అవే స్వతంత్రంగా ఫలితాలనిస్తాయని, ఇందులో భగవంతుని ప్రసక్తి ఏమీ లేదు అని మీమాంసకుల అభిప్రాయం. బౌద్ధమతం కూడా అదే చెబుతున్నది. అయితే ఈ అభిప్రాయాలను రమణ మహర్షి ఈ మొదటి శ్లోకం ద్వారా ఖండిస్తున్నారు. వేద ధర్మాన్ని సమర్థిస్తున్నారు.

అసలు ఎవరైనా కర్మలెందుకు చేస్తారు? ఏదో అసంతృప్తి – కొరత ఉండటం వల్ల. ఏమిటా అసంతృప్తి? పరిపూర్ణమైన, దుఃఖ రహితమైన శాశ్వత ఆనందం లేకపోవటమే. ఈ అసంతృప్తి అందరిలోనూ ఉంటున్నది. కాని దానిని తొలగించుకొని శాశ్వత, పరిపూర్ణ, దుఃఖ రహిత ఆనందాన్ని పొందటానికి ఎవరికి తోచిన కర్మలు వారు చేస్తున్నారు. అందరూ ఒకరకంగా చేయటం లేదు. అందుకే అందరికీ ఒకే రకమైన ఫలితమూ కలగటం లేదు.

ఫలితాలను కర్మలే స్వయంగా ఇస్తున్నాయా? అని పరిశీలిద్దాం. కొందరు ఒకేరకమైన కష్టం చేస్తూ ఉంటారు. కాని వారికి వచ్చే ఫలితంలో తేడా ఉంటున్నది. ఇద్దరు రైతులు ప్రక్కప్రక్కనే ఉన్న పొలాల్లో ఒకే పంటను పండిస్తారు. ఒక్కరి చేతనే పొలం దున్నించారు. ఒకేరకం విత్తనాలు, మందులు కొనివాడారు. ఒకే విధమైన వ్యవసాయం చేశారు. అయినా వారికి వచ్చే ఫలితాలు ఒకేరకంగా ఉండటం లేదు. ఎందువల్ల?

ఇద్దరు విద్యార్థులుచక్కగా చదివి మంచి మార్కులతో పాసయ్యారు. ఇద్దరూ డాక్టర్లయ్యారు. కాని ఇద్దరికీ వేరు వేరు ఫలితాలు. ఒకరికి మంచిపేరు ప్రఖ్యాతులు వచ్చినయ్. ఆదాయం బాగా ఉన్నది. మరొకరికి ప్రాక్టీస్ ఏ మాత్రం లేదు. ఎందువల్ల?

ఒకడు చాలా తెలివిగలవాడు. అతడి స్నేహితుడు తెలివి

తక్కువవాడు. ఇద్దరూ ఒకే వ్యాపారం ప్రారంభించారు. తెలివిగలవాడు దివాలా తీశాడు. తెలివి తక్కువ వాడు గొప్ప లీడింగ్ షాపు నడుపుతూ టౌన్‌లోనే ప్రథముడుగా ఉన్నాడు. ఎందువల్ల?

కర్మలకే గనుక ఫలితాలనిచ్చే శక్తి ఉంటే అవి తప్పకుండా ఒకే కర్మకు ఒకే ఫలితం ఇవ్వాలి గదా! అలా ఇవ్వలేదేమి?

మంచి లాభం రావాలని వ్యాపారం చేస్తే నష్టం వస్తున్నది. ఇంత రావాలి అనుకొంటే అంతే రావటం లేదు. ఒక్కొక్కప్పుడు ఊహించనంత లాభాలొస్తున్నాయి. అంటే ఫలితాలను పొందటంలో ఏదో అదృశ్య శక్తి హస్తం ఉందన్నమాట. అదే భగవంతుడు. కర్తు: అని చెప్పటం జరిగింది.

నిజంగా అదృశ్యశక్తి అయిన భగవంతుడే కర్మఫలాలనిచ్చే వాడు అని చెప్పడానికి గొప్ప రుజువు ఉన్నది. ఏమిటది?

మనం ఎప్పుడో చేసిన కర్మలకు ఫలితాన్ని ఇప్పుడు పొందుతున్నాం. అసలు ఎన్నో జన్మల ముందు చేసినకర్మల ఫలాన్ని ఇప్పుడు పొందుతున్నామంటే ఆ కర్మల యొక్క జ్ఞానాన్ని తెలిసిన వాడు, ఆ కర్మలను చేసినప్పుడు చూచినవాడు, ఆ కర్మల ఫలం అప్పుడు పొందకుండా చనిపోయి మరొక రూపంలో ఇప్పుడు పుట్టినా అతడే ఇతడు అని గుర్తించగల సర్వజ్ఞుడు, కర్మలు చేసిన వాడు చనిపోయినా తాను చనిపోకుండా శాశ్వతంగా ఎప్పుడూ ఉండేవాడు ఒకడు ఉండబట్టే గదా! ఆ కర్మలకు తగిన ఫలాన్ని నిర్ణయించి ఇప్పుడు ఇస్తున్నాడు. అంటే ఆ సర్వజ్ఞుడు, చావుపుట్టుకలు లేకుండా అన్ని కాలాలలో ఉన్న నిత్యుడు, నిరాకారుడు, సర్వవ్యాపకుడు, కర్మల గతికి నియామకుడు అయినవాడు ఆ భగవంతుడు గాక మరెవరు? కర్మలేమో జడం గనుక వాటికి ఈ శక్తి లేదు. కనుక భగవంతుడే 'కర్మఫల ప్రదాత' అని అంగీకరించక తప్పదు. అందుకే

భగవంతుని కర్మాధ్యక్షుడు అంటారు. ప్రతి కర్మకు దానిని నిర్వహించిన క్రమాన్ని బట్టి, దాని వెనుకనున్న ఉద్దేశాన్ని బట్టి, తగిన ప్రతిఫలాన్ని ఎప్పుడివ్వాలో, ఎలా ఇవ్వాలో, ఎంత ఇవ్వాలో నిర్ణయించేది భగవంతుడే. ఇచ్చేది ఆయనే.

నిజంగా కర్మలు చేసేది నేను. కాని ఫలితాలు మాత్రం నా చేతుల్లో లేవు. ఉంటే ఎప్పుడూ మంచి ఫలితాలే తెచ్చుకుంటాను గాని, చెడ్డ ఫలితాలను, దు:ఖ ఫలితాలను, అసంతృప్తి కలిగించే ఫలితాలను ఎందుకు తెచ్చుకుంటాను? అంటే కర్మలు చెయ్యటం నాచేతుల్లో ఉన్నదే గాని ఫలితాలు మాత్రం నా చేతుల్లో లేవు. జీవుడి చేతుల్లో లేదు. అంటే దీనికి కారణం జీవుని కన్న వేరైనది ఒకటి ఉండాలి. అదే భగవంతుడు. అందుకే గీతలో "కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన" అన్నారు. అంటే కర్మలు చేయటంలోనే నీకు అధికారం ఉన్నది. ఫలితం కోరవద్దు అని. అంటే ఇక్కడ నిజమైన అర్ధం ఫలితం పొందటంలో నీకు అధికారం లేదు అని గాదు, అధికారం తప్పకుండా ఉన్నది. తప్పకుండా ఫలితాన్ని పొందుతావు. అయితే 'మాఫలేషు' అంటే ఫలితం కోరవద్దు. అంటే ఫలితం మీద దృష్టి వద్దు అని. ఎందుకంటే నీవు కోరిన ఫలితం వస్తుందో రాదో తెలియదు. ఎలాంటి ఫలితం వస్తుందో, ఎప్పుడు వస్తుందో కూడా తెలియదు. ఫలితం మీద దృష్టి పెట్టినచో తగిన ఫలితం – కోరిన ఫలితం రానప్పుడు దు:ఖపడాలి, బాధపడాలి, నిరాశ నిస్పృహ చెందాలి. కనుక అసలు ఫలితం మీద దృష్టి పెట్టకుండా నీ కర్మలు సాగించు అని మాత్రమే. దీని వల్ల కర్మలకు తగిన ఫలితాలను నిర్ణయించి ఇచ్చేవాడు భగవంతుడే అని అర్ధమౌతుంది. ఆయన ఎటువంటి పక్షపాత బుద్ధి లేకుండా, ఏ పొరపాటు పడకుండా, లెక్కప్రకారం, చట్ట ప్రకారం – ఆయన చట్టం ప్రకారం, ధర్మంగా రావలసిన దానినే ఇస్తూ ఉంటాడు.

నిజంగా కర్మలే ఫలితాల్ని ఇవ్వాలి అంటే ఫలాన్ని లెక్కగట్టే తెలివి వాటికి ఉండాలి. చేసే వాని ఉద్దేశాన్ని కనిపెట్ట గలిగే తెలివి వుండాలి. వాయిదాల పద్ధతి లేకుండా ఎప్పటి ఫలితాల్ని అప్పుడే ఇవ్వాలి. ఎందుకంటే ఎప్పుడో ఇద్దాం అంటే పుచ్చుకొనే వాడు ఉండొచ్చు. పోవచ్చు. మళ్ళీ అతణ్ణి కనిపెట్టాలంటే సాధ్యమా? కానేకాదు. ఎందుకంటే కర్మలు జడం. జడమైన కర్మలు ఫలాన్ని నిర్ణయించి ఇవ్వలేవు. ఒకడుకూలిపని చేస్తాడు. సాయంత్రానికి అతడికి కూలి డబ్బు రావాలి. ఆ పనే ఇస్తున్నదా? లేదు.ఆ పనిని బట్టి లెక్కగట్టి యజమాని ఇస్తున్నాడు. ఒకవేళ ఆరోజు అతడు తీసుకోలేకపోతే మరు రోజు ఇస్తున్నాడు.అంటే ఫలాన్ని స్వయంగా కర్మ ఇవ్వలేదు అని తేలిపోయింది.

ఇట్టి జడమైన కర్మ శ్రేష్ఠమైనదా? ఉత్కృష్టమైనదా? మోక్షదాయకమైనదా? జీవిత సాఫల్యానికి నమ్మకోదగినదా? అని మహర్షి ప్రశ్నిస్తున్నారు – కర్మకింపరం? అని. అంటే జడమైన కర్మలు నీకు శాశ్వతానందాన్నివ్వలేవు. జన్మ సాఫల్యాన్ని కలిగించలేవు. కనుక పరంకావు. మరి అట్టి కర్మలను జన్మజన్మలలోనూ అలా చేసుకుంటూ పోవటమేనా ? –అలా కర్మలను చేసుకుంటూ పోతుంటే ఏం జరుగుతుంది? 2వ శ్లోకంలో

**శ్లో॥ కృతిమహోదధౌ పతన కారణం ।**
**ఫలమశాశ్వతం గతి నిరోధకం ॥ –2**

**ప్రతిపదార్థం** : కృతి మహోదధౌ = కర్మలనే మహాసముద్రము నందు, పతన కారణం = పడిపోవటానికి కారణమవుతాయి, పలం అశాశ్వతం = కర్మల యొక్క ఫలం శాశ్వతం కాదు, గతి నిరోధకం = మోక్ష మార్గానికి ఆటంకం కలిగిస్తాయి.

**భావం** : కర్మలను అలా చేసుకుంటూ పోతే కర్మ సముద్రంలో మునిగి పోవటమే జరుగుతుంది.పోనీ కర్మ ఫలాలు శాశ్వతంగా ఉండేవా? అంటే

కాదు. మోక్షమార్గానికి ఈ కర్మలు ఆటంకం కలిగిస్తాయి.

**వ్యాఖ్య :** కర్మ కింపరం? కర్మశ్రేష్టమైనదా ? అని క్రిందటి శ్లోకంలో మహర్షి ప్రశ్నించారు. అది శ్రేష్టమైనది కాదు, జీవిత సాఫల్యానికి నమ్మకోదగినది కాదు, మోక్ష దాయక మైనది కాదు, పైగా అది మోక్షానికి ప్రతిబంధకమైనది అని ఈ శ్లోకంలో చెబుతున్నారు.

కర్మలెన్ని ఆచరిస్తున్నా సరే తృప్తి అనేది ఎప్పటికీ కలగదు. సరిపోయినంత సంపాదించుకున్నాం. చక్కని ఇల్లు కట్టకున్నాం. మంచి ఉద్యోగం ఉంది. బుద్ధిమంతులైన పిల్లలున్నారు – అని తృప్తిపడే వాడు ఈలోకంలోనే లేడు. ఎప్పుడూ ఏదో లేని దానిని గురించే ఆలోచిస్తాడు. వున్నది చాలదని భావిస్తాడు. ఇంకా ఏదేదో కావాలనుకుంటాడు. తనకన్నా ఉన్నతంగా ఉన్నవాణ్ణి గురించి ఆలోచిస్తాడు. కొరతలతో, కోరికలతో, అసంతృప్తితో వేగిపోతుంటాడు. ఇలా ఆంతర్యంలో అసంతృప్తితో రగిలిపోయేవాడు ఏదేదో కావాలని, ఏదేదో చేయాలని సంకల్పాలు చేస్తుంటాడు. ఈ సంకల్పాలకు అనుగుణంగా కర్మలుచేస్తూ ఉంటాడు. కర్మలు చేసినప్పుడు ఫలితం అనేది తప్పకుండా వస్తుంది. అది నీవు కోరుకున్న ఫలితం కావచ్చు,కోరుకోనిది కావచ్చు. నీకు సంతోషం కలిగించేది కావచ్చు. దు:ఖాన్ని కలిగించేది కావచ్చు. అలా వచ్చిన ఫలితాన్ని అనుభవిస్తావు. ఇలా కర్మఫలాలను అనుభవించటం వల్ల ఆ అనుభవం నీలో వాసనలుగా – సంస్కారాలుగా ముద్రపడతాయి. సుఖమైతే మళ్ళీ మళ్లీ అనుభవించాలని, దు:ఖమైతే రాకుండా తప్పించుకోవాలనీ నీలో ముద్రలు పడిపోతాయి. ఈ వాసనలే మళ్ళీ మళ్ళీ నిన్ను కర్మలకు ప్రేరేపిస్తాయి. సుఖాన్నిచ్చే కర్మలు చేయాలని, ఇంతకు ముందు పొందిన దు:ఖాన్ని పొందకుండా ఉండే కర్మలు చేయాలని ప్రేరణలు కలుగుతాయి. దానితో మళ్ళీ కర్మలు చేస్తావు. మళ్ళీ ఫలితం వస్తుంది. మళ్ళీ అనుభవిస్తావు.

మళ్ళీ వాసనలు - సంస్కారాలు పేరుకుంటాయి. ఇదొక సైకిల్. కర్మ -కర్మఫలం - అనుభవం - వాసన - ప్రేరణ... ఇలా ఎంతకాలమైనా చేసుకుంటూ పోవటానికి దేహం అనుమతించదు. దేహం బలహీనమై - ఏదో ఒకనాటికి రాలిపోతుంది. అయితే దేహం రాలిపోయినా మనస్సులో ముద్రలు పడిన సంస్కారాలు - వాసనలు ఎక్కడకూ పోవు. కర్మలు చేయలేక పోయినా చేయాలనే భావన (వాసన) అలాగే ఉన్నది గనుక వాటిని ఖర్చు చేసుకొనుటకు తగిన దేహాన్ని తీసుకొని మళ్ళీ ఈలోకం లోకి వస్తావు. అలా వచ్చి పూర్వ దేహంలో ఉన్నపుడు ప్రోగు చేసుకున్న వాసనల ప్రేరణతోమళ్ళీ కర్మలు చేయటం ప్రారంభిస్తావు. మళ్ళీ చక్రం తిరగటం ప్రారంభం. ఇక ఈ దేహం పోతే మరొక దేహం. ఇలా జన్మ - కర్మ - జన్మ - కర్మ వలయంలో - సుడిగుండంలో చిక్కుకొని గిరిగిర తిరుగుతూ ఉండాల్సిందే. "పునరపి జననం పునరపి మరణం పునరపిజననీ జఠరేశయనం.." అన్నట్లు జనన మరణ రూప సంసార చక్రంలో ఇరుక్కుపోతావు. ఇదే కర్మ మహా సముద్రం. సముద్రంలో నిరంతరం అలలు వస్తూనేఉంటాయి. వచ్చినవి ఒడ్డుకు చేరి పడిపోతూనే ఉంటాయి. మళ్ళీ వెనుక నుండి వస్తూనే ఉంటాయి. ఒక్క క్షణం కూడా ఆగే పనే లేదు. అందుకే కర్మలను - జన్మలను - ఈ సంసార చక్రాన్ని సముద్రంతోపోల్చారు. కృతి మహోదధౌ పతన కారణం - కర్మ మహాసముద్రంలో పడిపోవటానికి కర్మలు కారణమౌతున్నాయి. మనం నిత్య సుఖాంబోధిలో పడాలని కోరుకుంటున్నాం. కాని కర్మ సముద్రంలో పడిపోతున్నాం.

ఇలా కర్మలు చేస్తూ - ఫలితాలు పొందుతూ - మళ్ళీ చేస్తూ - మళ్ళీ ఫలితాలు పొందుతూ కర్మ సముద్రంలో పడిపోతే నష్టమేమిటి? అంటావా ! ఈ ఫలితాలేవీ శాశ్వతం కాదు. పైగా మోక్షాన్ని పొందాలని, శాశ్వత ఆనందాన్ని పొందాలని భావించే మానవుడికి ప్రతిబంధకమై

కూర్చుంటున్నాయి.

**ఫలం అశాశ్వతం** : మనం కర్మలు చేస్తుంటాం. ఫలితాలొస్తాయి. ఆ వచ్చిన ఫలితాలు అలాగే శాశ్వతంగా ఉంటున్నాయా? లేదు. అవి ఎప్పుడో ఒకప్పుడు పోయేవే. ఏ కర్మ ఫలమైనా కాలంలో వచ్చి, కాలంలోనే పోతుంది. నళినీ దళగత జలం వలె అతి తరళం, క్షణికం, ఏ గాలి వాటుకైనా అది చెదిరి పోయేదే. ఎంతో కష్టపడి సంపాదించిన ధనం గాని, సంపదలు గాని, ఇళ్ళు వాకిళ్లు గాని చూస్తుండగానే చేజారిపోతుంటాయి. ఎంతో మోజుతో తెచ్చుకున్న వస్తువులు చెడిపోవటమో, దూరం కావటమో జరిగిపోతుంది. ఒక వేళ సత్కార్యాలు – పుణ్యకార్యాలు చేసి పుణ్యం సంపాదించినా స్వర్గసౌఖ్యాలు అనుభవించటంతో ఖర్చైపోతున్నది. అలాగే ఎంత పాపం చేసినా – నేరం చేసినా శిక్ష అనుభవించటంతో రద్దై పోతుంది. ఇంతవరకు ఏ కర్మఫలమూ – ఎవరికీ శాశ్వతంగా లేదు. ఇకముందు ఉండదు. ఒకవేళ అది ఉన్నా అనుభవించడానికి నీవుండవు. ఈ దేహాన్ని, ఈ లోకాన్ని వదిలి ఎక్కడికో వెళ్ళి పోతావు. కనుక కర్మఫలం అశాశ్వతమైనది, అనిత్యమైనది, క్షణికమైనది.

అంతేకాదు అది గతి నిరోధకం కూడా. శాశ్వతమైన ఆనందాన్ని పొందాలనుకున్న వానికి ఈ తాత్కాలిక సుఖాలు ప్రతిబంధకమౌతున్నాయి. ఎప్పటికప్పుడు ఈ అనిత్యమైన – లౌకిక సుఖాల కొరకు కర్మల వెంట పరుగులిడే మానవుడు వాటిని పొందుతూ, అనుభవిస్తూ, ఇంకా ఏవేవో పొందాలని ఆరాటపడుతూ కర్మ సుడిగుండంలో చిక్కుకుపోతున్నాడు. శాశ్వత ఆనందానికి దారితీసే జ్ఞాన సంపాదనలో అశ్రద్ధ చేస్తున్నాడు, వెనకబడి పోతున్నాడు, ఆలోచించే వ్యవధి కూడా చిక్కటం లేదు.

నిజంగా కర్మలన్నీ అజ్ఞానంలోనే చేస్తాడు. నేను ఆనంద

స్వరూప ఆత్మను అని తెలియని అజ్ఞాన స్థితిలో ఆనందం కొరకు కర్మలు చేస్తుంటాడు. అజ్ఞానంలో జరిగే కర్మలు ఎన్నటికీ అజ్ఞానాన్ని తొలగించలేవు. జ్ఞానం వల్లనే అజ్ఞానం తొలగాలి తప్ప మరొక మార్గం లేదు. కస్తూరి మృగం తన నుండే సువాసన వస్తున్నదని తెలుసుకోలేక ఆ సువాసన ఎక్కణ్ణించి వస్తున్నదో తెలుసుకుందాం – బాగా ఆఘ్రాణించి ఆనందిద్దాం అని అడవి అంతా పిచ్చిపిచ్చిగా తిరుగుతుంది. ఒంటె ముళ్ళకంపను తింటూ – ఆ ముళ్ళ వల్ల వచ్చే రక్తాన్ని త్రాగుతూ ముళ్ళకంప భలే మజాగా వుంటుందని భావిస్తుంది. కాని ఆ మజా తన రక్తాన్ని త్రాగటం వల్లనేనని తెలియదు. అలాగే మనం కూడా ఆనందం మనలోనే ఉన్నదని తెలుసుకోలేక, దాన్ని పొందటానికి ఈ ప్రపంచం వైపుకు తిరిగి పిచ్చి పరుగులు తీస్తూ, రకరకాల కర్మలు చేస్తూ, ఏవేవో ఫలితాలను పొందుతూ, అనుభవిస్తూ కర్మ సముద్రంలో పడి పోతున్నాం. ఇలా ఎంతకాలం కర్మలు చేసినా శాశ్వత ఆనందం లభించదు గాక లభించదు. ఎందుకంటే పరిమితమైన కర్మలు పరిమితమైన ఆనందాన్నిస్తాయే తప్ప శాశ్వతానందాన్ని – అపరిమిత ఆనందాన్ని ఇవ్వలేవు. అందుకే ఇవి మోక్షసాధనకుఆటంకం కలిగిస్తాయని, ప్రతిబంధకాలవుతాయని మహర్షి గతినిరోధకం అన్నారు.

కర్మల యొక్క ఫలాలు 2 రకాలుగా ఉంటాయి. 1) పుణ్యం, 2) పాపం. పుణ్య ఫలాలు బంగారు సంకెళ్ళయితే పాపఫలాలు ఇనుప సంకెళ్ళు. రెండూ సంకెళ్ళే. రెండూజీవుణ్ణి బంధించేవే. ఒకటి బంగారు కత్తి. రెండవది ఇనుప కత్తి. రెండూ విజ్ఞానమనే తలను నరికేసేవే. రెండూ బంధ కారణాలే. పుణ్యఫలమైనా–పాప ఫలమైనా రెండూ అనుభవించాల్సినవే. అనుభవించటానికి వీలుగా జన్మలను కలిగించేవే. మనకు కావలసింది జన్మలు కాదు. మంచిజన్మలూ కాదు, చెడ్డ జన్మలూ కాదు. జన్మ రాహిత్యం – మోక్షం కావాలి. కాని ఈ కర్మలు మనను కర్మ సుడిగుండంలో – కర్మ

సముద్రంలో ముంచి వేస్తున్నాయి. కర్మ ఫలాలు జన్మలకు కారణాల వుతున్నాయి. సంసార జనన మరణ చక్రంలో ఇరికిస్తున్నాయి. కనుకనే గతి నిరోధకం. సరే కర్మల వల్ల శాశ్వత ఆనందం లేదు. మోక్ష ప్రతిబంధకాలు,గతి నిరోధకాలు. కనుక అసలు కర్మలు చేయకుండా వదిలేద్దామా? అబ్బే అది అసలు కుదరదు. 'నహికశ్చిత్ క్షణమపి జాతుతిష్టత్యకర్మకృత్' అన్నారు. ఒక్కక్షణం కూడా కర్మలు చేయకుండా వుండటం కుదరదు. మరేమిటి మార్గం? తర్వాత శ్లోకంలో

–కర్మఫలం అశాశ్వతం పైగా గతినిరోధకం గదా ! వదిలేద్దామా అంటే కుదరదు అంటున్నారు.

మరి దీనికి పరిష్కారం ఏమిటి ? –

**శ్లో॥ ఈశ్వరార్పితం నేచ్ఛయాకృతం ।**
**చిత్త శోధకం ముక్తి సాధకం ॥ –3**

**ప్రతిపదార్ధం** : న + ఇచ్ఛయాకృతం = కర్మఫలంపై కోరిక లేకుండా చేసిన కర్మ (నిష్కామకర్మ – ఫలాపేక్ష రహిత కర్మ), ఈశ్వరార్పితం = భగవదార్పణ బుద్ధితో చేసిన కర్మ, చిత్త శోధకం = చిత్త శుద్ధిని కలిగించి, ముక్తి సాధకం = ముక్తిని పొందటానికి దారి తీస్తుంది.

**భావం** : కర్మ ఫలంపై కోరిక లేకుండా, భగవదార్పణ బుద్ధితో చేసిన కర్మ చిత్తశుద్ధిని కలిగించి మోక్షాన్ని పొందటానికి సాధనమౌతుంది.

**వ్యాఖ్య** : కర్మలెప్పుడూ అశాశ్వతమైన, అనిత్యమైన ఫలితాలనే ఇస్తాయి. పరిమితమైన కర్మలు అపరిమితమైన ఫలితాలనివ్వలేవు. పైగా కర్మలు చేస్తూ పోతున్నకొద్దీ మనం కర్మ సుడిగుండంలో చిక్కుకు పోతామేగాని దాని నుండి బయట పడలేము. అంతేకాదు కర్మలు మోక్షమార్గానికి ప్రతిబంధకాలు కూడానని క్రిందటి శ్లోకంలో మహర్షి తెలియజేశారు. పోనీ ఇంతగా ఉపయోగం లేనట్టివి, ప్రగతి నిరోధకమైనట్టివి అయిన కర్మలను వదిలేద్దామా

– అంటే అలా వదలటానికీ వీలులేదు. కర్మలు చెయ్యకుండా ఒక్కక్షణం కూడా దేహం మనజాలదు. గాలి పీల్చటం, వదలటం, నీరు త్రాగటం, భోజనం చెయ్యటం, చూడటం, వినటం మొదలైన కర్మలను వదిలి శరీరం ఒక్కక్షణం కూడా ఉండలేదు గదా ! అందుకే 'నహికశ్చిత్ క్షణమపి జాతు తిష్టత్య కర్మకృత్' అని గీతలో భగవానుడు కూడా తెలియజేశాడు. మరి ఎలా దీనికి పరిష్కారం? కర్మలు వదలటానికా వీలులేదు. చేస్తేనా బంధకారణం, ప్రగతి నిరోధకం. ఏమిటి దీనికి పరిష్కారం? చెయ్యటానికీ వీలులేదు, వదలటానికి వీల్లేదా? ఎలా?

పాములు పట్టి, వాటిని ఆడించి జనులకు వినోదం కల్పించి, వారిచ్చిన డబ్బుతో కుటుంబాలను పోషించుకొనే పాముల వాళ్ళు ఉంటారు. వారు ఆ వృత్తిలోనే ఉండి ఉదర పోషణ చేసుకోవాలి. కాని పాములను ఆడించేటప్పుడు అవి కాటేస్తే మరణిస్తారు. అలాగని మానుకుంటే పోషణ జరగదు. మరిఎలా? అందుకే వారు ఆ పాములకున్న కోరలను పీకివేసి ఆడిస్తారు. కోరలు లేవు గనుక మరణ భయం లేదు. ఆడిస్తున్నారు గనుక పోషణ జరిగిపోతుంది.

అలాగే మనం కూడా కర్మలు చేస్తే బంధం. మానేద్దామా? అసలే కుదరదు. కనుక బంధం కాకుండా ఉండేవిధంగా కర్మలు చేయాలి? ఎలా ?కోరికలనే కోరలను పీకేస్తే సరి. కోరిక లేకుండా కర్మలు చేస్తే ఇక బంధం అయ్యే ప్రసక్తే ఉండదు. దీనినే నిష్కామ కర్మ యోగము అన్నారు. దీనినే రమణ మహర్షి 'నేచ్ఛయా కృతం' అన్నారు. న–ఇచ్ఛయా – కృతం = కోరిక లేకుండా చేయబడినది అని.

కోరిక లేకుండా కర్మలు చెయ్యాలంటే – అసలు ఎవరైనా ఏ కోరికా, ఏ ప్రయోజనము లేకుండా కర్మలు చేస్తారా? ఎవ్వరూ చేయరు.ఏదో ఒక ప్రయోజనం ఉండాలి. సుఖం కలగాలి, లాభం రావాలి,

పేరురావాలి, పుణ్యం రావాలి, కీర్తి ప్రతిష్టలు కలగాలి, మనస్సుకు తృప్తి కలగాలి. ఇలా ఏదో ఒక ప్రయోజనం ఉండాలి. అప్పుడే ఎవరైనా కర్మ చెయ్యాలి అని అనుకుంటారు, చేస్తారు. మరి నిష్కామంగా – అంటే ఏ ప్రయోజనాన్ని ఆశించకుండా చెయ్యడమా ? అసలు ఏకోరికా లేకుండా చెయ్యడమా? బండరాయి లాగా ఉండాలా? కానే కాదు. మంచి జరగాలని – శుభం కలగాలని ఆశించవచ్చు. కానీ ఏం మంచి జరగాలి, ఎంత జరగాలి? అనే నిర్దిష్ట భావాలుండరాదు. అంటే 'మనం చేసే కర్మల వల్ల 'ఫలానా' ప్రయోజనం సిద్ధించాలి' అని ముందుగానే ఊహించకుండా, భావించకుండా, ఆశపడకుండా చెయ్యమని మాత్రమే. నీ దృష్టి కర్మఫలం మీద కాకుండా కర్మల మీదనే ఉంచి నైపుణ్యంతో కర్మలు చెయ్యటమే నిష్కామ కర్మ యోగం. అందుకే 'యోగ: కర్మసు కౌశలం' కర్మలలో నైపుణ్యమే యోగం అని భగవానుడు గీతలో చెప్పారు.కనుక కర్మలను నైపుణ్యంతో చేస్తే అవి బంధం కాక పోగా మోక్షప్రాప్తికి సహాయ కారులవుతాయి.

నిజంగా కర్మల వల్ల ఎవరికీ సుఖదు:ఖాలు కలగటం లేదు. ఆ కర్మల వల్ల వచ్చే ఫలితాలపై ఆసక్తి కలిగి ఉండటం వల్ల, ఫలానా ఫలితాన్ని నేను పొందాలి అనే భావన వల్ల, ఆశ వల్లనే సుఖదు:ఖాలు కలుగుతున్నాయి. బంధ కారణాలవుతున్నాయి.

ఇద్దరు విద్యార్థులు పరీక్షకోసం బాగా కష్టపడి చదువుతున్నారు. అందులో ఒక విద్యార్థి మంచి మార్కులతో ఫస్ట్ క్లాస్‌లో పాస్ కావాలని పట్టుదలతో చదువుతున్నాడు. రెండవ వాడు పరీక్షలు చక్కగా వ్రాయాలి, బాగా కష్టపడాలి అనే పట్టుదలతో చదువుతున్నాడు. ఇద్దరూ పరీక్షలు వ్రాశారు. ఇద్దరూ సెకండ్ క్లాస్‌లో పాసయ్యారు. ఇప్పుడు మొదటి విద్యార్థి నిరాశ–దు:ఖం–బాధతో విలవిలలాడి పోతున్నాడు. రెండవ విద్యార్థి ఆనందంతో గంతులు వేస్తున్నాడు. మొదటివాడి దు:ఖానికి కారణం ఏమిటి?

ఫలితం ఫలానా విధంగా ఉండాలని ముందే నిశ్చయించుకోవటమే తప్పు వేరు కాదు. ఒకే ఫలితంతో ఒకరికి సంతోషం, మరొకరికి దు:ఖం. ఇదే కర్మఫలాసక్తి అంటే. ఇదే ఉండకూడనిది. మరి నిజంగా ఇక్కడ చేయవలసినది ఏమిటి? పరీక్షలు చక్కగా వ్రాయాలి అనేభావనతో బాగా కష్టపడి చదవటమే.ఫలితాలను ముందుగానే ఊహించుకోవటం,తనకు అనుకూలంగా ఉండాలని భావించటం చేయకూడదు.నా ప్రయత్న లోపం లేకుండా కష్టపడి చదవాలి, ఫలితం భగవంతుని చేతిలో ఉన్నది అని భావిస్తూ కర్మ చేయటమే కోరిక లేకుండా కర్మ చేయటం – నిష్కామకర్మ – ఫలాసక్తి లేకుండా చేయబడిన కర్మ 'నేచ్ఛయా కృతం' అని గమనించాలి. కనుక ఇలా కర్మఫలం మీదరాగాన్ని – ఆసక్తిని వదిలి చేసే కర్మయే బంధం కాకుండా పోతుంది. చిత్తశుద్ధికి, మోక్ష సాధనకు ఆటంకం కాకుండా పోతుంది. ఇదే సత్వగుణంలో ఉన్న వాడు కర్మచేసే విధానం.

కోరుకున్న ఫలితాల కోసం కర్మ చేయటం రజోగుణ లక్షణం. కోరిన ఫలితం రాదేమోనని కర్మ మానటం తమోగుణ లక్షణం. ఈరెండూ బంధ హేతువులే కనుక ఫలానా ఫలితం కావాలి అని కర్మఫలం మీద ఆసక్తి – కోరిక లేకుండా కర్మ చెయ్యటమే సత్వగుణ లక్షణం. ఇట్టి సత్వగుణ లక్షణమే చిత్తశుద్ధికి సహాయ పడుతుంది. జనన మరణ రూప సంసార సముద్రంలో చిక్కుకోకుండా, కర్మల వలన కూడా ప్రయోజనం పొందాలంటే కర్మ ఫలాసక్తిని వదలటంతో పాటు మరొక నైపుణ్యం కూడా ఉంది. దీని వలన కర్మలు బంధం కాకపోవటమే గాక మనం మోక్షాన్ని పొందటానికి కూడా ఈ కర్మలు సహాయపడతాయి. అదే భగవదార్పణ బుద్ధితో కర్మలు చేయటం. దానినే మహర్షి 'ఈశ్వరార్పితం' అన్నారు.

నిజంగా కర్మలు చేసే అధికారం మనకుంది.ఫలితాలిచ్చేది మాత్రం భగవంతుడే. కనుక మనం కర్మలను భగవదార్పణ బుద్ధితో

చెయ్యాలి. కర్మలన్నింటిని భగవంతునికి నైవేద్యంగా సమర్పించాలి. అదే మనపెద్దలు ప్రతిపనిని రామార్పణం, కృష్ణార్పణం, భగవదార్పణం అని చెయ్యటం. మనం అలా కర్మలను నైవేద్యంగా భగవంతునికి సమర్పిస్తే కర్మఫలాలను ఎలాగూ ఇచ్చేది భగవంతుడే గనుక మనం వాటిని భగవత్ ప్రసాదంగా స్వీకరించవచ్చు. అలా స్వీకరించాలి కూడా. అలా ప్రసాదంగా స్వీకరిస్తేనే అవి ఈశ్వరార్పిత కర్మలవుతాయి. ప్రసాదంగా స్వీకరించటం అంటే ఏమిటి? మనం దేవాలయంలో పులిహోర, దద్ధోజనం, చక్కెర పొంగలి మొదలగు వాటిని ప్రసాదంగా స్వీకరిస్తాం. ఎలా స్వీకరిస్తున్నాం. భగవంతుని స్మరిస్తూ భక్తితో స్వీకరిస్తాం. మన అదృష్టంగా భావించి స్వీకరిస్తాం. అది మనకిష్టమైనదా కాదా? అనిగాని, రుచిగా ఉన్నదా? లేదా అని గాని, సరిపోయినంత పెట్టారా ? లేదా ? అని గాని ఆలోచించకుండా ఏకొంచం అయినాసరే కళ్ళకద్దుకొని స్వీకరిస్తాం. అంతే గాదు. మనకు లభించిన ఆ కొద్దిపాటి ప్రసాదాన్ని మన ప్రక్కనున్న వారికి కూడా కొంచం పెట్టిగాని మనం నోట్లో వేసుకోం. అలాగే మనం చేసే కర్మల ద్వారా లభించే ఫలాలను కూడా అవి మనం కోరినవైనా, కాకున్నా, అనుకున్నంత లభించినా – లేకున్నా, అది కేవలం భగవంతుని ప్రసాదంగా భావించి, భక్తి భావనతో స్వీకరించాలి. మనకు ఏ కొద్దిపాటి ప్రయోజనం లభించినా తోటివారికి ఎంతో కొంత సమర్పించటం కూడా ఎంతో అవసరం.

ఇలా ఫలితాలను భగవంతుని ప్రసాదంగా స్వీకరించటం వల్లనే చేసిన కర్మలు భగవదార్పణ బుద్ధితో చేసిన కర్మలవుతాయి – ఈశ్వరార్పిత కర్మలవుతాయి. అంతే కాదు నిజంగా కర్మలను మనం భగవంతునికి నైవేద్యంగా సమర్పించాలి. అంటే ఆ కర్మలు భగవంతుని స్మరణతో జరగాలి. ఎలా?కర్మలు చెయ్యబోయేముందు భగవంతుని స్మరించాలి. భగవత్ స్మరణతో ప్రారంభించాలి. అలాగే కర్మలు పూర్తయిన తర్వాత కూడా

భగవంతునికి కృతజ్ఞతలు తెలుపుకోవాలి. అంటే చివరిలోనూ భగవంతుని తలచుకోవాలి. ఇక కర్మ జరుగుతున్నప్పుడు కూడా మధ్య మధ్యలో భగవత్ స్మరణ చేయాలి. ఎలా?

తల్లి తన పసిపాపను ఒడిలో ఆడించుకుంటుంది. బిడ్డ కొంచెం పెరిగి పెద్దయితే తన ఈడు పిల్లలతో ఆడుకోవాలనుకుంటాడు. అందుకని తల్లి అలాంటి పిల్లల వద్ద తన పిల్లవాణ్ణి వదిలి తాను దూరంగా నిలబడి చూస్తుంటుంది. ఈ పిల్లవాడు ఆడుతూ ఆడుతూ మధ్య మధ్య తల్లి అక్కడ ఉన్నదా? లేదా? అని ఆమె ఉన్న వైపుకు చూస్తుంటాడు. అప్పుడు తల్లి 'నేనిక్కడే ఉన్నానులే ఆడుకో'! అన్నట్లు ఆ బిడ్డ వైపు చూస్తుంది. అలాగే కర్మలు చేస్తూ మనం కూడా మధ్య మధ్యలో పరమాత్మ స్మరణ చేస్తుంటే - భగవంతుడు కూడా "నేనున్నానులే చేసుకోండి' అన్నట్లుగా మనవైపు చూస్తుంటాడు. ఇలా అన్ని సందర్భాలలోను భగవంతుని స్మరిస్తూ కర్మలు చేస్తుంటే అవి ఈశ్వరార్పిత కర్మలవుతాయి.

<u>చిత్తశోధకం:</u>- ఇలా ఈశ్వరార్పిత బుద్ధితో కర్మలు చేస్తుండటం వల్ల కర్మలయొక్క కర్త మనం కాకుండా పోతాం. మనం భగవంతుని చేతిలో పనిముట్టుమవుతాం. నిమిత్త మాత్రులమవుతాం. భగవంతుడు సూత్రధారిగా - మనం పాత్రధారులుగా అవుతాం. ఇలా జరిగినందు వల్ల కర్మఫలాలు మనలో ఆందోళన కలిగించవు. అలజడి కలిగించవు.

వ్యాపారంలో వచ్చే లాభనష్టాలకు చలించిపోయేది, ఆందోళన చెందేది యజమానే కాని అందులో పనిచేసే గుమాస్తా కాదు. అలాగే భగవదార్పణ బుద్ధితో - నిమిత్త మాత్రుడుగా ఉండి కర్మలు చేస్తే - వచ్చే ఫలితంవల్ల ఎలాంటి అలజడి మనలో కలగదు. దీనితో మనలో చిత్తశుద్ధి కలుగుతుంది. అదే 'చిత్తశోధకం' అని మహర్షి ఈ శ్లోకంలో తెలియజేశారు.

ఇలా భగవదార్పణ బుద్ధితో కర్మలు చేసి, భగవంతుడిచ్చిన కర్మ ఫలాలను ప్రసాదంగా స్వీకరిస్తే మనస్సులో అలజడులు ఆందోళనలు, అసంతృప్తి అనేవి లేకుండా చిత్తం శుద్ధం అవుతుంది. మనస్సు నిర్మలం అవుతుంది. ఇలాంటి మన: ప్రవృత్తి కలిగితే వారి బుద్ధి సూక్ష్మమై సద్గురువు ద్వారా జ్ఞానాన్ని పొందటానికి సర్వ సన్నద్ధమౌతుంది. దానితో మోక్షప్రాప్తికి మార్గం సుగమమౌతుంది. అదే 'ముక్తిసాధకం' అన్నారు. ఇలా కర్మను భక్తితో జోడిస్తే ఆ కర్మలు బంధం కాకపోగా ముక్తి సాధకాలు అవుతాయి. కనుక కర్మఫలాల కోసం వెంపర్లాడకుండా, వస్తే వద్దనకుండా, ఇంతకన్నా మంచివి కావాలనకుండా భగవత్ స్మరణతో, ఈశ్వరార్పిత బుద్ధితో కర్మలు చేస్తే అవి మోక్షసాధకాలవుతాయి. ఇంతవరకు కర్మయోగం – ఇకనుండి భక్తియోగం ప్రారంభం.

# భక్తి యోగం

## ఉపోద్ఘాతం

కర్మలు కర్మలుగా చేస్తే అవి మనను కర్మ సముద్రంలో పడవేస్తాయని, కర్మల వల్ల కర్మ ఫలాలు, ఆ ఫలాలను అనుభవించటం వల్ల వాసనలు, ఆ వాసనల ప్రేరణల వల్ల మళ్ళీ కర్మలు... ఇలా కర్మ సుడిగుండంలో చిక్కుకుని జనన మరణ రూప సంసారం నుండి బయట పడలేమని – కనుక ఈ కర్మలు జన్మ రాహిత్యానికి, శాశ్వత ఆనందానికి, మోక్షానికి ప్రతిబంధకాలని 2వ శ్లోకంలో చెప్పుకున్నాం. ఆ కర్మలనే ఈశ్వరార్పణ బుద్ధితో, ఫలాసక్తి లేకుండా, ఫలానా ఫలితం మాత్రమే రావాలనే భావన లేకుండా చేస్తూ, ఎటువంటి ఫలితం వచ్చినా కర్మఫలాలన్నీ ఇచ్చేది భగవంతుడే గనుక వాటిని భగవంతుని ప్రసాదంగా స్వీకరిస్తే ఇక ఆ కర్మలు ఎన్నటికీ మనను బంధించవని; పైగా ఆకర్మలు చిత్తశుద్ధిని కలిగించి మోక్షసాధనాలు అవుతాయని మహర్షి ఇంతవరకు నిష్కర్షగా తెలియజేశారు 3వ శ్లోకంలో.

ఈశ్వరార్పణ బుద్ధితో కర్మలు చేయటమంటే ఎల్లప్పుడూ భగవంతుని స్మరణ వదలకుండా చేయాలని, అంటే కర్మలు చేయబోయే ముందు,కర్మలు పూర్తయిన తర్వాత, అంతేగాక కర్మలు జరుగుతున్నంత సేపు మధ్యమధ్యలోను భగవంతుని స్మరణ చేస్తుండాలని, అలాగే కర్మ ఫలాలు లభించినపుడు వాటిని భగవంతుని ప్రసాదంగా స్వీకరించాలని కూడా తెలుసుకున్నాం. ఇలా నిరంతరం భగవంతుని జ్ఞాపకం చేసుకోవటం, ఆయననే స్మరించటం, ఆయనతోనే సంబంధం కలిగి ఉండటమే భక్తి అంటారు. అంటే మనలో భక్తి ఉన్నప్పుడే కర్మ – కర్మయోగమై, చిత్తశుద్ధి కలిగించి, ముక్తి సాధకమవుతుంది. కనుక మనం భక్తిని వృద్ధి చేసుకోవాలి. ఇప్పుడూ మనం భక్తులమే. అయితే రోజులో ఏదో కొద్ది సేపు భక్తులమవుతున్నాం.దేవాలయాలకు వెళ్ళినప్పుడో, పూజా మందిరాల ముందు కూర్చున్నప్పుడో, ఇలా భగవద్గీతను, శాస్త్రాలను వినేటప్పుడో, సాధనలు చేసేటప్పుడో భగవంతుని స్మరిస్తున్నాం. కాని అన్ని సమయాలలోను భగవంతుని స్మరించే భక్తులుగా ఉండటం లేదు. భగవంతునితో విడదీయరాని విధంగా ఉండటం లేదు.

మనం ఆహారం లేకుండా కొన్నిరోజులు గడపవచ్చు. నీరు లేకుండా కొద్ది కాలం గడపవచ్చు. గాలి పీల్చకుండా కొన్ని నిముషాలు గడపవచ్చు. కాని భగవంతుని వదిలి ఒక్కక్షణం కూడా జీవించలేం. భగవంతుని చైతన్యశక్తి లేకుండా – స్వీకరించకుండా కనురెప్పపాటు కాలం కూడా జీవించలేం.నీటిలో ఉండే చేప నీటిని వదిలి ఎలా జీవించలేదో అలాగే సర్వ వ్యాపక చైతన్య స్వరూపమైన భగవంతునిలో – పరమాత్మలో – పరబ్రహ్మంలో ఉండే జీవులు ఆ పరమాత్మని వదిలి జీవించలేవు. పరమాత్మ చైతన్యం లేకుండా జీవించలేము అని తెలిసినా – పరమాత్మను మరచిపోయి, ప్రాపంచక విషయాలలో, భోగాలలో మునిగి జీవిస్తూనే

ఉన్నాం. అయితే ఇలా ఎంతకాలం ప్రాపంచిక వ్యవహారాలలో మునిగినా, మనకు సంపూర్ణ ఆనందం, శాశ్వత ఆనందం రాదు గాక రాదు. పరమాత్మతో ఐక్యమైనప్పుడే అట్టి శాశ్వతానందం లభిస్తుంది.

సముద్రంలో ప్రయాణించే ఓడపైనున్న పక్షి ఆకాశంలోకి ఎగిరి, ఎంతదూరం ప్రయాణించినా తిరిగి తిరిగి, అలసి సొలసి చివరకు ఓడ ఎక్కడుందో వెతుక్కొని రావాల్సిందే. ఎందుకంటే ఎక్కడ చూచినా నీరు తప్ప రెండవదేమీ ఉండదు. అలాగే పరమాత్మను మరచిన జీవుడు ఎన్ని జన్మలు ఇలా ప్రాపంచిక విషయ భోగాలలో సంచరించినా అలసి సొలసి చివరకు పరమాత్మ సాన్నిధ్యానికి రావాల్సిందే. సేదదీరాల్సిందే. శాంతించాల్సిందే. అదే మన ఆధారం, అధిష్టానం. దేహంలోని చేతులు, కాళ్ళు, ముక్కు, చెవులు, నోరు,నాలుక అనే వివిధ అవయవాలన్నీ ఎలాగైతే దేహం కన్నా వేరుకాదో – అలాగే శుద్ధ చైతన్య స్వరూపమైన పరమాత్మలో ఈప్రాణులన్నీ నిజంగా పరమాత్మకన్న వేరుకాదు.పరమాత్మ మనను వదలకుండా మనలోనే ఉన్నాడని తెలిసినా మనం మాత్రం పరమాత్మలో ఉండటం లేదు. అంటే మన మనస్సు పరమాత్మతో నిండిపోవటం లేదు. ప్రాపంచిక విషయాలలో సంచరిస్తున్నది, భోగాలలో ఉండిపోతున్నది. అప్పుడప్పుడు భగవంతుని మీదకు కాకిలా వాలుతున్నది. మళ్ళీ ఎగిరిపోతున్నది. అలాకాక వదలకుండా భగవంతుని పట్టుకోవాలి. నిజంగా భగవంతునితో విడదీయరాని బంధమే భక్తి – అనన్యభక్తి.

మనం సముద్రం వద్దకు వెళ్ళి చూస్తే ఎన్నో అలలు వస్తుంటాయి. అలకు సముద్రానికి విడదీయరాని సంబంధం ఉన్నది.కాని అలకు అలకు మధ్య గల సంబంధం కొద్దిసేపే. తాత్కాలికమే. అలాగే ఈ లోకంలో వ్యక్తికీ వ్యక్తికీ మధ్య గల సంబంధం తాత్కాలికమే. అది కొంత కాలమే. ఎంత రక్తసంబంధమైనా సరే అది తాత్కాలికం. కాని వ్యక్తికి

భగవంతునికీ మధ్యగల సంబంధం శాశ్వతం. దేహం పోయినా సంబంధం పోదు. ఇంత గట్టిగా పెనవేసుకొన్న బంధాన్ని నిరంతరం గుర్తుంచుకొని భగవంతుని స్మరణలో ఉండాలి. అదే అనన్య భక్తి. అట్టి భక్తినిఎలా అభ్యసించాలో – ఎలా కర్మలను భక్తితో కర్మయోగంగా మార్చుకోవాలో 4వ శ్లోకం నుండి మహర్షి చెప్పబోతున్నారు. ఇట్టి భక్తితో కర్మలు చేస్తేనే ఫలితాలు ప్రసాదమౌతాయి. భగవంతుని స్మరిస్తూ వండితే అన్నం ప్రసాదమౌతుంది. భగవంతుని స్మరిస్తూ తింటే ఆహారం ప్రసాదమౌతుంది. ఉద్యోగం, వ్యాపారం, వృత్తి మొదలగునవి ఏవైనా సరే భగవంతుని స్మరణతో చేసినప్పుడే వాటి ఫలాలను ప్రసాదంగా స్వీకరించగలం. కనుక ఏ పనిచేసినా దోషం లేదు, కాని ఆ పని చేసేటప్పుడు భగవంతుని మరిస్తే దోషం. భగవంతుని జ్ఞాపక ముంచుకుంటే ఆ కర్మఫలం ప్రసాదం అవుతుంది. ప్రసాదాన్ని తినటం నేర్చుకోవాలి.

మనం దేవాలయంలోనో, మందిరంలోనో ఉన్నప్పుడు పులిహోర, దద్దోజనాలను ప్రసాదంగా స్వీకరిస్తాం గాని, వ్యాపారంలో వచ్చే లాభ నష్టాలను, ఉద్యోగంలో వచ్చే సాధక బాధకాలను, జీవితంలోని గెలుపు ఓటములను ప్రసాదభావంతో స్వీకరించ గలుగుతున్నామా? లేదు. ఎందువల్ల? దేవాలయంలో ఉన్నప్పుడు మనం భక్తులం. మిగతా సమయాల్లో వ్యాపారస్తులం, ఉద్యోగులం, అధికారులం అవుతున్నాం. భక్తులమనే విషయం మరచిపోతున్నాం. అందుకే ప్రసాదబుద్ధి లేకుండా పోతున్నది. రోజులో కొద్దిభాగం మాత్రమే భక్తులుగా ఉంటున్నాం. అలాగాక రోజంతా భక్తులుగా ఉండేందుకు ప్రయత్నించాలి. భగవంతునితో మన సంబంధం బాగా బలపడే కొద్దీ మనలో భక్తులమనే భావం బలపడుతుంది. అప్పుడు కర్మలను కర్మయోగంగా – ఫలాలను ప్రసాదంగా భావించగలం – స్వీకరించగలం. భగవంతునికి దగ్గరై ఎలా భక్తులం కావాలో ఇక్కడ నుండీ

మహర్షి తెలియజేస్తున్నారు.

–భక్తి భావనలను ఎలా పెంపొదించుకోవాలో భక్తి సాధనలేమిటో ఈ శ్లోకంలో

**శ్లో॥ కాయవాఙ్మన: కార్యముత్తమం।**
**పూజనం జపశ్చింతనం క్రమాత్॥ –4**

**ప్రతిపదార్థం** : కాయ = శరీరం చేత, వాక్ = వాక్కుచేత, మన: = మనస్సు చేత, కార్యం = చేయబడే (పని), పూజనం = పూజ, జపం = నామ స్మరణం లేదా నామజపం, చింతనం = పరమాత్మ చింతనం, క్రమాత్ = ఒకదాని కన్న మరొకటి వరుసగా, ఉత్తమం = శ్రేష్టమైనవి.

**భావం** : శరీరంతో చేయబడే పూజకన్న వాక్కుతో చేయబడే మంత్రజపం; దానికన్న మనస్సుతో చేసే పరమాత్మ చింతనం లేదా ధ్యానం క్రమంగా ఒకదాని కన్న మరొకటి శ్రేష్టమైనది.

**వ్యాఖ్య** : కర్మలను ఈశ్వరార్పణ బుద్ధితో చేయాలని, అప్పుడే కర్మ కర్మయోగం అవుతుందని; అట్టి కర్మ చిత్తశుద్ధిని కలిగించి ముక్తిసాధకమవుతుందని ఇంతకు ముందు శ్లోకంలో చెప్పుకున్నాం.

అంటే మనం చేసే ప్రతి కర్మను భగవంతుని స్మరణతో ప్రారంభించి, భగవంతుని స్మరిస్తూ చేయాలి. భగవంతుని స్మరించకుండా చేసే కర్మ దోష భూయిష్టమవుతుంది. మనం ప్రతి రోజూ సత్సంగం ప్రారంభించేటప్పుడు భగంతుని స్మరించి ప్రార్థనతో ప్రారంభిస్తున్నాం. ముగిస్తూ శాంతి మంత్రంతో ముగిస్తున్నాం. అయితే అన్ని పనులు ఇలా చేస్తున్నామా? చేయటం లేదు. ఎందుకని? ఎందుకంటే ఇక్కడ కూర్చున్నంత సేపూ మనం భక్తులం. నేను వ్యాపారినని, నేను ఉద్యోగినని, నేను గృహస్తునని, నేను గృహిణినని, నేను ధనవంతుణ్ణి అని, నేను మధ్యతరగతి వాడినని లేదా పేద కుటుంబీకుణ్ణని, నేను వయస్సులో ఉన్నానని, నేను

వృద్ధుణ్ణి లేదా వృద్ధురాలిని అనే భేదాలన్నీ మరచిపోతున్నాం. వాటికి ఇక్కడ ప్రాధాన్యత లేదు. ఇక్కడ మన భావాలు, హెూదాలు, భేదాలు ఏవీ గుర్తురావు. మనం అంతా ముముక్షువులం, సాధకులం, భక్తులం – భగవంతుని గురించి తెలుసుకోవాలి, సాధన చేయాలి, భగవంతుని చేరుకోవాలి అనేదే ప్రధానం. అయితే ఇక్కడి నుండి బయట పడటంతో మనం భక్తుల అవతారాన్ని తీసేస్తున్నాం. భక్తుల వేషాన్ని కడిగేసుకుంటున్నాం. వ్యక్తులుగా వివిధ హోదాలలో, వివిధ భావాలతో ఉంటున్నాం. రోజంతా ఇలానే ఉండి రోజులో కొద్దిసేపు మాత్రం భక్తులుగా ఉంటున్నాం. అంటే మనం సహజంగా భక్తులం కాదు, వ్యక్తులం. మన పనులలో మనం నిమగ్నమై ఉంటూ రోజులో ఏ కొద్దిసేపో భక్తులుగా ఉంటున్నాం. అలా కాకుండా మనం సహజ భక్తులుగా ఉండి, అన్ని సమయాలలోను, అన్ని సందర్భాలలోను భక్తికే ప్రథమ ప్రాధాన్యతనిచ్చి, భగవంతునితో విడదీయరాని సంబంధం కలిగి ఉండి; వ్యక్తిగా మనం వ్యాపారిగానో, ఉద్యోగిగానో, వృత్తి నిపుణునిగానో, గృహస్థుగానో, గృహిణి గానో ఉండాలి. అలా ఉన్నప్పుడే మనం నిజమైన భక్తులం, నిజమైన సాధకులం, నిజమైన ముముక్షువులం అవుతున్నాం. భగవంతునికి మొదటి ప్రాధాన్యతనిచ్చి, లౌకిక వ్యవహారాలకు, విషయాలకు, హోదాలకు ద్వితీయ ప్రాధాన్యత ఇవ్వాలి. అలా ఉండగలిగినప్పుడే మనం చేసే కర్మలన్నీ పవిత్రమౌతాయి, భగవంతునికి నైవేద్యమవుతాయి. కర్మ ఫలాలన్నీ భగవంతుని ప్రసాదాలవుతాయి. చిత్తశుద్ధిని కలిగిస్తాయి. మోక్షప్రాప్తికి మార్గదర్శకాలవుతాయి.

అలా సహజ భక్తులుగా మనం ఉండాలన్నా, ఆ భక్తిభావన మనలో స్థిరంగా నిలవాలన్నా మనం చేయవలసిన సాధనలను ఇక్కడ చెబుతున్నారు మహర్షి.అవే కాయ – వాక్ –మన: కార్యాలైన పూజ, జపం, చింతనం. ఇవి సాధనలు మాత్రమే.

**1) పూజ** : పూజ అంటే ఒక విగ్రహాన్నిముందుంచుకొని, భగవంతునికి ప్రతీకగా దానిని భావించి షోడశోపచారములతోను, అష్టోత్తరాలతోను పూజించటం. పుష్పములు, ఫలములు, నైవేద్యములు,హారతి మొదలగు ప్రక్రియలతో ఈ పూజ సాగిపోతుంది. పూజ శరీరంతో చేయబడే కార్యమని చెప్పినప్పటికి ఇక్కడ శరీరంతో పాటు ఇంద్రియాలు, వాక్కు, మనస్సు - అన్నీ పనిచేయాల్సి ఉంటుంది. పూజ ఎలా నిర్వహించాలో, ఏమేమి సిద్ధం చేసుకోవాలో, ఎలా మొదలుపెట్టాలో, ఎప్పుడు ఏ క్రియను ఆచరించాలో అన్నీ మనస్సుతో ఆలోచించాల్సిందే.అలాగే భగవంతుని స్తోత్రం చేయటంలో వాక్కుయొక్క అవసరం కూడా తప్పనిసరి. మనం పలికే స్తోత్రాలను చెవులద్వారా వింటాం, చేసేపనులను కళ్ళ ద్వారా చూస్తాం. చేతులతో పూజ చేస్తాం.ఇలా అన్ని అవయవాలూ ఇందులో నిమగ్నం కావాల్సిందే.

**2) జపం** : మంత్ర జపం చెయ్యటానికి, లేదా భగవంతుని నామాన్ని పదేపదే ఉచ్ఛరించటానికి వాక్కు ప్రదానం. అయినప్పటికీ వాక్కుతో పాటు మనస్సు కూడా పనిచేయాలి. ఎందుకంటే నామాన్నిఉచ్ఛరించేటప్పుడు నామిని భావిస్తూ ఉండాలి. లేదా మంత్రాధిష్టానదేవతపై మనస్సునుంచాలి. ఇందులో శరీరం యొక్క ప్రాధాన్యత ఏమీ లేదు.

**3) చింతనం** :చింతనం అంటే పరమాత్మ చింతనం, అంటే పరమాత్మ తత్త్వాన్ని గురించి చింతన చేయటం. పరమాత్మ యొక్క గుణగణాలను, లక్షణాలను ప్రశాంతమైన మనస్సుతో చింతన చేయాలి. ధ్యానించాలి. ఇందులో శరీరం యొక్క పనిగాని, వాక్కుతో గాని అవసరం లేనేలేదు.

ఇలా చేయబడే పూజ - జపం - చింతనలలో పూజకన్నా జపం శ్రేష్టమైనది. జపం కన్నా చింతనం శ్రేష్టమైనది. ఎందుకంటే చింతనలో మనస్సుకు వేరే పనేమి లేదు.కేవలం పరమాత్మతత్త్వం మీద నిలిచిపోతే చాలు. ఒకే వృత్తియందు మనస్సు పూర్తిగా నిలిచిపోవటం వల్ల ఇది

అన్నింటికన్న శ్రేష్ఠమైనది. అదే జపం చేసేటప్పుడు మనస్సు కేవలం అధిష్ఠాన దేవతపైనే గాక మంత్రం ఎలా ఉచ్చరిస్తున్నామన్న దానిపై కూడా ప్రసరిస్తుంది. (కొలికిపూస ఎప్పుడొస్తుందా? అని ఎదురు చూచే వారు కూడా ఉంటారు). ఇక్కడ మనస్సు కొంచెం చలిస్తున్నది గనుక జపం చింతనం కన్న అల్పమైనది. ఇక పూజ చేసేటప్పుడు మనస్సు పూజ చేయవలసిన విధివిధానముల మీద, సేకరించుకోవలసిన వస్తువుల మీద, చదువ వలసిన మంత్రముల మీద, చేయవలసిన ఆర్భాటముల మీద, ఇలా అన్ని వైపులా చలించి భగవంతుని మీద తక్కువగా నిలుస్తుంది. కనుక పూజ జపం కన్నా అల్పమైనది. అంటే మన మనస్సు భగవంతుని మీద ఎంత ఎక్కువగా నిలస్తున్నదీ అనే దానిపై ఈ సాధనల శ్రేష్ఠత్వం ఆధారపడి ఉన్నది. కనుకనే పూజకన్నా జపం గొప్పదని, జపం కన్న చింతనం చాలా ఉత్తమమైనదని మహర్షి స్పష్టంగా తెలియజేస్తున్నారు.

అయితే ఈ మూడింటిలోను చింతనం చాలా సూక్ష్మమైనది గనుక, మనస్సు ఏకాగ్రంగా నిలవాలి గనుక, ఇది చాలా కష్టమైనది. ప్రాపంచిక విషయ వాసనలు తక్కువగా ఉన్నవారు, భగవంతునిపై ఇప్పటికే భక్తి గలిగిన వారు, శాస్త్రాల ద్వారా భగవత్తత్వాన్ని చక్కగా తెలుసుకొన్నవారు మాత్రమే చింతనం చేయుటకు సమర్ధులవుతున్నారు. ఇక జపం దానికన్న కొంచెం తేలిక. ఎందుకంటే ఇక్కడ వాక్కుద్వారా మంత్రం ఉచ్ఛరింప బడుతుంది గనుక మనస్సును కొంత సులభంగా పరమాత్మపై నిలిపే వీలుంటుంది. అయితేపూజ అనేది చాలా తేలిక. ఎవరైనా సరే కొంత జాగ్రత్త తీసుకుంటే సులభంగా చేయవచ్చు. ఇక్కడ మూడు కరణాల యొక్క సహకారం ఉంటుంది. శరీరము, వాక్కు, మనస్సు. అన్ని ఇంద్రియాలు పనిచేస్తుంటే పని సులభం అవుతుంది.

ఏదైనా ఒక పనిని నలుగురు కలిసి చేస్తున్నారను కోండి.

ఆ పని ఎంతో సులువుగా ఉంటుంది. ఒక ఇంటిలో నలుగురు స్త్రీలున్నారు. ఒకరు వంట పని, ఒకరు ఇంటిపని, ఒకరు బట్టలుతకటం, మరొకరు అన్ని వ్యవహారాలను చూసుకోవటం,అతిధులను మర్యాద చెయ్యటం మొదలైన విషయాలను చూసుకుంటే ఎంతో తేలికగా ఉంటుంది. అదే అన్నిపనులు ఒక్కరే చేసుకోవాలంటే ఎంతో కష్టంగా ఉంటుంది. అంటే ఎక్కువ మంది సహకారంతో ఒక పని చేసినప్పుడు ఆ పని ఎవ్వరికీ భారంగా ఉండదు.

3 చక్రాల సైకిలు తొక్కటం చాలా తేలిక. ఎందుకంటే బ్యాలెన్స్ గురించి ఆలోచించాల్సిన పనేలేదు. కాని 2 చక్రాల సైకిలు తొక్కాలంటే కొంతకాలం ప్రాక్టీస్ చేస్తేనే సాధ్యం. ఇక ఒక చక్రం సైకిల్ తొక్కాలంటే సర్కస్‌లో పనిచేసేవారు ఎంతో ఏకాగ్రమైన సాధనతో, తీవ్ర కృషితో, నైపుణ్యంతో, ఎంతోకష్టంతో సాధించగలరే గాని సామాన్యులైన ఇతరులకు అసలు సాధ్యంకానే కాదు. అలాగే ఒక్క మనస్సు మీదనే ఆధారపడ్డ చింతనం చాలా కష్టం. మనోవాక్కాయములు మూడింటి మీద ఆధారపడ్డ పూజ చాలాసులభం.

సులభం కదా అని 'పూజ చేద్దాం' అనుకుంటే అది అల్పమైనది. తక్కువ ప్రయోజనాన్ని ఇచ్చేది. పోనీ గొప్ప ప్రయోజనాన్నిచ్చేది, శ్రేష్టమైనది గదా 'చింతనం' చేద్దాం అంటే అది అదరికీ అంత సాధ్యపడేది కాదు. దానికి గొప్ప ప్రయత్నం కావాలి. అసలు ఇందులో ఏదో ఒకటి చాలు అనే భావనే సరికాదు. ఈ మూడూ మానవులలో భక్తిభావన పెంచుకోవటానికి ఒకదానికన్న మరొకటి ఉత్తమమైనది. పైకి ఎక్కటానికి నిచ్చెమెట్ల వంటివి. ప్రారంభ సాధకులకు,సామాన్యులకు భగవంతుని పూజ తేలికైనది. తేలికైనది గదా అని ఎప్పుడూ అందులోనే కూర్చుంటాను అంటే ప్రగతి ఉండదు. కనుక ఒక్కదానిలోనే కూర్చోరాదు. అందుకే స్వామి

వివేకానంద "దేవాలయాలను ఆశ్రయించు, కాని వాటిలోనే చచ్చిపోకు" అన్నారు. కనుక క్రమంగా ఉన్నతికి పోవాలి అలా వెళ్ళకపోతే ఏం జరుగుతుంది?

పూజలో భగవంతుణ్ణి విగ్రహంలో దర్శిస్తావు. అదే జపంలో నైతే నీమనస్సులోనే దర్శిస్తావు.కాని చింతనవల్ల – ఆత్మచింతన వల్ల పరమాత్మను సర్వత్రా – అన్నింటిలోను, అందరిలోను దర్శిస్తావు. ఇలా మెట్టుమెట్టుగా పైకి ఎక్కకపోతే విగ్రహాలనే భగవంతునిగా భావించి అజ్ఞానంలోనే ఉండిపోతావు. నడకనేర్చుకొనే పసివాడు ముందు గోడలు పట్టుకొని, పెద్దల చేయి పట్టుకొని నడచినట్లు భక్తి సాధన ముందు పూజతో ప్రారంభించి, క్రమంగా జపం – చింతనల స్థాయికి వెళ్ళాలి.

–భక్తిని పెంపొందించుకొనుటకు చేసే సాధనలలో మొదటి సాధన అయిన పూజ గురించి వివరిస్తున్నారు.

**శ్లో॥ జగత ఈశధీయుక్త సేవనం।**
**అష్టమూర్తి భృద్దేవపూజనం॥ –5**

**ప్రతిపదార్థం** : జగత = ఈ జగత్తును, ఈశ ధీయుక్త – ఈశ్వరుడు అనే బుద్ధితో కూడి, సేవనం = సేవించటం, అష్టమూర్తిభృత్ = ఎనిమిది రూపాలను ధరించిన, దేవపూజనం = దేవుని పూజయే ఔతుంది.

**భావం** :ఈ జగత్తంతా పరమేశ్వరుడే అనే భక్తి భావంతో కూడిన బుద్ధితో ఈ జగత్తుకు చేసే సేవ అంతా ఎనిమిది రూపాలను ధరించిన భగవంతుని పూజయే అవుతున్నది.

**వ్యాఖ్య** : శ్రేష్ఠమైన పూజ ఏదో ఇక్కడ చెబుతున్నారు. అంతేకాదు భగవంతుని పూజను నాలుగు గోడల మధ్య నుండి – మందిరాల నుండి – దేవాలయాల నుండి ఈ విశాల విశ్వంలోనికి తీసుకొని వస్తున్నారు మహర్షి.

సామాన్యంగా పూజ అనగానే ఒక మందిరంలోనో,

దేవాలయంలోనో కూర్చుని ఒక విగ్రహానికి చేసే షోడశోపచారము లేదా పుష్పములతో చేసే అష్టోత్తర పూజయే నని అందరి భావం. ఇది నిజంగా అల్పమైన పూజ. ఎందుకంటే ఒక విగ్రహాన్ని భగవంతునిగా భావించి భక్తితో సేవిస్తాం.కాని ఆవిగ్రహం తప్ప మిగిలిన వాటిని గాని, తోటి వారిని గాని భగవంతుని కన్న వేరుగా చూస్తాం. ఒక్కచోటనే భగవంతుని చూచే ఈ దృష్టి సంకుచిత దృష్టి అవుతుంది. విగ్రహారాధనము అనేది ఈశ్వరుని అష్టమూర్తులలో ఒకటి అయిన పార్థివమూర్తి యొక్క ఏకదేశ ఆరాధనమే గాని, ఇది పూర్ణ పూజ కాదు. నిజమైన భగవంతుని పూజ కాదు. సమస్త జగత్తును ఈశ్వర స్వరూపంగా భావించి చేసే పూజ ఏదో అదే అష్టమూర్తుల పూజ. అదే పూర్ణ పూజ అవుతుంది. (అలాగని విగ్రహారాధన తప్పు కాదు)

**జగతఈశ** : నిజంగా ఈ ప్రపంచాన్ని సృష్టించినది పరమాత్మ. విశ్వాన్ని చేసింది విశ్వేశ్వరుడే. జగత్తును నిర్మించినది జగన్నాథుడే. ఈ జగత్తు కార్యం.కార్యమున్నదీ అంటే కారణముండాలి. కనుక ఈ జగత్తుకు ఉపాదానకారణం - నిమిత్త కారణం రెండూ భగవంతుడే. కార్యంలో వున్నదంతా కారణమేననే విషయమూ మనకు అనుభవమే. కుండ కార్యం. మట్టికారణం. కుండలో ఉన్నదంతా మట్టే. అలాగే నగ కార్యం. బంగారం కారణం. నగలో ఉన్నదంతా బంగారమే. కనుక జగత్తు కార్యం. పరమాత్మ కారణమైతే జగత్తులో ఉన్నదంతా పరమాత్మే తప్ప మరేమీకాదు. మట్టిని తీసేస్తే కుండ ఎట్లా లేదో, బంగారాన్ని తీసేస్తే ఆభరణం ఎట్లా లేదో, భగవంతుని తీసేస్తే జగత్తు లేదు. అందువల్ల ఈ జగత్తును పరమేశ్వర బుద్ధితో సేవిస్తే ఆ సేవ అష్టమూర్తులతో కూడిన భగవత్ సేవయే అవుతుంది. నిజమైన భగవంతుని పూర్ణపూజయే అవుతున్నది.

జగత్తంతా పరమేశ్వరుడే గనుక జగత్తులో నున్న ప్రాణులు - మనుష్యులు - జంతువులు - చెట్లు వగైరా అన్నీ కూడా ఆ పరమేశ్వరుడే.

అన్ని రూపాలలో - అన్ని దేహాలలోను అంతర్యామిగా ఉన్నది ఆ భగవంతుడే. కనుకనే "ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి" - "సర్వస్యచాహం హృది సన్ని విష్ట:" " అహమాత్మా గుడాకేశ సర్వభూతా శయస్థిత:" అని గీతలో భగవానుడు తెలియ జేయడం జరిగింది. ఈ కారణంగా ఎవరిని పూజించినా భగవంతుని పూజించినట్లే.

ఐతే ఆచరణలో ఎవరినీ ద్వేషించకుండా ఉండటం సాధ్యం కావటం లేదు. ఎందుకంటే మనం అందరినీ భగవత్ భావనతో చూడటం లేదు గనుక. అందరిలోను - అంతటా-అన్ని వేళలా భగవంతుని దర్శించగలిగే జ్ఞానం - అనుభవజ్ఞానం కలిగేంత వరకు సాధకులు భగవంతుని పూజచేయడానికిగాను భగవంతుని కొన్ని విశిష్ట మూర్తులలో గుర్తించి-ఆ గుర్తింపునే పూజగా చేయవలసి యున్నది. ఇదే అష్టమూర్తి భృత్ దేవపూజనం' అని ఇక్కడ చెప్పింది. అంటే భగవంతుని ఇక్కడ ఎనిమిది విశిష్ట రూపాలలో గుర్తించి పూజించాలి. చరాచరాత్మక ప్రపంచం అంతా భగవంతుని అష్టమూర్తులుగా మనకు దర్శనమిస్తున్నది.

**ఏమిటా అష్టమూర్తులు** ? 1) భూమి, 2) నీరు, 3) అగ్ని లేదా తేజస్సు, 4) వాయువు, 5) ఆకాశం, 6) స్వయం ప్రకాశమైన సూర్యుడు (నక్షత్రాలకు ప్రతినిధి) 7) స్వయం ప్రకాశము లేక పోయినా ప్రకాశించే చంద్రుడు (చర గ్రహాలకు, ఉపగ్రహాలకు ప్రతినిధి) 8) అన్ని జీవరాసులకు ప్రతినిధియై అన్ని ప్రపంచ అనుభవాలను అనుభవించే జీవుడు. ఇవే అష్టమూర్తులు. ఈ రూపాలను భగవంతునిగా గుర్తించి చేసే పూజయే అష్టమూర్తి భృత్దేవ పూజ. శ్రేష్ఠమైన పూజ, అదే గురుపూజ. గురువునే దైవంగా భావించి సకల ఉపచారాలతో, నైవేద్యాలతో, హారతులతో చేసే ఈ పూజ పూర్ణపూజ ఎలా అవుతున్నది? అష్టమూర్తుల పూజనం ఎలా అవుతున్నది?

గురువు యొక్క దేహం పంచ భూతాలతో నిర్మితమైనది - 5

గురువు యొక్క బుద్ధిలో సూర్యునిలా స్వయం ప్రకాశమై

వెలుగొందుతున్న జ్ఞానం. (సూర్యుడు) -1

ఆ జ్ఞానాన్ని వాత్సల్యంతో, ప్రేమతో, చల్లని చూపులతో అందించే గురువు యొక్క మనస్సు (చంద్రుడు) -1

జ్ఞానాన్ని శిష్యుల బుద్ధిస్థాయిలో అందించాలనే తపనతో జీవభావంలో ఉన్నదీ గురువే (జీవుడు)-1 కనుక

గురుపూజ అష్టమూర్తుల దేవపూజయే.

'దేహోదేవాలయ ప్రోక్త: జీవోదేవ: సనాతన: అన్న శ్రుతివాక్యం ఆధారంగా సాక్షాత్ భగవత్ స్వరూపంగా భావించి, జ్ఞానాన్నిచ్చిన గురువును పూజించటం అష్టమూర్తి పూజనమే, పూర్ణ పూజయే అవుతున్నది. అయితే ఇది అందరికీ సాధ్యంకాకపోవచ్చు. కొందరికి గురువంటే ఎవరో ఏమిటో తెలియదు కనుక గురువే ఉండడు. కొందరికి పూర్వజన్మ సుకృతం లేకపోవటం వల్ల ఉన్నా గుర్తించలేరు. కొందరు గుర్తించినప్పటికీ పూజించరు. ఏవేవో ఆటంకాలుగా భావిస్తారు. అలాంటి మనస్సుండదు వారికి. ఇది అజ్ఞానం.

ఇప్పుడు రమణ మహర్షి అలాంటి శ్రేష్టమైన పూజతో సమానమైన పూజను చెబుతున్నారు.నిజంగా ఇదికూడా పూర్ణపూజయే. శ్రేష్టమైన పూజయే. ఇది చాలా కష్టంతో కూడుకన్న పూజయే. అదే 'జగత ఈశధీయుక్త సేవనం'. జగత్తును ఈశ్వరబుద్ధితో భావించి సేవించుటయే. జగత్తుకు, జగత్తులోని సర్వానికి సేవ చేయుటయే. ఇది చాలా ఆదర్శ వంతమైన పూజ. ఎలా చెయ్యాలి ఈ పూజను? నిజంగా ఇక్కడ భగవంతుని ఆరాధించాలనే భావంతో ఎక్కడకూ పోనక్కర లేదు. ప్రత్యేకమైన కర్మలు చేయనక్కర లేదు. దీని కోసం ప్రత్యేకంగా నైవేద్యాలు తయారు చేయనక్కర

లేదు. వస్తువులు సమకూర్చుకోనక్కర లేదు. వ్యక్తుల సాయం తీసుకోనక్కర లేదు. శ్రమ చేయనక్కర లేదు. డబ్బు ఖర్చుపెట్టాల్సిన పనిలేదు. కాని నీ మనస్సును భగవన్మయంగా మార్చుకోవాలి. ఎవరిని చూచినా భగవంతుని చూస్తున్నట్లే భావించాలి. సర్వత్రా పరమాత్మ దర్శనం అలవడాలి.

తుకారాం పాండురంగ భక్తుడు. ఆయన ప్రతిరోజూ పాండురంగని దర్శించేవాడు. గంటలు గంటలు తదేక ధ్యానంతో పరవశించేవాడు. కొంతకాలం తర్వాత దేవాలయానికే వెళ్ళలేదు. ఎందుకంటే అప్పుడు పాండురంగడు దేవాలయములోనే ఉన్నాడని భావించి దర్శించాడు. కాని ఇప్పుడు ఎక్కడ చూచినా పాండురంగడే. అన్ని దేహాలలో – అంతటా పాండురంగడే. ఎలా చూడగలిగాడు? తన మనస్సును పాండురంగమయం చేశాడు. అంతే.

ఒకసారి కుక్క అన్నం నోట కరచుకొని ఇంటిలో నుండి పరుగు తీస్తున్నది. అది చూచిన తుకారాం నేతిగిన్నె పట్టుకొని దానివెంట పడ్డాడు. పాండురంగా ఆగు! ఆగు! అదివట్టి అన్నమే. ఇదిగో ఈ నేయి కలుపుకొని తిను, అని. అదీ సర్వత్రా పరమాత్మ దర్శనం అంటే.

రమణ మహర్షి ఆశ్రమంలో కోతులు, గోవులు, ఉడతలు, నెమళ్ళు, కుక్కలు సహజీవనం చేస్తుంటాయి. కుక్కను కూడా ఇది అనడు ఆయన. ఇతడు అంటాడు. వీరికేంకావాలో చూడండి, వారిని బాధ పెట్టకండి అని వాటిని గౌరవిస్తూ ఉండేవాడు. మనష్యులతో ప్రవర్తించినట్లే ప్రవర్తించేవాడు.

ఇలాంటి భావన ఉంటే ఎంతో తేలికగా శ్రేష్ఠమైన పూజ చేయవచ్చు. నీవు వ్యాపారం చేస్తున్నావు. నీ దగ్గరకు వచ్చే కస్టమర్లను, నీ దగ్గర పనిచేసే వారిని భగవంతుని రూపాలుగా చూడు. నీవేం నష్టపడాల్సిన పని లేదు. అలాగని మోసం కూడా చేయలేవు.

నీవు ఉద్యోగం చేస్తున్నావు. జీతం ప్రభుత్వం నుండి టంచనుగా వస్తుంది. ఇక నీవు నీవద్దకు వచ్చే వారందరిని భగవంతుని రూపాలుగా చూడు. నీకు చేతనైనంతవరకు సేవ చెయ్యి. అది పరమాత్మ సేవ అవుతుంది. నీకు ఎంత ఆనందాన్నిస్తుందో అనుభవిస్తే తెలుస్తుంది.

నీవు డాక్టరువు. నీ దగ్గరకు వచ్చే పేషెంట్లను పరమాత్మ స్వరూపులుగా చూడు. అంతే. అనవసరమైన ఆపరేషన్‌లు ఉండవు. ప్రాక్టీసు బాగా ఉంటుంది. ఇలా నీవు ఏ వృత్తిలో ఉన్నా సరే నీవు భగవంతుని సేవ చేయవచ్చు. ఇలా చేస్తే నీవు ఉద్యోగం మాననక్కరలేదు, వ్యాపారం మాననక్కరలేదు. ఇవన్నీ ఎందుకు మానాలి? భగవంతుని సేవ చేయటానికండి! అంటే భగవంతుడు అక్కడ లేనట్లేగా! కనుక ఈ పరిమిత భావాలు వదిలి సర్వత్రా భగవంతుని దర్శించటం నేర్చుకోవాలి. ఇలాంటి భావన – అందరినీ, అన్నింటినీ భగవంతుడే – అనే భావన ఉన్నప్పుడు ఎవరికి సేవ చేసినా భగవంతునికి సేవ చేసినట్లే. ఇలా అందరినీ భగవంతునిగా భావించి సేవిస్తున్నావు. ఏమిటి ప్రయోజనం? ఒకరికి నీవు సాయం చేశావు. అదీ అతణ్ణి భగవంతునిగా భావించి సేవించావు. అతడు నీకేం ఉపయోగపడలేదు. నీ అవసర సమయాలలో ముఖం తప్పించాడు. కాని మరొక వ్యక్తి నీకు సహాయం చేశాడు. నీవు కోరకుండానే చేశాడు. అంటే ఈ రూపంలో నీవు పూజిస్తే భగవంతుడు ఆరూపంలో నీకు సాయపడ్డాడు. ఇలా నీ స్వధర్మాన్ని భగవంతుని పూజగా మలచుకుంటే ఇదే గొప్ప పూజ. పూర్ణ పూజ. ఉత్తమ పూజ.

–ఇప్పుడు భక్తిని పెంపొందించకొనటానికి వాక్కుద్వారా చేసే జపం గురించి చెప్పబోతున్నారు.

**శ్లో॥ ఉత్తమస్తవా దుచ్ఛ మందత: ।**
**చిత్త జం జపం ధ్యాన ముత్తమం ॥ –6**

**ప్రతిపదార్థం** :ఉత్తమస్తవాత్ – ఉత్తమమైన భగవంతుని మహిమలను స్తుతించుటకంటే, ఉచ్ఛ (జప) = బిగ్గరగా చేయు జపం, మందత: (జప) = పెదవులు కదిలీ కదలకుండా లోలోపల చేసే జపం, చిత్తజం = మనస్సులో చేసే, జపధ్యానం = మానసిక జపం, ఉత్తమం = శ్రేష్టమైనది.

**భావం** :భగవంతుని గుణ, మహిమల గురించి స్తోత్రము చేయుట మంచిదే. దానికన్న బిగ్గరగా చేయు జపం (వాచిక జపం) ఉత్తమమైనది. దాని కన్న మందజపం(ఉపాంశువు) ఉత్తమం. దీనికన్న శ్రేష్టమైనది మానసిక జపం.

**వ్యాఖ్య** : బాహ్యంలో కర్మలు జరుగుతున్నవి అంటే వాటికి కారణం అంతరంగం లోని వాసనలే. లోపల వాసనలున్నంత కాలం అవి ప్రేరణలు ఇస్తూనే ఉంటాయి. వాటి కారణంగా మనస్సులో సంకల్పాలు జరిగి కర్మలు చేయటం జరుగుతున్నది. కర్మలు జరిగితే నష్టం ఏమిటి? కర్మలు మనను కర్మ సుడిగుండంలో పడవేస్తాయి. జనన మరణ చక్రంలో త్రిప్పుతాయి. దు:ఖ సముద్రంలో ముంచివేస్తాయి. కనుక కర్మలు ఆగాలి. కర్మలు ఆగాలంటే వాసనలు క్షయం కావాలి. ఇప్పటి వరకు మనలో ఉన్న వాసనలన్నీ ప్రాపంచికమైన వాసనలే. కనుక వాటికి అనుగుణంగా ఈ ప్రాపంచిక కర్మలలో మునిగి పోతున్నాం. మరి వాసనల నెట్లా క్షయం చేసుకోవాలి? దానికొకటే మార్గం. భగవంతుని వైపుకు తిరగటమే. ప్రేమపూరితమైన ఈశ్వర చింతన చేయటమే. భగవంతునిపై అచంచలమైన, అనన్యమైన భక్తిని అభ్యాసం చేయటమే. మనలో అట్టి భక్తి కలగాలన్నా, కలిగిన భక్తి మనలో నిలవాలన్నా భక్తి సాధనలను చేస్తుండాలి. అవే శరీరంతో చేసే పూజ, వాక్కుతో చేసే జపం, మనస్సుతో చేసే చింతనం అని 4వ శ్లోకంలో చెప్పుకున్నాం. ఇవి ఒకదానికన్నా ఒకటి క్రమంగా ఉత్తమమైనవని కూడా తెలుసుకున్నాం.ఇందులో మొదటి భక్తి సాధన అయిన పూజను గురించి 5వ శ్లోకంలో చెప్పుకున్నాం. పూజ అంటే ఏమిటో, అది ఎలా చేయాలో,

ఉత్తమమైన పూజ ఏదో తెలుసుకున్నాం. మనలో ప్రతిఒక్కరూ తమ తమ స్వధర్మాన్ని వదలకుండా నిర్వర్తిస్తూనే ఆయా కర్మలను ఎలా దేవ పూజగా, ఉత్తమమైన పూర్ణపూజగా మలచుకోవాలో క్రిందటి శ్లోకంలో మహర్షి తెలియ జేశారు. భగవంతుని పూజను గది నాలుగు గోడల మధ్య నుండి ఈ విశాల విశ్వంలోనికి తెచ్చే అద్భుత విధానాన్ని భగవాన్ రమణమహర్షి అద్భుతంగా తెలియ జేశారు.

ఇప్పుడు రెండవ భక్తి సాధనమైన జపం గురించి చెప్ప బోతున్నారు. జపం 3 రకాలుగా చేయవచ్చు. అవి ఏమిటో తెలుసుకుందాం.

(1) ఉచ్చజపం: దీనినే వాచక జపం అంటారు. అంటే ఒక మంత్రాన్ని పెద్దగా ఉచ్చరించటం. 'ఓం నమో నారాయణాయ',–'ఓం నమో భగవతే వాసుదేవాయ',–'ఓం నమశ్శివాయ'–ఇలా ఏదో ఒక నామాన్ని –ఏదో ఒక మంత్రాన్ని పెద్దగా ప్రక్కన ఉన్న వారికి కూడా వినిపించేటట్లుగా పదే పదే ఉచ్చరించటమే ఉచ్చజపం.

(2) మందజపం: దీనినే 'ఉపాంశు' అని కూడా అంటారు. పెదవులు కదిలీ కదలనట్లుగా కదులుతాయి. నాలుక కూడా కదులుతుంది. శబ్దం సన్నగా వస్తుంది. అయితే నీ ప్రక్కన ఉన్న వారికి కూడా వినిపించదు. నీకు మాత్రమే వినిపిస్తుంది. ఉచ్చజపంలో నీవు ఏ మంత్రాన్ని జపిస్తున్నది ఇతరులకు కూడా తెలుస్తుంది. కాని ఈ మందజపంలో నీవు జపం చేస్తున్నావని మాత్రమే తెలుస్తుంది తప్ప, నీవు చేసే మంత్రం మాత్రం ఇతరులకు తెలియదు.

(3) చిత్తజంజపం: దీనినే 'మానసిక జపం' అంటారు. ఇందులో శబ్దం అసలురాదు. పెదవులు కదలవు. నాలుక కదలదు. ఇతరులకూ వినిపించదు, నీకూ వినిపించదు. కేవలం మనసులో మాత్రం దొర్లి పోతుంది. కనుక నీవు జపం చేస్తున్న విషయం కూడా ఇతరులకు తెలియదు. ఇవీ 3 రకాలు.

ఈ శ్లోకంలో మహర్షి వాక్కుతో చేస్తే ఉత్తమస్థవం(స్తోత్రం) గురించీ,-జపం గురించి తెలియ జేశారు. ఇవి ఉత్తమ మైన భక్తి సాధనలే. అయితే ఇందులో తర తమ భేదాలున్నాయి. ఒక దానికన్న ఒకటి ఉత్తమ మైనది అని కూడా చెబుతున్నారు. ఉత్తమ స్థవం కన్న జపం శ్రేష్టమని, జపంలో కూడా ఉచ్ఛజపం కన్న మందజపం, మందజపం కన్న చిత్తజంజపం(జపధ్యానం) శ్రేష్టమని కూడా చెప్పారు.

(1) స్థవం అంటే స్తోత్రం. భగవంతుని స్తోత్రం చేయడానికి అనేక పదాలతో, వాక్యాలతో స్తోత్ర పాఠాలున్నాయి.విష్ణు సహస్ర నామ స్తోత్రం, లలితా సహస్ర నామ స్తోత్రం, శివ సహస్ర నామ స్తోత్రం....ఇలా ఎన్నో స్తోత్రాలు, అష్టోత్తరాలు, వేద పారాయణలు, గీతా పారాయణలు...ఇలా అనేక విధాలైన భక్తి సాధనా మార్గాలున్నాయి. భగవంతుని మహిమలను స్తుతించటం, లేదా గానం చేయటం, భజన చేయటం ఇందులోనివే. ఈ స్తోత్రాలను వల్లించటం శారీరకంగా చేసే పూజ కన్నా శ్రేష్టమైనదే. ప్రారంభంలోని సాధకులకు ఎంతో ఉపయోగకరమైనదే. ఈ స్తోత్ర పాఠాలలో లేదా జపసాధనలో శరీరం యొక్క సహకారం అవసరం లేదు. కాకపోతే మనసు ప్రపంచం లోనికి పరుగిడకుండా కట్టడి చేయడానికి జపమాలను ఉ పయోగించాల్సి ఉంటుంది. జపంలో ఒక్కటే మంత్రం ఉంటుంది. స్తోత్ర పాఠాలలో అలా కాదు 108 లేదా 1008 నామాలుంటాయి. లేదా అనేక మంత్రాలుంటాయి. లేదా అనేక శ్లోకాలుంటాయి. కనుక మనస్సుకు ఏకాగ్రత కలగడం కష్టం. అయితే జపంలో ఒక్కటే నామం లేదా మంత్రం. దానినే పదే పదే జపించాలి. కనుక మనస్సు ఆ ఒక్క మంత్రం మీద నిలిపితేచాలు. 'ఓం నమః శివాయ' 'ఓం నమో: నారాయణాయ'. నమ: అంటే నాదేం లేదు అని. నాదేం లేదంటూ ఈమనస్సును తీసుకెళ్ళి అనంతచైతన్యంలో – ఆ పరమాత్మలో కలిపెయ్యటానికి చేసే ప్రయత్నమే ఈ జపం. ఈ జప

సాధన సక్రమంగా చేస్తే మనలోని ప్రాపంచిక వాసనలు తొలిగిపోతాయి. వాటి స్థానంలో పరమాత్మ వాసనలు కూడుకుంటాయి. ఇవి మనను నిరంతరం పరమాత్మ భావనలో, భక్తి భావనలో నిలపటానికి చక్కగా తోడ్పడతాయి. ఈ జపం ఉచ్చ-మందత: - చిత్తజం అని 3 రకాలు.

**జప ధ్యానం యొక్క శ్రేష్టత్వం**: మూడురకాల జపాలలోను మానసిక జపం - లేదా చిత్తజం జపం శ్రేష్టమైనది. అంటే ఇది పూజనం కన్న - స్తోత్రపాఠాల కన్న - ఉచ్చుజపం కన్న - మంద జపం కన్న ఉత్తమైనది, శ్రేష్టమైనది, అధిక ఫలదాయకమైనది అని మహర్షుల వారు స్పష్టం చేస్తున్నారు.

ఈ చిత్తజం జపాన్నే 'జపధాన్యం' అని కూడా అంటారు. ఇది పూర్తిగా మానసిక మైనది. అంటే మనస్సుతో చేసేది. కనుక కొంచెం కష్టం. అయితే ప్రయత్నంతో ఈ జప సాధనను ఏకాగ్రమైన చిత్తంతో కొనసాగిస్తే మనస్సు పవిత్రమవుతుంది. మాంసమయమైన శరీరం మంత్ర మయమవుతుంది. ఇలా పవిత్రత, ఏకాగ్రత కలిగిస్తుంది కనుక ఈ మానసిక జపం లేదా జపధ్యానం ఎంతో శ్రేష్టమైనది. అయితే ఈ జపధ్యానాన్ని ఎలా కొనసాగించాలి?

ఇక్కడ మంత్రోచ్చారణ కేవలం మనస్సుతోనే చేయబడుతుంది. పెదవులు, నాలుక కదలరాదు. ఏమాత్రం శబ్దం రాకూడదు. అంతేగాదు మంత్రాన్ని ఉచ్ఛరించేటప్పుడు ప్రతిపదాన్ని ఉచ్ఛరించిన తర్వాత ఆ వెంటనే వచ్చే పదాన్ని ఉచ్ఛరించే లోపల కొంత నిశ్శబ్దం ఉంటుంది. ఒకవేళ మంత్రం ఒకే పదమైతే మంత్ర ఉచ్చారణకు - ఉచ్చారణకు మధ్య కొంత నిశ్శబ్దముంటుంది. నిశ్శబ్దము అంటే సంకల్ప రాహిత్యమే. దానినే నిర్వికార చైతన్యముగా, ప్రత్యగభిన్న పరమాత్మగా గుర్తించి ఆ గుర్తింపులోనే ఏ సంకల్పం లేకుండా యధాశక్తి కేవలంగా నిలిచిపోవాలి. జపం చేస్తున్న కొద్దీ అలా నిలిచిపోతాం. ఇలా పరమాత్మ

స్పర్శ తగులుతుంటే – ఇది ముందు ముందు ధ్యానంలో చాలా చక్కగా ఉపయోగపడుతుంది. నిజమైన ధ్యానం చక్కగా కుదురుతుంది.

ఇద్దరు గోపికల మధ్య శ్రీకృష్ణుడున్నట్లు, రెండు సంకల్పాల మధ్య పరమాత్మ ఉన్నాడు. నిస్సంకల్ప స్థితి – నిర్వికల్ప స్థితియే ఆత్మస్థితి – పరమాత్మ స్థితి. ఆత్మ నిప్పు వంటిది. దానిని సంకల్పాలనే నివురు (పొగ) కప్పుతున్నది. పొగ తొలగిందా – నిప్పు స్పష్టంగా కనిపిస్తుంది. సంకల్పాలు తొలగినయ్యా ఆత్మ స్వయం ప్రకాశం. ఈ జప ధ్యానంలో ఆ నివురును – సంకల్పాలనే నివురును తొలగించి రెండు మంత్రాల ఉచ్చారణ మధ్యగల నిశ్శబ్దాన్ని ఆత్మగా గుర్తించి, ఆత్మసుఖం అనుభవించటమే ఇందులోని ముఖ్య విశేషం. ఇది మిగతా జప విధానాల కన్న శ్రేష్టమైనది. ఇది జ్ఞానం రాకముందు చేసే జప సాధన. (ఆత్మజ్ఞానం కలిగిన తరువాత మహామంత్ర జపం అత్యుత్తమం) అయితే జపసాధనలో దృష్టి ఆత్మపై – పరమాత్మపై – మంత్రాధిష్టాన దేవతపై నిలవాలి.

7 సం॥ముల నుండి జపం చేస్తున్న ఒక సాధకుడు ఒక మహాత్ముని సందర్శించి స్వామీ నాకు జప సిద్ధి కలగటం లేదు. 7 సం॥ముల నుండి చేస్తున్నాను అన్నాడట. దానికాస్వామి “నాయనా ! జపం చేసేటప్పుడు నీ దృష్టి అంతా భగవంతుని మీదనే ఉంటున్నదా? అని అడిగాడు. దానికా సాధకుడు, స్వామీ! మాలత్రిప్పుతూ పూర్తయే సమయంలో మేరు పూసను దాటుతానేమోననే భయంతో ఎల్లప్పుడూ దృష్టి మేరుపూసమీదే ఉంటున్నది అన్నాడట. కనుక జపం చేసేటప్పుడు మన దృష్టి మేరుపూస మీద కాక భగవంతుని మీద నిలవాలి. అప్పుడే ఇది గొప్ప భక్తి సాధనమవుతుంది. ఈ జపం ధ్యానంలోనికి మారిపోతుంది. అంటే మంత్రం చేయగా చేయగా మంత్రం అదృశ్యమై లక్ష్యంలో మనస్సు నిలిచిపోతుంది.

–ఇప్పుడు 3వ భక్తి సాధన అయిన మానసిక చింతనం గురించి చెప్పుబోతున్నారు. ఇదే శ్రేష్ఠమైన ధ్యానం.

**శ్లో॥ ఆజ్యధారయా స్రోతసా సమం।**

**సరళ చింతనం విరళత: పరం॥ –7**

**ప్రతిపదార్థం** :ఆజ్యధారయా = నేతి ధారవలె, స్రోతసా సమం = నదీప్రవాహంతో సమానమైన, సరళ చింతనం = ఆటంకములు లేకుండా చేసే చింతనం, విరళత: = ఆటంకములతో కూడిన చింతన కన్న, పరం = శ్రేష్టమైనది.

**భావం** : నేతిధారలాగా, నదిలో జలం ప్రవహించినట్లుగా ఏ ఆటంకములు లేకుండా అఖండంగా జరిగే సరళ చింతనం – మధ్యమధ్య ఆటంకాలతో కొనసాగే విరళ చింతనం కన్న శ్రేష్టమైనది.

**వ్యాఖ్య** :భగవంతుని యందు భక్తిని కలిగించి పెంపొందించే సాధనలలో శరీరంతో చేసే పూజ, వాక్కుతో చేసే జపంగురించి ఇంతవరకు రెండు శ్లోకాల్లో చెప్పుకున్నాం.ఇప్పుడీ శ్లోకంలో మనస్సుతో చేసే చింతనం గురించి తెలియచేస్తున్నారు.

చింతనం అంటే మన ఆలోచనలన్నింటిని ఒకే ఒక సద్వస్తువు పైకి ప్రవహింప జేయడమే. వస్తువు యొక్క రూపం పై గాని, గుణంపైగాని, స్వభావంపై గాని చింతన చేయవచ్చు. ఈ చింతననే ధ్యానం అని కూడా అంటారు. నిధిధ్యాసన అన్నా ఇదే. ఆధ్యాత్మిక సాధనలలో అత్యంత విలువైనది చింతనం లేదా ధ్యానం. విలువైనదే గాని అంత సులువైనది మాత్రం కాదు. జ్ఞాన సాధనలో ఇది మూడవ మెట్టు. మొదటిది శ్రవణం, రెండవది మననం, మూడవది చింతనం. పరమాత్మతత్వం పై చింతన చేయాలంటే ముందుగా సద్గురువు వద్ద కూర్చొని భక్తితో, శ్రద్ధతో, ఏకాగ్రతతో శ్రవణం చేయాలి. ఏం శ్రవణం చేయాలి? వేదాంత శ్రవణం

చేయాలి. ఉపనిషత్తులలో నిక్షిప్తం చేసిన జ్ఞానాన్ని శ్రవణం చేయాలి. ఎందుకంటే ధ్యానానికి ముందు జ్ఞానం తప్పనిసరి. జ్ఞానం స్థిరమై, సంపూర్ణంగా ఉన్నప్పుడే అది ధ్యానానికి సహాయకారి అవుతుంది. ఇలా స్థిరము, సంపూర్ణము కావాలంటే శిష్యుడు సాధన చతుష్టయ సంపన్నుడై శ్రవణం చేయాలి. గురువు శ్రోత్రియుడు, బ్రహ్మనిష్టుడై ఉండాలి. ఇలా శ్రవణం చేసి ఆత్మ జ్ఞానాన్ని పొందిన తరువాత, అది స్థిరం కావాలంటే శిష్యుడువిన్న జ్ఞానాన్ని మరలా మరలా తనలో మననం చేసుకుంటూ వుండాలి. ఇలా శ్రవణ మననములైన తరువాత ధ్యానం చేయాలి – చింతన చేయాలి. ఇలా చేస్తేనే విన్న విషయం అనుభవంలోకి వస్తుంది. శ్రవణ, మననాలలో జీవుడుగా వ్యవహరిస్తున్న తాను నిజంగా పరమాత్మనేనని; ఈ మనోబుద్ధులలో కూర్చొని అకర్తను, అభోక్తను, ఆనంద స్వరూపుడను, అసంగుడను అని మరచి, ఈ దేహ మనోబుద్ధులతో తాదాత్మ్యంచెంది, వాటి వృత్తులను తనపై ఆరోపించుకొని కర్తగా, భోక్తగా వ్యవహరిస్తున్నానని, వీటి తాదాత్మ్యం విడిచి తాను తానుగా ఉండాలని తెలుసుకుంటాడు. అలా తెలుసుకున్న విషయాన్ని చింతనలో, ధ్యానంలో 'సో2హం' అని 'ఆ పరమాత్మను నేనే' అని అనుభవపూర్వకంగా స్థిరీకరించుకుంటాడు. ఇదీ ధ్యానలక్ష్యం.

జపం అంటే ఒక మంత్రాన్ని విడువకుండా మరలా మరలా ఉచ్ఛరించడమే. ఏకాగ్రతతో ఇలా ఉచ్ఛరించడం వల్ల మనలో అసద్వాసన తొలగి సద్వాసన స్థిరపడుతుంది. జపంలో ఆలోచించటానికి ఏమీ వుండదు. కాని చింతనలో (ధ్యానంలో) మాత్రం సద్వస్తువు గురించిన ఆలోచన సాగాలి. ఈ ఆలోచనలన్నీ సద్వస్తువు గురించే జరగాలి. అయితే ఈ చింతన చేయబడే వస్తువు గుణములతో కూడియున్నదా? (సగుణమా?), గుణములు లేకుండా ఉన్నదా?(నిర్గుణమా?) అనే చర్చజోలికి మహర్షి పోవటం లేదు. ఎందుకంటే

మహర్షి దృష్టిలో రెండూ సమానమే. దేహభావనలో నీవు ఉన్నంత వరకు భగవంతుని కూడా దేహధారి అనే భావనలోనే సగుణధ్యానం చేస్తావు. అలాగాక నేను దేహం కాదు, దీనికి వెనుక ఆధారంగా ఉన్న ఆత్మచైతన్యాన్ని – నిరాకార, నిర్గుణ, చైతన్యాన్ని అనే జ్ఞానంలో నీవు ఉన్నప్పుడు భగవంతుని నిరాకార, నిర్గుణ, సర్వవ్యాపక పరమాత్మగా భావించి నిర్గుణ ధ్యానం చేస్తావు. సగుణ ధ్యానంతో ప్రారంభించినా నిర్గుణ ధ్యానంలో తప్పక ప్రవేశిస్తావు. కనుకనే ఆయన నిర్గుణ – సగుణ భావాలను పట్టించుకోలేదు. ఇక్కడ చింతన లేదా ధ్యానాన్ని రెండు విధాలుగా విభజించారు. ఒకటి సరళ చింతనం. రెండవది విరళ చింతనం.

1) సామాన్యంగా ధ్యానానికి (చింతనకు) కూర్చోగానే మనం సద్వస్తువునుగురించి చింతన ప్రారంభిస్తాం. అయితే ఇప్పటి వరకు మనమనస్సు అనేక విషయాలలో, భోగాలలో మునిగి ఉన్నది గనుకను; అనేక వస్తువులు దేహపోషణకు, కుటుంబ పోషణకు, జీవనానికి అవసరము గనుకను – వాటికి సంబంధించిన ఏదో ఆలోచన మనస్సులోకొస్తుంది. దానితో మనస్సు వాటియొక్క ఆలోచనలను కొనసాగిస్తుంది. కొంత సమయం గడిచిపోయిన తర్వాత గాని, మనం ఏ వస్తువును గురించి ధ్యానించటానికి (చింతన చేయటానికి) కూర్చున్నామో – అది మరచి ఏవేవో అనవసరమైన లౌకిక విషయాలను గురించి చింతన చేస్తున్నామని గ్రహింపుకు రాదు. అలా గ్రహించటంతోనే మరల పరమాత్మ చింతనం ప్రారంభిస్తాం. ఇలా మనస్సు పరమాత్మ చింతన చేస్తూ, మధ్య మధ్య అన్యవిషయాలమీదకు పోతుంటే తిరిగి ప్రయత్నంతో పరమాత్మ పైకి తీసుకొని వచ్చి చింతన సాగిస్తూ ఉండటాన్నే 'విరళ చింతనం' అన్నారు.

2) అలా కాకుండా దీక్షతో, పట్టుదలతో అభ్యాసం చేసి, మధ్యమధ్యలో ఎలాంటి అంతరాయాలు కలగకుండా, మనస్సు ఎటువైపుకూ పోకుండా,

కరిగించిన నెయ్యి పైనుండి క్రిందికి ఏకధారగా ఎలా పడుతుందో, ఏ విధమైన ప్రయత్నమూ లేకుండానే జీవనదులలో నీరు ఎలా ప్రవహిస్తూ ఉంటుందో, అలాగ చింతన పరమాత్మ మీదనే అప్రయత్నంగా, అఖండంగా, సాఫీగా సాగిపోతూ ఉంటే దీనిని 'సరళ చింతనం' అని మహర్షి పేరు పెట్టారు.

ఇలాసాగే సరళ చింతనం, ఆటంకాలతో సాగే విరళ చింతనం కన్న శ్రేష్ఠమైనదని, ఉన్నతోన్నతమైనదని మహర్షి ఈ శ్లోకంలో స్పష్టం చేస్తున్నారు. ఎందుకంటే ఈ సరళ చింతనం వల్లనే 'సో2హం' అతడు నేనే, నేను పరమాత్మనే అనే అనుభవం కలుగుతుంది కనుక. అట్టి అనుభవం వల్లనే జీవన్ముక్తి లేదా మోక్ష ప్రాప్తి గనుక. కనుక సరళ చింతనం అత్యంత ఉత్తమమైనది.

ఇంతవరకు చెప్పిన సాధనలలో పూజ కన్న జపం, జపం కన్నా చింతనం ఉత్తమమైనవని, చింతనలో కూడా విరళ చింతనం కన్న సరళ చింతనం అత్యుత్తమమైనదని, శ్రేష్టమైనదని మనకు అర్థం అవుతున్నది. కనుక అన్ని సాధనలు వదలి ఈ సరళ చింతనమే సాగిద్దాం అని అనుకుంటే అది పెద్ద పొరబాటే.ఎందుకంటే ఈ సాధనలన్నీ నిచ్చెన మెట్లవంటివి. పై అంతస్తును చేరుకోవాలంటే నిచ్చెన ఉపయోగపడుతుంది. నిజమే. అందులోను చివరి మెట్టు మాత్రమే మనను పై అంతస్థులోనికి చేరుస్తుందనీ తెలుసు. అలాగని ముందే నిచ్చెన చివరిమెట్టు మీద కాలు పెడతామా? లేదుగదా? అలా పెట్టలేం కూడా. అలాగే భక్తి సాధనలో కూడా ఒక్కొక్క మెట్టు పైకెక్కుతూ చివరిమెట్టు అనదగిన సరళ చింతనంలోనికి ప్రవేశించాలి.

శారీరకమైన పూజాదులు చేయనిదే రజోగుణం తొలగదు; భగవంతుని వైపుకు మనస్సు తిరగదు. వాచికమైన జపం దీర్ఘకాలం కొనసాగించనిదే మనస్సులోని అసద్ వాసనలు అంతమై చిత్తశుద్ధి కలగదు.

అలా చిత్తశుద్ధికలిగితే గాని సద్గురువు ద్వారా శ్రవణం జరగదు. శ్రవణం చేస్తే గాని మననం చేసి విషయాన్ని స్థిరపరచుకోలేం. ఇలా శ్రవణ, మననాల ద్వారా మన యదార్ధ స్థితి తెలుసుకొని, ప్రశాంత చిత్తంతో కూర్చుంటే తప్ప చింతనం సాగించలేం. ఎంత ప్రశాంతంగా కూర్చున్నా పరమాత్మ చింతన సాగిస్తుంటే అన్య విషయాల మీదకు మనస్సు పోకుండా ఉండదు. అలాపోతే అది విరళ చింతనమే. అయితే దీర్ఘకాలం వదలకుండా ఈ విరళ చింతనాన్ని సాగిస్తూ, ప్రాపంచిక విషయాల పట్ల వైరాగ్యంతో, పరమాత్మపై అత్యంత భక్తితో, రాగంతో ఉంటే తప్ప ఈ విరళ చింతనం సరళచింతనంగా మారదు. కనుక క్రమక్రమంగా సావధానంగా సాధన సాగించి విజయం సాధించాలి. అంతేతప్ప ఒక్కసారిగా సరళచింతనం అభ్యసిద్దాం అని అనుకోరాదు. మన ఆకలి తీరాలంటే కనీసం డజను చక్రకేళీలన్నా తినాలని బజారునుండి ఒక డజను చక్రకేళీలు కొనుక్కొచ్చి తినటానికి ఎదురుగా పెట్టుకొని కూర్చున్నాం. ఇంతలో ఆలోచన వచ్చింది. మనం మొత్తం 12 పండ్లు తినాలి గదా ! ముందుగా 12వ పండు తిందాం ఆకలి తీరిపోతుంది అనుకొని 12వ పండు తింటే ఎలా ఉంటుందో, అన్ని సాధనలు వదిలి, సరళ చింతనం ఒక్కటే అభ్యాసం చేద్దాం అంటే అలాగే ఉంటుంది. ఆధ్యాత్మిక రంగంలో నెమ్మది, నిలకడ కలిగిన వాడే విజయం సాధించగలుగుతాడు. స్లో & స్టడీ విన్స్ ద రేస్ అన్నారు.

తైలధారలాగా సరళ చింతనం చాలాకాలం అభ్యాసం చేస్తేనే ఆ అభ్యాసం వల్ల అన్ని సంకల్ప వికల్పాలు జ్ఞానాగ్నిలో భస్మీపటలమై 'అహంబ్రహ్మాస్మి' నేనుబ్రహ్మమునే అనే అనుభవంలో నిలిచి పోవటం జరుగుతుంది. 'ఆత్మ సంస్థం మన: కృత్వా నకించి దపిచింతయేత్' అనే గీతా వ్యాక్యార్థం సఫలీకృతమౌతుంది.

ఇంతవరకు మనం అనేక భక్తి సాధనలు చెప్పుకున్నాం.

అందులో సరళ చింతనం యొక్క శ్రేష్టత్వాన్ని చెప్పుకున్నాం. అయితే ఏ భావనతో చేస్తే ఇది శ్రేష్టం అనే విషయాన్ని తరువాత శ్లోకంలో చెప్పబోతున్నారు.

–మనం చేసే చింతనం ఏరకమైన భావనతో చేస్తే అది ముక్తికి దారితీస్తుంది. అనే విషయాన్ని స్పష్టం చేస్తున్నారీశ్లోకంలో

**శ్లో॥ భేదభావనాత్ సో2 హమిత్యసౌ।**
**భావనా2 భిదా పావనీ మతా॥ –8**

**ప్రతిపదార్థం** : భేదభావనాత్ = భేదభాంతో చేసే చింతనకన్న, సో2హం ఇతి = అతడునేనేనని, అసౌ = ఈ, అభిదాభావన = అద్వైత భావన(అభేద భావన)తో చేసేచింతన, పావనీ మతా = పావనమైనదని శ్రుతిమాత అభిప్రాయం.

**భావం** : నేను వేరు, పరమాత్మ వేరు అనే భేదభావంతో చేసే చింతనం కన్నా, ఆ పరమాత్మ నేనేననే అభేద భావంతో (అద్వైత భావంతో) చేసే చింతనం ఎంతో పవిత్రమైనది, శ్రేష్ఠమైనది అని శ్రుతుల యొక్క నిర్ణయం.

**వ్యాఖ్య** : ఉపనిషత్తులు బోధించే పరమాత్మతత్వం తెలుసుకోక ముందు – అంటే ఆత్మజ్ఞానం కలుగక ముందు మనందరి భావన ఒకటే. 'నేను వేరు, భగవంతుడు వేరు' అని. అందుకే మన సుఖసంతోషాల కోసం, దు:ఖ నివారణకోసం,కోరిన కోర్కెలను తీర్చుకోవటం కోసం భగవంతుని ప్రార్థిస్తాం. ఎక్కడో ఉన్న భగవంతుణ్ణి సమీపించటం కుదరదు గనుక, ఆభగవంతునికి ప్రతీకలుగా కొన్నిరూపాలను, విగ్రహాలను సృష్టించుకొని పూజిస్తాం. భగవంతుని నామాలనే జపం చేస్తాం. అలాగే భగవంతుని అవతారాలను స్మరిస్తూ ఆ అవతార పురుషుల యొక్క గుణగణాలను,వారి మహాత్యాలను, వారు చేసిన లీలలను చింతన చేస్తూ ఉంటాం, లేదా ఏవైనా ఆధ్యాత్మిక గ్రంథాలను చూచినట్లైతే పరమాత్మ సర్వ వ్యాపకుడు, సర్వాంతర్యామి అని

తెలుసుకొని ఆయా గుణాలను చింతన చేస్తుంటాం. ఇలా చేస్తున్నప్పుడు పరమాత్మ వేరుగా ఉన్నాడని, నేను ఆయన కన్నా వేరుగాఉన్న అల్పజ్ఞుడనని భావిస్తుంటాం. ఇదే భేద భావం. అయితే ఇటువంటి భేదభావన కన్నా 'సో2హం' స: అహం – ఆ పరమాత్మను నేనే అనే 'అసౌ అభిదా భావన' ఈ అభేద భావన లేదా అద్వైత భావన 'పావనీ' పవిత్రమైనది అంటున్నారు మహర్షి.

ఈ అద్వైత భావన మనకెందుకు కలగటం లేదు? ఎన్నో వేదాంత గ్రంథాలను అధ్యయనం చేసిన వారు గాని, ఉపనిషత్తులలోని పరమాత్మ తత్త్వాన్ని అనర్గళంగా ఉపన్యశించగల జ్ఞాన బ్రహ్మలు, వేదాంత శిరోమణులు గాని, నిత్యము జపధ్యానాలను కొనసాగించే సాధకులు గానీ ఎవరైనా సరే ఈద్వైత భావనలో, బేధ భావనలోనే ఉంటున్నారు. నేను గొప్పగా ఉపన్యసిస్తున్నాను, నా ప్రసంగాలకు జనులు తన్మయులవుతున్నారు, నేను ప్రస్తుతం ఫలానా గ్రంథం వ్రాస్తున్నాను.. అంటూ తాను దేహాన్ని అనే దేహభావన లోనే ఉంటున్నారు. ఎందువల్ల నంటే ఎన్నో జన్మల నుండి ఉన్న అజ్ఞానం వల్లనే, అలవాటు వల్లనే.

కనుకనే ఈ భేద భావన మనను వీడటం లేదు. నేను, పరమాత్మ ఒక్కటే, నేను పరమాత్మనే అనే అద్వైత భావన కలగటం లేదు, ఒకవేళ శాస్త్రం తెలుసుకున్నా మనకు స్థిరభావం కలగటం లేదు. ఎందుకంటే భగవంతుడు సర్వజ్ఞుడు, నేను అల్పజ్ఞుణ్ణి. భగవంతుడు సర్వవ్యాపి, నేను పరిమితమైన దేహం గలవాణ్ణి. భగవంతుడు పుట్టుక లేనివాడు, నేను పుట్టుక ఉన్నవాణ్ణి. భగవంతుడు నిత్యుడు, నేను కొంతకాలం మాత్రమే ఉండేవాణ్ణి. అనిత్యుణ్ణి. భగవంతుడు కోర్కెలు తీర్చేవాడు, నేను కోరికలు కోరేవాణ్ణి. భగవంతుడు ఆనంద స్వరూపుడు, నేను దు:ఖాలతో సతమతమై పోయేవాణ్ణి– అని ఇలాగా ఎన్నో భేదాలను చూస్తూ భావిస్తూ ఉండటంవల్లనే మనకు

సో2హం భావనకలగటం లేదు. దీనికంతటికీ కారణం 'నేను' అన్నప్పుడు మన దృష్టి ఈ దేహ మనోబుద్ధులపైనే ఉంటున్నది కానీ వీటికి వేరుగా వుండి, వీటికి చైతన్యాన్నిచ్చే సూక్ష్మాతి సూక్ష్మ, సర్వవ్యాపక, స్వయం ప్రకాశ చైతన్యమైన ఆత్మపై ఉండటం లేదు. 'భగవంతుడు' అన్నప్పుడు మనకు తెలియని, ఎక్కడో ఉన్నాడనుకొనే అవతార పురుషుడిపైన ఉంటున్నది కాని సర్వవ్యాపక చైతన్యంపై ఉండటం లేదు. 'నేను' అన్నప్పుడు మనదృష్టి చైతన్యంపై ఉంటే నేనూ శుద్ధ చైతన్యమే, పరమాత్మా శుద్ధ చైతన్యమే అనే భావన స్థిరపడి సో2హం భావన స్థిరపడుతుంది. అద్వైత భావన స్థిరపడుతుంది.

సముద్రంలో ఎన్నో అలలు వస్తుంటాయి. అందులో చిన్నవీ ఉంటాయి, పెద్దవీ ఉంటాయి. అల తనయొక్క పరిమాణాన్ని, రూపాన్ని చూసుకొని నేను వేరు, సముద్రం వేరు అనుకుంటుంది. ఎందుకంటే నేను చిన్నదాన్ని, సముద్రమేమో చాలాపెద్దది. నేనేమో కొద్ది సేపు మాత్రమే వుండి తీరాన్ని తాకి నశించిపోతాను, సముద్రమేమో ఎప్పుడూ శాశ్వతంగా ఉంటుంది. నేనేమో ఎప్పుడూ తీరం వైపుకు కదులుతూ చలిస్తూ ఉంటాను. సముద్రం నిశ్చలంగా కదలకుండా అలా ఉండిపోతుంది - అని అనుకోవటం వల్ల నేను వేరు, సముద్రం వేరు అనే భావన ఉంటుంది. అలాగాక అల తనలో ఉన్నదంతా నీరే, సముద్రంలో ఉన్నదంతా నీరే. ఆ నీటికి ఈ నీటికి భేదం ఏమీ లేదు. ఎక్కడ చూచినా ఆ నీరే. ఉప్పు నీరే అని నీటి దృష్టితో చూచినప్పుడు ఇక అల, సముద్రం అనే భేదమే లేదు. నేను సముద్రాన్నే అని అనగలుగుతుంది.

అలాగే మనం ఈ నామ, రూప, గుణాలతో ఉన్న దేహం దృష్టితో చూస్తే నేను వేరు, భగవంతుడు వేరు. అలాగాక నేను ఈ నామ రూప గుణాలకు వేరుగా ఆధారంగా ఉన్న శుద్ధ చైతన్యం అని గ్రహించి,

చైనత్య దృష్టితో చూస్తే నేను ఆ పరమాత్మే. అంతా శుద్ధ చైతన్యమే, ఒక్కటే అనే నిశ్చయ జ్ఞానం కలుగుతుంది.

ఇటువంటి అద్వైత భావన – అభేద భావనయే పవిత్రమైనది అంటున్నారు మహర్షి. ఏమిటి పవిత్రం అంటే? భగవద్గీత చెబుతున్నది "నహిజ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే" అని. అంటే జ్ఞానం కన్న పవిత్రమైనది మరొకటి ఏదీ లేదు అని. జ్ఞానం అంటే ఆత్మజ్ఞానమే. ఆత్మజ్ఞానమంటే నేను ఆత్మను – పరమాత్మను అనే జ్ఞానమే. ఇదే పవిత్రమైనది, శ్రేష్టమైనది, మోక్షదాయకమైనది. కనుక నేను దేహాన్ని కాదు, నేను ఆత్మను – చైతన్యాన్ని. నేనూ చైతన్యాన్నే. నీవూ చైతన్యానివే. అతడూ చైతన్యమే, ఆమే చైతన్యమే, అదీ చైతన్యమే. సర్వమూ చైతన్యమే. సమస్తము పరమాత్మే. కనుక అందరూ – అన్నీ పరమాత్మే. ఉన్నదంతా పరమాత్మే. 'ఏకమేవా2 ద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కించన'. " చైతన్యం వినా కించిత్ నాస్తి" అని నిరాలంబోపనిషత్. కో2హం? అని ప్రశ్నించుకుంటే సో2హం అని సమాధానం రావాలి. ఇదే అభిదాభావన. ఇదే పవిత్ర భావన. ఎందువల్ల ఇది పవిత్రం?

మనస్సులో నున్న విపరీత భావనను తొలగించేది ఇదే. నేను ఆత్మను అని తెలియకపోవటం అసంభావన. నేను దేహాన్ని అని భావించటం విపరీత భావన. ఈ విపరీత భావన పోవాలంటే 'సో2హం' అనే పరమాత్మ భావన చెయ్యాలి. సరైన దృష్టితో ధ్యానం చెయ్యాలి. ఇలా నేను ఆత్మను అనే భావన లేకుండా, పరమాత్మ నాకన్నా వేరుగా ఉన్నాడు అని చేసే ధ్యానం వల్ల పరమాత్మను తన కంటికెదురుగా ఒక జ్యోతి స్వరూపంగా చూడగలనని,లేదా తన హృదయంలోనే ఒక దివ్యకాంతి చైతన్యంగానో, జ్యోతిలాగానో చూడగలనని, చూస్తున్నానని ఒక భ్రమలో ఉండి పోవటం జరుగుతుందే గాని, ఆత్మానుభూతి కలిగే అవకాశమే

వుండదు. కనుక ఎల్లప్పుడూ అజ్ఞానంలోనే ఉండిపోతాడు.

సరైన దృష్టితో – అవగాహనతో చేసే సాధనలే మోక్షప్రాప్తికి మార్గమవుతున్నవి. ఇదే పావనీ – పవిత్రం అని మహర్షియొక్క అభిప్రాయం. శ్రుతుల అభిప్రాయం కూడా ఇదే. కనుక మోక్షప్రాప్తికి మార్గం చూపే ఈ అభిదా భావన – అద్వైత భావనయే పరమ పవిత్రం అన్నారు. ఇట్టి భావన వల్ల ప్రయోజనం ఏమిటి?

–ఇట్టి అభేదభావన లేక అద్వైత భావన వల్ల ఎట్టి స్థితి కలుగుతుందో తెలియజెప్పి భక్తి యోగ సాధనను ముగిస్తున్నారు.

**శ్లో॥ భావశూన్య సద్ భావసుస్థితి:।**
**భావనా బలాత్ భక్తిరుత్తమా॥ –9**

**ప్రతిపదార్థం** : భావనా బలాత్ = ఆ పరమాత్మ నేనే అనే అద్వైత భావనా బలం చేత, భావ శూన్య= భావాతీతమైన (ఆలోచనలులేని), సద్భావ సుస్థితి: = సద్ రూపమైన పరమాత్మనే నేను అనే స్థిర నిశ్చయం కలుగుతుంది, ఉత్తమా భక్తి: = ఇదే ఉత్తమమైన భక్తి.

**భావం** : భేద భావన కన్నా 'సో2హం' నేను ఆ పరమాత్మననే అభేద భావన ఉత్తమమైనదని ఇంతకు ముందు శ్లోకంలో చెప్పుకున్నాం. ఇదే మోక్షసాధనకు దారి తీస్తుందనీ తెలుసుకున్నాం. అట్టి భావన (సో2హం) చేయగా చేయగా ఆ భావనా బలం వల్ల భావాతీత పరమాత్మ స్థితిలో స్థిరంగా నిల్చిపోతారని, ఇదే ఉత్తమ భక్తి అని అంటారు.

**వ్యాఖ్య** : భక్తిని పెంపొందించే సాధనలు పూజ, జపం, చింతనం ఇవన్నీ భేదభావనలో కాక అభేద భావనతో చేస్తేనే అవి పవిత్ర సాధనాలవుతాయి. చివరి సాధన అయిన సరళ చింతనంవల్ల సాధకుడు తన స్వరూపంలో నిలిచిపోతాడని చెప్పుకున్నాం. ప్రతివాని యొక్క స్వరూపం – స్వస్థితి ఏమిటి? అంటే "భావశూన్యసద్భావ స్థితియే" అంటే ఎట్టి సంకల్పములు లేని

ఆత్మస్థితియే. నిస్సంకల్ప, నిర్వికల్ప సమాధియే. (ఒకసారి సరళ చింతనం పరిపూర్ణమైతే అఖండాకార వృత్తి – లేదా బ్రహ్మ స్వరూపం, లేదా స్థిత ప్రజ్ఞత్వం, లేదా బ్రహ్మ నిష్ట స్థిరంగా నిల్చిపోతుంది. దీనినే 'అమనస్కము' అని, మనో నాశనమని కూడా చెపుతారు) భగవద్గీతలో "నైవకించిత్ కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్ పశ్యన్, శృణ్వన్ స్పృశన్ జిఘ్నన్.... ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతిధారయన్" అని చెప్పిన గీతా వాక్యార్థం అ స్థితినే వర్ణిస్తున్నది. అయితే కేవలంగా ఉండే ఈ స్థితి ఎలా వస్తున్నది? అంటే భావానా బలం చేతనే – అద్వైత భావనా బలం చేతనే. అందుకే బ్రహ్మసూత్రాలలో 'పౌన: పున్యేన శ్రవణం కుర్యాత్" అనే సూత్రం ద్వారా మరల మరల శ్రవణాదులు చేసిన వారికి తప్ప ఈ భావ శూన్య సద్భావ స్థితి కలగదని స్పష్టం చేశారు. ఈ ఆత్మ నిష్టయే ఉత్తమ భక్తి అంటున్నారు మహర్షి. అంటే ఈ స్థితిలో భక్తి జ్ఞానములు ఏకమై పోతున్నాయి. భక్తి అన్నా జ్ఞానమన్నా ఒక్కటే అంటున్నారు. అయితే ఈ భక్తి పరాభక్తి. అన్యమెరుగని అనన్యభక్తి. రెండవదేదీ లేని కేవల స్థితి.

నిజంగా భక్తి జ్ఞానములు పరస్పర ఆధారాలు. ఒక దానిపై ఒకటి ఆధారపడి ఉంటాయి. ఒక వ్యక్తి మీద మనకు ప్రేమ ఉంటే అతడిపై ఆసక్తి కలిగి ఉంటాం. అతడి గుణగణాలను గమనిస్తూంటాం. అతడి గురించి తెలుసుకుంటాం, అతడి గొప్పతనాన్ని నలుగురికీ చెబుతుంటాం. అంటే ఎలాగో ఒకలా ప్రేమ కలిగితే అతడి గురించి తెలుసుకుంటాం. అలాగాక ఒక వ్యక్తి చాలా గొప్పవాడని, మంచి వాడని తెలుసుకుంటే అతడికి దగ్గర కావాలని, అతడి అభిమానాన్ని సంపాదించాలని ప్రయత్నిస్తాం. అందుకోసం అతణ్ణి ప్రేమిస్తాం. అలాగే భగవంతుని గొప్పతనం మహిమ తెలిస్తే (జ్ఞానం) ఆయనపై ప్రేమ కలుగుతుంది, దగ్గరవుతాం (భక్తి). అలా గాకుండా  ఒకవేళ తెలియకుండానే పసితనం

నుండి పెద్దలవల్ల గాని, పరిసరాల ప్రభావం వల్లగాని భక్తి ఏర్పడితే – ఆ తర్వాత తర్వాత భగవంతుని గుణగణాలను, మహిమను తెలుసుకుంటాం. అంటే భక్తి జ్ఞానంగానైనా మారుతుంది, జ్ఞానం భక్తిగా నైనా మారుతుంది. మొత్తం మీద భక్తి జ్ఞానాలు రెండూ విడదీయరానివి. కనుక సో2హం భావన (ఆ పరమాత్మ నేను అనేజ్ఞానం) దాసో2హం (నేను పరమాత్మకు దాసుడను అనే భక్తి) పై ఆధారపడుతుంది.

ఆత్మజ్ఞాన సంపన్నుడు, బ్రహ్మ నిష్టా గరిష్టుడు అయిన మధుసూదన సరస్వతీ స్వాముల వారు పీఠాధిపతులు (కంచి) గా నున్నప్పుడు ఆయన శ్రీకృష్ణుని నామం పలుకుతున్నా, వింటున్నా పరవశించి పోయే వారు. శిష్యులు చాలా అశ్చర్యపడుతుండే వారు. కాని అడగటానికి ధైర్యం చాలలేదు. నిరంతరం బ్రహ్మనిష్ఠలో ఉండే స్వాముల వారికి పరవశం ఏమిటా? అని. ఒకరోజున ఆ మహాత్ముడు శిష్యులతో అన్నాడట. దాసో2హం అని నేను శ్రీకృష్ణుని వద్దకు చేరాను. అయితే చేరిన తర్వాత తెలిసింది. ఆయన గొప్పదొంగ అని. చిన్నతనంలో వెన్న దొంగిలించాడు, గోపికల వస్త్రాలుదొంగిలించాడు. అయితే అదంతా చిన్నతనంలోని చిలిపి చేష్టలులే అని సరిపెట్టుకున్నాను. కాని ఆయనకు ఆ అలవాటు పోలేదు. భార్యలను దొంగిలించుకు వచ్చాడు. చివరికి దాసో2హం అని చేరిన నా నుండి ‘దా’ను దొంగిలించాడు. ఇంక నాకు మిగిలిందేముంది సో2హం మాత్రమే – అని.

భక్తితో భగవంతుని చేరితే చాలు. మనలో ఏం తొలగించాలో దాన్ని తప్పక తొలగిస్తాడు. ఏం కలిగించాలో దాన్నీ కలిగిస్తాడు. ఆయన రెంటికీ తగిన వాడే. నిగ్రహానుగ్రహ సమర్థుడు. కనుక నిజమైన భక్తి జ్ఞానంగా మారుతుంది. భక్తి జ్ఞానాలకు బేధం లేకుండా పోతుంది. అనేకత్వం తొలిగి ఏకత్వమే మిగులుతుంది.

బ్రహ్మవైవర్త పురాణంలో రాధ అంటుంది, నా నుండి కృష్ణుని ఎవరు వేరు చేయగలరు? ఎలా వేరు చేయగలరు? అగ్ని నుండి వేడిని గాని, మంచుగడ్డ నుండి చల్లదనాన్ని గాని ఎవరైనా వేరు చేయగలరా? ఆయన ఒట్టి కృష్ణుడు కాదు రాధాకృష్ణుడు. రాధా, కృష్ణుడు అని ఇద్దరు లేరు. ఉన్నదొక్కరే అని అన్నది. అంటే ఆమెది కూడా సో2హం భావనయే. అర్ధనారీశ్వరుని నుండి నారిని వేరు చేయగలమా?

అయితే సో2హం భావన కూడా ఒక భావనయే. భావన ఎప్పుడైనా మారవచ్చు. కనుక ఆ భావన కూడా పోవాలి. భావశూన్య సద్భావ స్థితి కలగాలి. ఎలా పోతుంది ఆ భావన? నిరంతరం ఆ భావన చెయ్యటం వల్లనే. స్వరాన్ని మరచి అదే భావన నీలో అనంతంగా కొనసాగటం వల్లనే. ఆ భావనా బలం వల్లనే భావశూన్య సద్భావ స్థితి.

నేను నిద్రపోతున్నాను అంటాడు. నిజంగా నిద్రపోతున్నాడా? నిద్రపోతుంటే నిద్రపోతున్నానని అనుకోగలడా? ఇతరులకు చెప్పగలడా? అంటే నిద్రకు పోబోతున్నాడే గాని నిద్రపోవటం లేదు. అంటే నిద్ర పోదామనే భావంతో ప్రక్క మీదకు చేరుతున్నాడు. నిద్ర వస్తోంది అనే భావం మనస్సులోకి వస్తుంది. ఈ భావం కలగటంతోనే అప్పటివరకు ఉన్న ఇతర ఆలోచనలు, భావాలు ఆగిపోతాయి. ఆ తర్వాత తెలియకుండానే నిద్రలోనికి జారుకుంటున్నాడు. అంతవరకు నిద్ర గురించిన ఆలోచన, భావం మనస్సులో ఉంటుంది. పూర్తిగా నిద్రపోయిన తర్వాత ఇక ఏ భావం వెంటుంది? నిద్రపోతున్నానని గాని, నిద్రపోవాలని గాని ఏ ఆలోచన, భావం ఉండదు. నిద్ర స్థితి మాత్రమే ఉంటుంది. అంటే నిద్ర భావన వున్నంత కాలం నిద్రాస్థితి లేదు. నిద్రా స్థితిలోకి చేరగానే నిద్ర భావనలన్నీ అంతమైపోయాయి. ఏ భావనలు లేని భావశూన్య స్థితియే ఆ నిద్ర.

అలాగే నేను పరమాత్మను అనే భావన ఉన్నంతవరకు

పరమాత్మ స్థితిలో ఉన్నట్టు కాదు. పరమాత్మ స్థితిలో నిల్చిపోవటంతో అన్ని భావాలు అంతమైపోతాయి. నిద్రాస్థితిలో ఉన్నవాడు నేను నిద్రపోతున్నానని భావన చేయలేనట్లుగానే పరమాత్మ స్థితిలో నున్న మహాత్ముడు నేను పరమాత్మను అనే భావన చెయ్యడు. చెయ్యలేడు. భావనలన్నీ అంతమై నప్పుడు ఆ భావాలకు ఆధారమైన సద్ రూప చైతన్యమే అక్కడ ఉంటుంది. అయితే ఆ భావాలన్నీ ఎలా అంతమవుతాయి? నిరంతరం భావన చెయ్యటంవల్లనే – సరళ చింతనం చెయ్యటం వల్లనే. ఆభావనా బలం వల్లనే భావశూన్య స్థితి. కనుక భావాలు నశింపచేయటానికి మనం ప్రయత్నం చెయ్యకూడదు. కొందరు భావాతీత ధ్యానం 2 రోజుల్లో నేర్పుతున్నారు, చేస్తున్నారు, ఇది హాస్యస్పదం. నిరంతరం సో2హం భావన చెయ్యటానికే ప్రయత్నించాలి. ఇలా చేయగా చేయగా భావ శూన్య సద్భావస్థితి కలుగుతుంది. ఇది కేవలం అనుభవస్థితి. ఈ స్థితి ఎలా ఉంటుందో మనకు తెలియదు. అది మహర్షి లాంటి వారికే తెలుస్తుంది. వారి మాటలను బట్టి మనం అర్థం చేసుకోవాల్సిందే. అర్థం చేసుకొని మనసాధన మనం చేయాల్సిందే. ఏం చేయాలి? అన్యమైన ప్రాపంచిక ఆలోచనలను వదలి సో2హం – ఆ పరమాత్మ నేనేనని నిరంతరం భావన చేయాలి. చింతన చేయాలి. సరళ చింతనం చేయాలి.

అన్యమైన ఆలోచనలను మనలో చేరనివ్వకుండా జాగ్రత్త పడాలి. మనం ఒక్క ఆలోచనకు అవకాశం ఇస్తే చాలు. ఇక గుంపులు గుంపులుగా వచ్చి చేరతాయి. ఒకసారి దత్తాత్రేయుల వారు ఒక సముద్రం ఒడ్డున నిల్చుని సముద్రఘోషను వింటున్నారు. అనంతమైన జలరాశిని తిలకిస్తున్నారు. అంతలో ఎక్కణ్ణించో ఒక గడ్డిపోచ ఎగిరివచ్చి ఆ సముద్రంలోపడ్డది. ఆ గడ్డిపోచను అలలు లోనికి పోతూ లోనికి తీసుకెళ్ళినవి. మళ్ళీ కొన్ని అలలు వస్తూ దానిని తీసుకొచ్చి ఒడ్డున

వదిలిపోయాయి. అప్పుడు దత్తాత్రేయుల వారు సముద్రుణ్ణి చూచి, ఆహా! ఏం స్వార్థమయ్యా నీది? ప్రకృతికి స్వార్థం ఉండకూడదే! నీకెందుకీ స్వార్థం? ఒక్క గడ్డిపోచకు కూడా నీలో స్థానం ఇవ్వలేకపోయావా? అన్నాడు. వెంటనే మరో ఆలోచన వచ్చింది. అయ్యో! నేనిలా ఆలోచించానేమిటి? ఈ రోజున ఒక్క గడ్డిపోచకు నేను అవకాశం ఇస్తే ఇక లోకంలో నున్న చెత్తంతా నాలోచేరి నా స్వరూపాన్నే మార్చేస్తాయి. కనుక నేను నేనుగా ఉండాలంటే ఒక్క గడ్డిపోచను కూడా నాలోనికి చేరనివ్వకూడదు అని గదా! సాగరుని అభిప్రాయం అనుకున్నాడు. అంతే. తానూ నిర్ణయానికి వచ్చాడు. ఒక్క సంకల్పానికి కూడా నేనిక అవకాశం ఇవ్వను. సంకల్పరహితంగా భావ శూన్యంగా ఉంటాను – అని. ఇట్టి భావ శూన్య స్థితినే అత్యుత్తమ భక్తి అని మహర్షి తెలియజేస్తున్నారు.

తన స్వరూపం ఏదో తెలుసుకొని సంకల్పాలన్నీ విడిచి స్వస్వరూపంలో నిలవటమే జ్ఞానం అని మనకు తెలుసు. 'స్వస్వరూపాను సంధానం భక్తి రిత్యభిధీయతే' అని వివేకచూడామణిలో శంకరులు భక్తి నిర్వచనం చేశారు. అంటే స్వస్వరూపంలో నిలవడమే జ్ఞానము, భక్తీ కూడా. కనుక ఇక్కడ భక్తి జ్ఞానముల మధ్య భేదం లేదని తేలిపోతున్నది. మహర్షి అభిప్రాయం అదే. మరి అన్ని యోగాలు ఒక్కటేనా?–

–భక్తియోగమైనా, జ్ఞానయోగమైనా, కర్మయోగమైనా ఒక్క విషయంలో మాత్రం వాటిల్లో ఏ తేడాలేదు. ఏ విషయంలో?

**శ్లో॥ హృత్ స్థలే మన: స్వస్థతా క్రియా।**
**భక్తియోగ బోధాశ్చనిశ్చితం ॥ –10**

**ప్రతిపదార్థం** :క్రియా = కర్మయోగం, భక్తి = భక్తి యోగం, యోగ = రాజయోగం, బోధా:చ= జ్ఞానయోగం అన్నీకూడా, హృత్ స్థలే = హృదయము నందు, మన: = మనస్సు, స్వస్థతా = నిలిచి పోవటం కోసమే, నిశ్చితం =

ఇది నిశ్చయం (తిరుగులేని సత్యం అని)

**భావం** : కర్మయోగమైనా, భక్తి యోగమైనా, రాజయోగమైనా, జ్ఞానయోగమైనా అన్నీకూడా మనస్సును శుద్ధం చేసి హృదయము నందు నిలుపుట కొరకే అనువిషయం నిశ్చయం.దీనికి తిరుగులేదు.

**వ్యాఖ్య** : అధ్యాత్మిక రంగంలో ఉన్న చాలామందికి తమ లక్ష్యం ఏమిటో తెలియదు. అలా లక్ష్యం తెలియకుండా, గమ్యస్థానం ఏదో తెలియకుండా ప్రయాణం చేసేవారు ఎంతకాలం ప్రయాణించినా ప్రయాణిస్తూ ఉండటమే తప్ప గమ్యస్థానాన్ని చేరి శాంతించటంఉండదు. "తిక్కలోడు తిరణాలకు పోతే ఎక్కటం దిగటమే సరిపోయింది" అని సామెత. ఆధ్యాత్మిక సాధనలన్నీ ఎందుకొరకు నిర్దేశించబడ్డాయో మహర్షి ఈ శ్లోకంలో స్పష్టం చేస్తున్నారు.మనస్సు హృదయంలో చేరి స్వస్థత పొందటమే కర్మ, భక్తి,యోగ, జ్ఞాన మార్గములన్నింటి యొక్క లక్ష్యము అని ఇక్కడ తెలియజేస్తున్నారు. అంటే అన్ని ఆధ్యాత్మిక సాధనల యొక్క లక్ష్యం మనస్సు హృదయము నందు స్వస్థత చెందుటయే. ఇక్కడ హృదయము అంటే ప్రత్యగాత్మయే.అంటే జీవునియొక్క నిజ స్వరూపమే. జీవుని నిజ స్వరూపమైన ప్రత్యగాత్మ పరమాత్మే. అక్కడ మనస్సు స్వస్థత చెందటమే లక్ష్యం. స్వస్థత అనే పదాన్ని చక్కగా అర్థం చేసుకోవాలి. మనస్సు అనే ఒక కిరణం ఆత్మ నుండి వచ్చినది.ప్రపంచంలో విహరిస్తుంది. కష్టాలు, సుఖాలు అనుభవిస్తుంది. ఎంతకాలమైనా అంతే. ఎప్పుడైతే తనపుట్టిన చోటును, జన్మస్థలాన్ని తెలుసుకొని అటువైపుకు తిరిగి ప్రయాణించి ఆ చోటును(ఆత్మను) చేరి అందులో కలిసి పోతుందో ఇకదాని కష్టాలు, బాధలు అన్నీ అంతం, పరమశాంతి.

అన్ని నదుల యొక్క పరిస్థితి కూడా ఇంతే. నదుల యొక్క జన్మస్థానం సముద్రం. సముద్ర జలం ఆవిరై మేఘాలుగా మారి, చల్లబడి

వర్షాన్నిస్తే, ఆ జలం వాగులుగా వంకలుగా మారి, నదులను చేరి ఎన్నో వంపులు తిరుగుతూ ప్రయాణించి, ప్రయాణించి చివరకు సముద్రాన్ని చేరి, అందులో కలిసిపోయి, సముద్రాకారంగా మారిపోతాయి. దానితో పరుగులు అంతం. ప్రశాంతి.

ఉప్పుగల్లు సముద్రం నుండే వస్తుంది. ఎక్కడెక్కడో తిరుగుతుంది. రోళ్ళల్లో వేసి రోకళ్ళు దంచుతుంటే ఎగిరెగిరి పడుతుంది. ఎన్నోకష్టాలు పడి చివరకు తనజన్మస్థానమైన నీటిని చేరితే శాంతి.. ప్రశాంతి.

అలాగే మనస్సు ఆత్మనుండి బయలు వెడలి, ప్రపంచమంతా తిరిగి ప్రాపంచిక వాసనలతో, ఆలోచనలతో, కర్మలతో అనేక దు:ఖాలు, అలజడులు, ఆందోళనలు చెంది, చివరకు ఆత్మవైపుకు ప్రయాణించి ఆత్మలో కలిసి పోయి, ఆత్మాకారంగా మారితే ప్రశాంతి. ఆనందం.

అందుకే భగవానుడు గీతలో "మమవర్త్మాను వర్తంతే మను ష్యా పార్థ సర్వశ:" అన్నారు. మనుష్యులందరూ నన్నే అనుసరిస్తున్నారు. నా వైపుకే పరుగులు పెడుతున్నారు – అని. అంటే ఆనందం వైపుకే అని. అయితే కొందరు మాత్రమే దారి తెలుసుకొని పరుగులు పెడుతుంటే మిగిలిన అందరూ దారి తెలియకుండా పరుగులు పెడుతున్నారు. అంతే తేడా. అంటే అందరూ ఆనందం కొరకే ప్రయాణిస్తున్నారు. కాకపోతే బాహ్యంలోని ఆనందం వైపుకే ప్రయాణిస్తున్నారు. అందుకే ఎవ్వరికీ ఎందులోనూ సంతృప్తి లేదు. ఇంకా ఇంకా కావాలి. ఇంకా ఇంకా ప్రయత్నం...

కనుక హృదయం (ఆత్మ) నుండి కదిలిన మనస్సు ఎంతకాలం ప్రపంచంలో తిరిగినా చివరకు హృదయాన్ని చేరి అందులో నిలిచిపోవాలి. మనస్సు బహిర్ముఖమైతే దు:ఖం. అంతర్ముఖమైతే ఆనందం. ఇలా మనస్సును అంతర్ముఖం చేసి ఆత్మవైపుకు ప్రయాణింపచేసి ఆత్మలో నిలిపి వేయటానికే అన్ని సాధనలు,అన్ని మార్గాలు, అన్ని యోగాలు.

అన్ని యోగాల గమ్యమూ ఒక్కటే అయినప్పుడు ఈ యోగాల మధ్య తేడాలను చూడటం ఎందుకు? బాంబే వెళ్ళాలనుకున్నాం. ఇంటి దగ్గర నుండి రిక్షాలో బయలుదేరి బస్టాండుకెళ్ళాం. బస్సులో గుంటూరు వెళ్ళాం. అక్కడ నుండి ట్రైనులో హైదరాబాద్ వెళ్ళాం. అక్కడి నుండి విమానంలో బాంబే వెళ్ళాం. మొత్తం మీద అన్ని ప్రయాణ సాధనాలూ బాంబేను చేరుకోటానికే గదా! ఎవరికి ఏది అనుకూలమో ఎవరు ఏచోట ఉన్నారో దానినిబట్టి సాధనను ఎంచుకోవాలి.

మనస్సు తమోగుణంలో ఉంటే కర్మలు చేస్తూ కర్మయోగాన్ని ఆచరించాలి. రజో గుణంలో ఉంటే భక్తి యోగాన్ని ఆచరిస్తూ మనస్సులోని అలజడులు తగ్గించుకొని శాంతపరచాలి. ఇంకా ఎక్కువగా అలజడులుంటే రాజయోగం – అష్టాంగ యోగం ద్వారా చిత్తశుద్ధి పొందాలి. మనస్సు పూర్తి సత్వంలో నిలిస్తే జ్ఞానయోగం ద్వారా ముందుకు ప్రయాణించాలి. ఇలా ఏ స్థితిలో ఉన్నవారికి ఏ యోగం సరిపోతుందో ఆ యోగంతో ప్రయాణించాలి. నిజంగా ఈ కర్మ, భక్తి, యోగ, జ్ఞాన యోగాలన్నీ మార్గాలే. ఇవన్నీ ప్రయాణసాధనాల వంటివే. ఇవి మనస్సును మోసుకొని వెళ్ళి హృదయములో పడేస్తాయి.

9వ శ్లోకంలో భక్తుడు తన స్వస్వరూపమైన సద్ రూపము నందు (ఆత్మయందు) నిశ్చయం కలిగి ఉండాలని చెప్పబడ్డది. ఇదే నిజమైన భక్తి అనికూడా మహర్షి నిశ్చయం చేసి చెప్పారు. మనస్సును ఆత్మతో అనుసంధానం చెయ్యాలని చెప్పినా, హృదయంలో నిలపాలని చెప్పినా అంతా ఒక్కటే. ఇదే అన్ని ఆధ్యాత్మిక సాధనల లక్ష్యం. ఆ లక్ష్యాన్ని సాధించటానికే అన్ని యోగాలు అని నిర్ద్వందంగా తెలియజేస్తున్నారు. రమణ మహర్షి వంటి మహాత్ముడు చెప్పిన తర్వాత ఇక సందేహించటం వెర్రితనమే అవుతుంది.

ఇంతవరకు మొదటి శ్లోకం 'కర్తురాజ్ఞయా ప్రాప్యతే ఫలం' అంటూ మొదలు పెట్టి 3 శ్లోకాల్లో కర్మయోగాన్ని గూర్చి చెప్పి, నాలుగవ శ్లోకం నుండి ఈ 10వ శ్లోకం వరకు భక్తిని వృద్ధి చేసుకొనే సాధనలైన పూజ, జపం, చింతనం గురించి; వాటి తారతమ్యాలను గురించి వివరించి చెప్పి, ఇప్పుడు మనస్సు యొక్క చలనాలను అరికట్టి, మనస్సును నిలబెట్టే ప్రక్రియలతో కూడిన రాజయోగాన్ని గూర్చి చెప్పబోతున్నారు. దీనినే అష్టాంగ యోగమని కూడా అనవచ్చును.

## రాజయోగము

**శ్లో॥ వాయురోధనాత్ లీయతే మన:।**
**జాలపక్షివత్ రోధ సాధనం॥ -11**

**ప్రతిపదార్థం** :వాయు రోధనాత్ = ప్రాణవాయువును (శ్వాసను) అడ్డగించటం వల్ల, మన: = మనస్సు, జాలపక్షివత్ = వలలో చిక్కిన పక్షిలాగా,లీయతే = లయమైపోవును, రోధసాధనం = ఇది మనస్సును అరికట్టే ఉపాయం.

**భావం** :ప్రాణవాయువును అడ్డగించటం వల్ల మనస్సు వలలో చిక్కిన పక్షిలాగా లయమైపోతుంది. ఇది మనస్సును అరికట్టే ఉపాయం.

**వ్యాఖ్య** : సద్గురువుచే వేదాంతబోధను చక్కగా శ్రవణం చేసి అర్థం చేసుకోవాలంటే మనస్సు ఎటువంటి అలజడులు, ఆందోళనలు లేకుండా ప్రశాంతంగా ఉండాలి. కర్మలను ఈశ్వరార్పితంగాను, నేచ్ఛయాకృతంగాను చేస్తే చిత్తశోధకం (చిత్తశుద్ధి కలిగి) ముక్తి సాధకం (ముక్తికి మార్గమవుతుంది) అని కర్మయోగంలో 3వ శ్లోకంలో చెప్పుకున్నాం. అలాగే భక్తి యోగం ద్వారా కూడా మనస్సును పరిపరి విధాల పరుగులు తీయకుండా చేసుకోవచ్చు. పూజ, జపం, చింతనం వల్ల మనస్సు పరుగులు ఆగి శాంతిస్తుంది అని భక్తి యోగంలో చెప్పుకున్నాం.

కర్మ, భక్తి మాత్రమే గాక యోగ, జ్ఞానాలు కూడా హృదయ

స్థానంలో మనస్సును నిల్పుతాయని మహర్షి 10వ శ్లోకంలో తెలియజేశారు. అందుకే ఇక్కడ యోగ మార్గాన్ని అంటే రాజయోగాన్ని తెలియజేస్తున్నారు. మనస్సెప్పుడూ కదలక మెదలక ఉండదు. అలా ఉంటే మనస్సు లేనట్లే. కదలటం దాని స్వభావం. ఎప్పుడూ ఆలోచనలు చేస్తూనే ఉంటుంది. కనుక మనస్సు చంచలం. మన ఊహకు అందే అనేక రకాలయిన విషయాలను గురించి, సుఖాన్నిచ్చే వస్తువుల గురించి, భోగాలను గురించి, భవిష్యత్ ప్రణాళికల గురించి, గతించి పోయిన విషయాల గురించి, వర్తమానంలోని కర్తవ్యాల గురించి ఎప్పుడూ ఆలోచనలు సాగిపోతూనే వుంటాయి. ఒక దాని తర్వాత ఒకటి ఆలా సాగిపోతూనే ఉంటాయి. మనస్సును గుప్పెటలో పెట్టుకోవాలని ప్రయత్నిస్తే అది గాలిలాగా ఎగిరిపోతుంది. అందుకే భగవద్గీతలో అర్జునుడు–

శ్లో॥ చంచలంహి మన: కృష్ణ! ప్రమాధి బలవదృఢం !
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివసుదుష్కరం॥(గీ– 6 అ. 34 శ్లో)

కృష్ణా ! మనస్సు చంచలమైనది, గయ్యాళిది, గట్టిది, దానిని నిగ్రహించటం అంటే గాలిని మూటగట్టటం లాంటిదే అన్నాడు అర్జునుడు.

భగవానుడు కూడా ఆ విషయాన్ని అంగీకరిస్తూ –

శ్లో॥ అసంశయం మహాబాహో! మనో దుర్ని గ్రహంచలం ।
అభ్యాసేనతు కౌంతేయ! వైరాగ్యేణచ గృహ్యతే । (35 శ్లో)

ఓ అర్జునా ! మనస్సు చంచలమైనది, నిగ్రహించటం చాలాకష్టం అనేమాటలో ఏమాత్రం సంశయం లేదు. అయినప్పటికినీ అభ్యాసం, వైరాగ్యం అనే 2 ఆయుధాలతో దాన్ని వశపరచుకోవాలి అన్నాడు. అంత కష్టమైన మనో నిగ్రహాన్ని సాధించటానికి ఇక్కడొక ఉపాయాన్ని చెప్పారు. అదే 'వాయురోధనాత్' అంటే ప్రాణ వాయువును నిరోధించే పద్ధతి. దీనినే ప్రాణాయామము అనికూడా అంటారు. ఇందులో శ్వాసను అదుపులో

వుంచటాన్ని అభ్యాసం చేస్తారు.

ప్రాణాయామం అనేది పూరకం, కుంభకం, రేచకం అనే 3 క్రియలతో కూడి ఉంటుంది. మనం ప్రతిక్షణమూ గాలి పీలుస్తూ వదులుతూనే ఉంటాం. అయితే దీనిని ఒక క్రమపద్ధతిలో పాటించినప్పుడు అది మనస్సుని కొంతవరకు నిరోధిస్తుంది.

మనస్సును నిగ్రహించటం ఎందుకింత కష్టం? (సుదుష్కరం?) మనస్సును నిగ్రహించాల్సింది ఎవరు? మనస్సే. అంటే మనస్సు తనను తానే నిగ్రహించుకోవాలి. ఇంతకాలం ఊర కుక్కలా ఎక్కడపడితే అక్కడ తిరిగిన మనస్సు, అనేక జన్మలలో ఇది మంచి చోటు, ఇది చెడ్డచోటు, ఇక్కడికి వెళ్ళొచ్చు, ఇక్కడికి వెళ్ళరాదు అనే విచక్షణా జ్ఞానం లేకుండా తిరిగిన మనస్సు, తిరగటానికి మరగిన మనస్సు తనను తాను కష్టపెట్టుకుంటుందా? కట్టడి చేసుకుంటుందా? నాకు నేను కష్ట పెట్టుకుంటానా ఎప్పుడైనా? అవసరమైతే ఇతరులను కష్టపెడతాను. అంతే. ఎవరి నన్నా తన్నమంటే సంతోషంతో తంతావు. నిన్ను నీవు తన్నుకోమంటే ఏ పిచ్చివాడైనా తన్నుకుంటాడా? మనస్సూ అంతే.

ఒకసారి మనస్సు తిరగటం ఆరంభిస్తే ఇక ఆగనే ఆగదు. ఒకసారి ఉపన్యాసం ప్రారంభమైన తర్వాత ఇక ఆగే ప్రసక్తే లేదు. అయితే కరెంటు పోయిందనుకోండి. తప్పదు. ఉపన్యాసం ఆగిపోతుంది. ఉపన్యాసం ఆగాలంటే పవర్ కట్ ఉపయోగపడినట్లు, మనస్సు ఆగిపోవాలంటే వాయు నిరోధం ఉపయోగపడుతుంది. ప్రాణాయామం ఉపయోగపడుతుంది. అయితే ఇక్కడ చెప్పిన ప్రాణాయామం పతంజలి మహర్షిచెప్పిన ప్రాణాయామం కాదు. ఎందుకంటే ఆ ప్రాణాయామం ఒక గురువు వద్ద ఉండి ప్రత్యక్షంగా ఆయన పర్యవేక్షణలోసాధన చెయ్యాలి. ఎవరంతట వారుగా చేస్తే అది ప్రమాదకరం - ప్రాణాంతకం. కాని మహర్షి చెప్పిన

విధానం ప్రత్యేకమైనది. దీనిని 'ప్రాణేక్షణ' అంటారు. ఎవరైనా దీనిని చేయవచ్చును. దీనికి గురువుతో పనిలేదు. దీనిలో చేయవలసినదంతా ఏమిటంటే మనస్సును అన్ని ఆలోచనల నుండి మరలించి మన ఉచ్ఛ్వాస, నిశ్వాసములను దీక్షతో పరికించటమే. మనస్సుకు ఏమాత్రం కష్టం లేని క్రియ ఇది. మనస్సు రాక్షసి. దానికి పనిలేకపోతే మనల్ని తింటుంది. పోనీ ఆలోచనలతో కూడిన పని ఇస్తే అది మనను ఈ మాయా ప్రపంచంలో త్రిప్పుతుంది. కనుక దీనికి ఒక్కటేపని. రాగద్వేషాలకు ఆస్కారం లేనిపని. అదే శ్వాసను గమనించుట.'ప్రాణేక్షణ'. ఇప్పుడు మనస్సు అన్ని ఆలోచనలు ఆపి ఉచ్ఛ్వాస నిశ్వాసములను గమనిస్తూ ఉంటే,మనస్సు తనను తాను చూసుకున్నట్లే. అలా చూసుకుంటుంటే అది నిశ్చలంగా ఉండక ఏమౌతుంది? ఇక్కడ శ్వాసించేవాడు, శ్వాసను గమనించే వాడు ఒక్కడే. ఇందులోశ్వాస సహజంగా జరిగిపోతుందే గాని ఇలా చెయ్యాలి, అలా చెయ్యాలి అని ప్రత్యేకంగా ఏ మార్పులు చేసే పని లేదు. కనుక ఇది చాలా సులభం. మరియు ప్రయోజనకరం.

యోగశిఖోపనిషత్తులో అత్యంత సులభమైన, అత్యంత ప్రయోజనకరమైన, అద్భుతమైన ప్రాణాయామ ప్రక్రియను చెప్పారు. అదే సో2హం భావనతో చేసే ప్రాణాయామం. మనం ఎలాగూ ప్రతిక్షణం గాలిపీలుస్తూ వదులుతూ ఉంటాం. అయితే ఆ పీల్చటం వదలటం భావనతో చేస్తే అది ప్రాణాయామం అవుతుంది. గాలి పీల్చేటప్పుడు 'సో' అనుకుంటూ, వదిలేటప్పుడు 'హం' అనుకుంటూ చెయ్యటమే. స: అంటే అతడు లేదా ఆ పరమాత్మ అని, అహం అంటే నేను అని. ఇక్కడ ఆ భావాలనే కొంత మార్చి గాలి పీల్చేటప్పుడు పరమాత్మ చైతన్యం నాలోనికి వస్తున్నది అనే భావనతో 'సో' అనుకుంటూ, గాలిని వదిలేటప్పుడు నాలోని మాలిన్యం – అజ్ఞానం బయటకు వదులుతున్నాను అనే భావనతో 'హం' అనుకుంటూ

శ్వాసక్రియను మెల్లగా స్థిరంగా సాగించాలి. ఒక్కసారి సో2హం అనటానికి 4 సెకండ్లు పడుతుంది. అంటే నిముషానికి 15 సార్లు. గంటకు 900 సార్లు, 1 రోజుకు 21,600 సార్లు. నిజంగా మనిషికి శ్వాసలు రోజుకు 21,600 సార్లే జరుగుతాయి. అందుకే తీవ్ర ముముక్షువులు రోజుకు 200 జపమాలలు త్రిప్పుతారు. 200 జపమాలలు అంటే 200 x 108 = 21,600 పూసలు. ఒకొక్క పూసకు ఒకొక్క మంత్రం. అంటే రోజుకు 21,600 మంత్ర జపం అన్నమాట.

ఇలా ఏదైనా ఒక పద్ధతిని అనుసరించి ప్రాణనిరోధనం లేదా ప్రాణాయామం లేదా ప్రాణ వీక్షణం అనేసాధనను సాగిస్తూ ఉంటే కొంతకాలానికి మనస్సు యొక్క పరుగులు ఆగి నిలబడిపోవటానికి అవకాశం ఉంటుంది.

ఈ శ్వాసలను నిరోధించటం వల్ల మనస్సు ఎలా లీనమై పోతుందో మహర్షి ఒక అద్భుతమైన ఉదాహరణ ఇచ్చారు. అదే 'జాలపక్షివత్' అని. ఎగురుతూ, తిరుగుతూ ఉండే పక్షి వలలో పడితే ఇక అది కదలటానికి వీలులేక పట్టుబడి పోతుంది. అలాగే నిరంతరం చలించే మనస్సు ఈ వాయునిరోధనంవల్ల వలలో చిక్కిన పక్షి లాగా కదలక మెదలక పట్టుబడిపోతుంది అని. అయితే ఇక్కడే మరొక విషయాన్ని గమనించాలి. వలయొక్క త్రాడు తెగితేనో లేక వలను తీసేస్తేనో ఏంజరుగుతుంది. పట్టుబడిన పక్షి మళ్ళీ ఎగిరిపోతుంది. స్వేఛ్ఛా జీవి అవుతుంది. అలాగే ప్రాణాయామం చేస్తున్నంత సేపు మనస్సు పట్టుబడిపోతుంది. చేయటం ఆపివేస్తే చాలు మళ్ళీ మనస్సు పక్షిలాగా ఎగిరిపోయి అనేక విషయాల మీద వాలుతుంది. విక్షేపం చెందుతుంది. అంటే ఈప్రాణాయామం అనే ప్రక్రియ తాత్కాలికంగా మనస్సును నిలిపే ప్రక్రియే తప్ప శాశ్వతంగా మనస్సును నిలపలేదు. అయితే దీనివల్ల ఏమిటి ప్రయోజనం? అంటే

మనస్సు బాగా అలజడిగా ఆందోళనగా ఉన్నప్పుడు ప్రయత్నంతో కూర్చొని ఈప్రాణాయామాన్ని సాగిస్తే మనస్సు కొంతవరకు నిరోధింపబడుతుంది. ప్రశాంతత చిక్కుతుంది.ఇలా రోజూ ప్రాణాయామం చేస్తుంటే – చాలాకాలం కొనసాగిస్తే మనస్సులో ప్రశాంతత పెరుగుతూ ఉంటుంది. అలాంటి ప్రశాంతత మళ్ళీమళ్ళీ కావాలని మనస్సు ఆరాటపడుతూ ప్రాణాయామం సహజంగానే జరిగిపోతూ మనస్సు హృదయంలో నిలవటానికి సాధనమవుతుంది. కర్మయోగ, భక్తి యోగాల మాదిరిగానే ఈ రాజయోగం కూడా హృత్స్థలే మన: స్వస్థతకు దారితీస్తుంది.

–అసలుమనస్సుకు శ్వాసకు మధ్యగల సంబంధం ఏమిటో– ఈ శ్లోకంలో

**శ్లో॥ చిత్త వాయవ: చిత్క్రియాయుతా।**
**శాఖయోర్ ద్వయీశక్తి మూలకా॥ –12**

**ప్రతిపదార్థం** :చిత్త వాయవ:= మనస్సు, ప్రాణవాయువు; చిత్‌క్రియాయుతా = జ్ఞానాన్ని గ్రహించే జ్ఞానశక్తి, కర్మలను చేసే క్రియాశక్తి, శాఖయోర్ద్వయీ = రెండుకొమ్మలు, శక్తిమూలకా = శక్తి అనే చెట్టునుండి పుట్టినవి.

**భావం** : ప్రపంచం నుండి జ్ఞానాన్ని గ్రహించే మనస్సు, కర్మలు చేయడానికి కర్మేంద్రియాలకు అధారమైన ప్రాణము, ఈ రెండూ ఒకే జీవశక్తి అనే వృక్షానికి రెండు కొమ్మల వంటివి.

**వ్యాఖ్య** : ప్రాణాయామం వల్ల లేదా ప్రాణేక్షణ వల్ల మనస్సు ఎలా నిగ్రహించబడుతున్నదో ఈ శ్లోకంలో వివరిస్తున్నారు. మనస్సు, ప్రాణం – ఆ రెంటికి మధ్య గల సంబంధం ఏమిటో వివరిస్తున్నారు. జీవునిలో జీవశక్తి (చైతన్యశక్తి) ఒక మహా వృక్షంలా ఉన్నది. ఆ శక్తికి రెండు కొమ్మలు. అందులో ఒకటి జ్ఞానేంద్రియాలతో కూడిన మనస్సు (జ్ఞానశక్తి), రెండవది కర్మేంద్రియాలకు ఆధారంగా ఉన్న ప్రాణము (క్రియా శక్తి).

మనస్సు జ్ఞానేంద్రియాల ద్వారా ప్రపంచంలోని శబ్ద స్పర్శ

రూప రస గంధాలనే 5 విషయాలను తెలుసుకుంటున్నది. కనుక అది జ్ఞానశక్తి. అలాగే తెలుసుకున్న విషయాల ఆధారంగా కర్మేంద్రియాలు కర్మలు చేస్తాయి. ఈకర్మేంద్రియాలకు ఆధారం ప్రాణవాయువే. ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన అనే 5 పేర్లతో ప్రాణం పనిచేస్తుంది. ఇది క్రియాశక్తి. జ్ఞానాన్ని పొందాలంటే మనస్సు ఉండాలి. కర్మలు చేయాలంటే కర్మేంద్రియాలుండాలి. ఆ కర్మేంద్రియాలకు ఆధారంగా ప్రాణం ఉండాలి. ఆ మనస్సు, ఈ ప్రాణం రెండూ చెట్టు కొమ్మలైతే వాటికాధారమైన చెట్టే జీవశక్తి – ఆత్మచైతన్యం. అంటే ఆత్మచైతన్యం వల్ల జ్ఞానేంద్రియాలు ప్రపంచ విషయాలను గ్రహిస్తాయి. వాటిని మనస్సుకు అందజేస్తాయి. వాటిని ఆత్మచైతన్యం వల్లనే మనస్సు గ్రహిస్తున్నది. అలాగే ఆత్మచైతన్యం వల్లనే మనలో ప్రాణ వాయువులు సంచరిస్తున్నాయి. ఈ ప్రాణ వాయువుల కారణంగానే అన్ని కర్మేంద్రియాలు పనులు చేయగలుగుతున్నాయి.

అందుకే జ్ఞానాన్ని గ్రహించే మనస్సుకు, కర్మలు చేసే కర్మేంద్రియాలకాధారమైన ప్రాణాలకు రెండింటికీ ఒక్క శక్తియే ఆధారం, మూలం. అదే చైతన్యశక్తి, ఆత్మశక్తి. కనుక అందులో ఒకదాన్ని నిగ్రహిస్తే రెండవది నిగ్రహింపబడుతుంది. ఒక కొమ్మను లాగితే రెండవ కొమ్మ కదులుతుంది.

బూరను గాలితో నింపేసిన తర్వాత ఈ చివర ఒత్తితే ఆ చివర లావవుతుంది. ఆ చివర వత్తితే ఈ చివర లావవుతుంది. ఎందుకంటే అంతటా ఉన్నది ఒక్కటే గాలి. అలాగే ఒకే చైతన్య శక్తి మనస్సులోను, ప్రాణాలలోను ఉండటం వల్ల మనస్సుని నిరోధిస్తే ప్రాణం నిరోధించ బడుతుంది. ప్రాణవాయువును నిరోధిస్తే మనస్సు నిరోధించబడుతుంది.

అయితే ఈ రెండింటిలో దేనిని నిరోధించటం కష్టం? ఏది తేలిక? మనస్సును నిరోధించటం ఎంత కష్టమో క్రితం శ్లోకం

సందర్భంగా చెప్పుకున్నాం. 'వాయోరివ సుదుష్కరం' అని గీతలో చెప్పినట్లు మనస్సును నిలబెట్టటం చాలా కష్టం. (సుదుష్కరం). అందువల్ల ప్రాణ వాయువును నిరోధించటమే చేయదగింది. అందుకే ప్రాణాయామం ద్వారా మనస్సును నిరోధించాలని చెప్పటం. మనస్సు, ప్రాణం రెండూ ఒకే శక్తికి సంబంధించినవి గనుక ఆ రెండూ పరస్పరం ఒకదానిపై ఒకటి ఆధారపడి ఉన్నాయి.

మనస్సుకూ, ప్రాణవాయువుకు (శ్వాసకు) గల ఈ పరస్పర సంబంధం మనకు అనుభవంలో ఉన్నదే. మన మనస్సు ప్రశాంతంగా మనకిష్టమైన సంగీతాన్నో, మనకిష్టమైన విషయాలనో వినేటప్పుడు శ్వాస నెమ్మదిగా, నిశ్శబ్దంగా జరిగిపోతుంది. అలాగాక ఆందోళనకరమైన విషయాలను విన్నప్పుడు, ఏ పిచ్చికుక్కో మన వెంటబడినప్పుడు భయంతో పరుగెత్తుతుంటేనో, కోపం వచ్చినప్పుడో, పోట్లాడేటప్పుడో, అకస్మాత్తుగా దుర్వార్త విన్నప్పుడో శ్వాస చాలా ఎక్కువగాను, శబ్దంతోను జరిగిపోతుంది. అందుకే ఏమిటిరా అలా ఎగశ్వాస, దిగశ్వాస? అంటాం. ఈ అనుభవాలు చాలు శ్వాసకు మనస్సుకు సంబంధం గురించి తెలుసుకోవడానికి. అందువల్లనే ప్రాణాయామం వల్ల లేదా రమణ మహర్షి అభిప్రాయం ప్రకారం శ్వాసను వీక్షించటంవల్ల మనస్సు పూర్తిగా కాకపోయినా కొంతవరకు నిగ్రహించబడుతున్నది.

నిజంగా మన ఇంద్రియాలకు, మనస్సుకు, ప్రాణాలకు అన్నింటికి ఆధారం ఒకే ఒక ఆత్మశక్తి. ఆ శక్తియే దివ్యశక్తి. అది అందరిలోనూ సమానంగానే ఉన్నది. అయినా మహాత్ములు ఆ శక్తిని తమలో నిక్షిప్తం చేసుకొని శక్తిమంతులవుతున్నారు. మనం ఆశక్తిని దుర్వినియోగం చేసుకొని నిర్వీర్యులమవుతున్నాం. దు:ఖాల పాలౌతున్నాం. ఎందువల్ల?

మనం ఎప్పుడూ ప్రపంచంలోకి తొంగిచూడటం, అందులో

ఏఏ విషయాలు, ఏఏ భోగాలు ఉన్నాయో మనస్సు ద్వారా గ్రహించటం అనేపని ఒకటి. తెలుసుకున్న ఆయా విషయాలకు అనుగుణంగా కర్మలు చేసి సుఖభోగాలు అనుభవించాలనే తహతహ మరొకటి. ఇలా ప్రపంచాన్ని తెలుసుకొనే మనస్సు కోసం, భోగాల కొరకు కర్మలు చేసే కర్మేంద్రియాలకు ఆధారమైన ప్రాణం కోసం – ఈ రెండింటి కోసం మన జీవశక్తిని, చైతన్యశక్తిని ఖర్చుపెట్టేసి నిర్వీర్యుల మౌతున్నాం. మహాత్ములు వాటిని పట్టించుకోకుండా శక్తివంతులుగానే ఉంటున్నారు.

ఒకసారి భోజ మహారాజు దగ్గరకు ఒక పేద బ్రాహ్మణుడు వచ్చాడు ఏదో సంభావన దొరక్క పోతుందా? అని. ఇలా వచ్చినవాడు రాజు గారి వద్ద బాగా సంభావన కొట్టేయాలంటే కాస్త పాండిత్య ప్రదర్శనో, కవిత్వం చెప్పటమో, రాజును పొగడటమో – ఏదో చేయాలి. మహారాజును సంతోషపరిస్తే అతడి  పంట పండినట్లే. ఈ బ్రాహ్మణుని చూడగానే రాజు, స్వామీ! తమరి పేరేమి? ఎక్కణ్ణుంచి వస్తున్నారు? అన్నాడు. దానికా బ్రాహ్మణుడు తన పేరు చెప్పి, నేను కైలాసం నుండి వస్తున్నాను అన్నాడు. సభాసదులంతా ఆశ్చర్యపోతున్నారు. రాజుగారు అడిగారు 'అక్కడ పరమశివుడు ఎలా ఉన్నాడు? క్షేమమా?' అని. బ్రా: పరమశివుడా? ఇంకెక్కడ పరమశివుడు ప్చ్! పోయాడు. ఇప్పుడు కైలాసంలో శివుడులేడు అన్నాడు. మహారాజుకు నోటమాట రాలేదు. ఆ! అన్నాడు. దానికా బ్రాహ్మణుడు, అవును మహారాజా! శివుడు తనలో సగభాగాన్ని పార్వతికిచ్చి అర్ధనారీశ్వరుడయ్యాడు గదా! మిగతా సగం శ్రీహరికిచ్చేశాడు – అన్నాడు. ఇంతలో మహారాజు తేరుకుని సరే ఆయన ప్రాపర్టీస్, ఆస్థిపాస్తులు ఎవరికిచ్చాడు? అని అడిగాడు. 'ఏముంది మహారాజా! నెత్తిమీది గంగను హిమాలయాలకు పంపించాడు. చంద్రుణ్ణి అంతరిక్షంలోకి పంపాడు. పాములను నాగలోకానికి పంపేశాడు. అన్నీ ఇచ్చేసిన తర్వాత కూడా ఆయన

బోళా శంకరుడుగదా! అడిగినవారికి లేదు అనకుండా ఏదడిగితే అది ఇచ్చే ఔదార్యం గలవాడు గదా! ఆ ఔదార్యాన్ని తమరికి ఇచ్చేశాడు అన్నాడు. పడిపోయాడు మహారాజు. ఆ వెంటనే మహారాజా! భిక్షాపాత్ర ఒకటి వున్నది గదా! ఆ సమయంలో అక్కడే ఉన్న నాకిచ్చేశాడు అన్నాడు. అంతే. సభాసదులంతా ఆశ్చర్యంలో తలమునకలయ్యారు. ఆ బ్రాహ్మణుని వాక్చాతుర్యానికి మహారాజు ఆనందాశ్చర్యాలలో తేలియాడాడు.

పరమశివుడు ఏమేమి ఇచ్చాడో, ఏంచేశాడో కాని మన పరిస్థితి మాత్రం అంతే. మన సగం శక్తిని ప్రపంచం మీదకు వదిలి ఖర్చు చేసుకుంటున్నాం. మిగతా సగం కర్మలుచేసి ఖర్చు చేసుకుంటున్నాం.

మనం శక్తి సమన్వితులం కావాలంటే ప్రాపంచిక విషయాలవైపుకు, భోగాల వైపుకు పరుగులు తీయకుండా మనస్సును నిరోధించాలి. అదే సమయంలో నిరంతరం కర్మరంగంలో దిగి శక్తిని వృధా చేసుకోకుండా ప్రశాంతంగా ధ్యానం, ఆత్మచింతనం మొదలైన సాధనలలో నిలవాలి.

మనస్సును నిరోధించడానికి, హృదయస్థానంలో దానికి స్వస్థత కలిగించడానికి భగవాన్ రమణ మహర్షి 'ప్రాణ వీక్షణ' మనే ప్రక్రియను మనకందించారు. ఇందులో కేవలం శ్వాసను గమనించటం మాత్రమే చేయాలి. దానితో ఆలోచనలన్నీ ఆగిపోతాయి. ఇలా ప్రాణ వీక్షణం చేసినంత సేపు మనస్సు నిగ్రహించబడుతుంది. ఆలోచనలు లేకుండా మనస్సుండ లేదు. కనుక ఒకే ఒక్క ఆలోచనను ఇచ్చి మనస్సును నిలబెట్టడం లేదా మనస్సు లయం చేయటం అనే ఉపాయాన్ని ఈ ప్రక్రియ ద్వారా మహర్షి మనకు అందించారు. అయితే మనస్సుని లయం చేయటమా? మనస్సుని నాశనం చేయటమా? ఏది మనకు అవసరం, శాశ్వత శాంతికి ఏది కావాలి? .....

–మనస్సును లయం చేయటం, నాశనం చేయటం – అనే రెండురకాల నిరోధాలున్నాయి. మనకు ఏది అవసరం?

**శ్లో॥ లయవినాశనే ఉభయరోధనే।**
**లయగతం పున: భవతినోమృతం॥ –13**

**ప్రతిపదార్ధం** : లయ వినాశనే = లయము, వినాశనము అని, ఉభయ రోధనే = రెండు విధాలైన మనో నిరోధాలున్నాయి., లయ గతం = లయించి పోయిన మనస్సు, పునర్ భవతి = మరల పుడుతుంది (వస్తుంది), మృతం న = మరణించినది తిరిగిరాదు.

**భావం** : మనో నిరోధంలో రెండు ప్రక్రియలున్నాయి. అవి 1) మనోలయం, 2) మనో నాశనం, లయించిన మనస్సు తిరిగి వస్తుంది. నశించిన మనస్సు తిరిగి రానేరాదు.

**వ్యాఖ్య** : ఎప్పుడూ ప్రపంచలోకి పరుగులు తీస్తూ, విషయాల గురించి, వస్తువుల గురించి, భోగాల గురించి ఆలోచించే మనస్సు దు:ఖాలను, అలజడులను తెచ్చిపెడుతుంది. ప్రశాంతతను చెడగొడుతుంది. ఆత్మ జ్ఞానాన్ని పొందటానికి, ఆధ్యాత్మిక సాధనలు చేయటానికి ముఖ్యంగా ధ్యానానికి ఆటకం కలిగిస్తుంది.కనుక ఈ మనస్సు యొక్క పరుగులు నిరోధించడానికి యోగ మార్గంలో వాయురోధనం – ప్రాణాయామం చెప్పబడింది. అయితే ఈ మనో నిరోధంలో – మనస్సును కట్టడి చేయటంలో రెండు రకాలున్నాయి. 1) తాత్కాలికంగా కట్టడి చేసే లయం, 2) శాశ్వతంగా కట్టడి చేసే వినాశనం. లయమైన మనస్సు తిరిగి లేస్తుంది.నాశనమైన మనస్సు ఇక తిరిగి లేచే వీలు లేదు. ప్రాణాయామం వల్ల మనస్సు వలలో చిక్కిన పక్షిలాగా లయమైపోతుంది. కాని వల తొలగగానే ఎగిరిపోయే పక్షి లాగా ప్రాణాయామం ఆపగానే మనస్సు తిరిగి లేస్తుంది.

మనస్సే సమస్త దు:ఖాలకు కారణం. ఎందుకంటే మనస్సే

ఈ ప్రపంచాన్ని సృష్టించుకొని, అందులో తిరిగి సుఖాలు పొందుదామని కృషి చేసి దు:ఖాలను, అశాంతిని కొని తెచ్చుకుంటుంది. ఇది మనకు స్వప్నావస్థలో అనుభవమే. కానీ సుషుప్తిలో మనస్సు లయించిపోతుంది. అక్కడ ప్రపంచమూ లేదు, అనుభవాలూలేవు. ఈ దే.మ.బు.లు లేవు. హాయి మాత్రం ఉంటుంది. ఏ దు:ఖాలు ఉండవు. మళ్ళీ మేలుకోగానే మనస్సు, దానితో ప్రపంచం, దానితో దు:ఖాలు మళ్ళీ వచ్చేస్తాయి. అంటే మనస్సు లయించినంతకాలం దు:ఖాలు లేవు. మనస్సు రావటంతోనే దు:ఖాలు వస్తున్నాయి. సుషుప్తిలో ఈ మనస్సు ఏమైపోతున్నది? అన్ని అనుభవాలతో కూడిన ప్రపంచాన్ని తన పొట్టలో పెట్టుకొని ఏకైక చైతన్యంలో లయమైపోతున్నది. తిరిగి నిద్ర లేవటంతో పొట్టలోని ప్రపంచంతో సహా తిరిగి లేస్తున్నది. దు:ఖాలను తెస్తున్నది. మనకు దీనివల్ల ఏం ప్రయోజనం? గాఢ నిద్రలో ఉన్నంత కాలం హాయి, ఆనందం. మళ్లీ నిద్రలేవగానే మామూలే. కనుక మళ్ళీ లేవకుండా మనస్సు నశించిపోతే ఇక ఈ ప్రపంచం, దు:ఖాలు ఏవీ ఉండవు గదా! కనుక శాశ్వతంగా మన దు:ఖాలకు ఫుల్‌స్టాప్ పెట్టి అనంతమైన, అఖండమైన ఆనందాన్ని పొందాలంటే ఈ మనస్సు నాశనం కావాల్సిందే. మనస్సు నాశనము అంటే చాలామందికి భయం వేస్తుంది. మనస్సు నాశనమంటే మరేంకాదు. మనస్సులో నున్న అజ్ఞానం నాశనం కావటమే. మనస్సులో ఉన్నదంతా అజ్ఞానమే. బాహ్య ప్రపంచం ఒకటి ఉన్నదని, అందులో సుఖాన్ని, ఆనందాన్ని కలిగించే ఎన్నో విషయాలున్నాయని, వాటిని సంపాదిచుకొని అనుభవిస్తే సుఖం, లేకపోతే దు:ఖం అని చేసే భావనయే అజ్ఞానం. ఈ భావనలన్నీ తొలగి అసలు ప్రపంచమే లేదని, మిధ్యయని, ఉన్నదంతా ఒకే ఒక ఆనంద స్వరూప చైతన్యమని, అది నేనేనని గ్రహిస్తే అజ్ఞానం తొలగినట్లే. అంటే మనస్సు నశించినట్లే. మనో నాశనం అంటే తన నిజ స్వరూపాన్ని గురించిన

అజ్ఞానాన్ని పూర్తిగా నాశనం చేయటమే తప్ప మనస్సును నాశనం చేయటం, కాల్చి వేయటం, బూడిద చేయటం కాదు.

మనస్సులయమైనప్పుడు అజ్ఞానం తొలగిపోతుంది. మనస్సు తిరిగి లేవగానే అజ్ఞానం కూడా తిరిగి వస్తుంది. అదే మనో నాశనమైతే అజ్ఞానం పూర్తిగా నశించిపోతుంది. ఇక తిరిగి తలెత్తే ప్రశ్నేరాదు. ఆ తర్వాత అంటే మనో నాశం జరిగిన తర్వాత – అజ్ఞానం పూర్తిగా నశించిపోయిన తర్వాత జరిగే వ్యవహారములన్నీ లౌకిక దృష్టిలో, ఇతరుల దృష్టిలో జరుగుతున్నట్లు కనిపిస్తాయే గాని జ్ఞానిని ఆ వ్యవహారాలేవీ బాధించవు. ఇక్కడ జరిగే వేటి వల్ల జ్ఞాని దు:ఖపడడు. ఆందోళన చెందడు. సంసార చక్రంలో ఇరుక్కోడు.

సాధనకాలంలో (ప్రాణాయామం చేసినంత సేపు) మాత్రం లయించి సాధన ముగియగానే తిరిగి లేచే మనస్సు 'కుక్కతోక' లాంటిది. కుక్కతోకకు రాయిని గట్టినప్పుడు అది తిన్నగా ఉన్నట్లుంటుంది. ఆ రాయి జారిపోగానే మరల ఎప్పటి మాదిరిగానే వంకరగా ఉంటుంది. అలా గాక జ్ఞాననిష్ఠ ద్వారా పొందిన మనో నాశనం తిరిగి లేచేది కాదు. నిద్ర పోయిన వాడు మళ్ళీ లేస్తాడు.కాని చనిపోయిన వాడు తిరిగి లేవలేడు గదా! అలాగే తిరిగి లేవకుండా మనస్సు నశించటాన్ని 'పొట్లకాయ'తో పోల్చారు. పొట్లకాయకు రాయి కట్టినప్పుడు వంకర లేకుండా తిన్నగా పెరుగుతుంది. అది బాగా పొడవైన తర్వాత ఆ రాయిని తొలగించినప్పటికీ అది వంకర లేకుండా తిన్నగా అలాగే ఉంటుందే తప్ప ఏ మార్పూ ఉండదు.

మహాయోగి వేమన ఇదే విషయాన్ని తన శతక పద్యాలలో ఒక పద్యం ద్వారా ఇలా తెలియజేశాడు.

ఆ.వె.॥పొట్లకాయ రాయి పొదిగి త్రాటన గట్ట
వీలదోడ వంకలేక పెరుగు
కుక్కతోక గట్ట చక్కగా వచ్చునా?
విశ్వదాభిరామ వినురవేమ.

మనస్సు లయమైనది తిరిగి ఎందుకు లేస్తున్నది? మనస్సు అణగినప్పటికి మూల వృత్తియైన అహంకారం అలాగే ఉన్నది. అహంకారం ఉన్నంతవరకు సాధన చేసినంతసేపు సమాధి, ఇతర సమయాలలో మనో వ్యాపారం మామూలుగానే జరిగిపోతుంది. అలాగాక మనస్సు నశిస్తే అహంకారం నశిస్తుంది. అజ్ఞానం నశిస్తుంది. దానితో అతడు నిత్య సమాధిస్థుడుగానే ఉంటాడు. ఎల్లప్పుడు ఆత్మ నిష్టలో ఉండటం వల్ల మనోవ్యాపారాలు జరుగుతున్నప్పటికీ తానుమాత్రం ఆత్మగానే ఉండిపోతాడు.

కనుక మనకు కావల్సింది మనోలయం కాదు, మనో నాశనమే. మనోలయం అనేది ప్రాణ బంధనం వల్ల, ప్రాణవీక్షణం వల్ల సాధించగలమని ఇంతకుముందే తెలుసుకున్నాం. మరి మనో నాశనం అనేది ఎలా సాధించగలం? తిరిగి లేవకుండా మనస్సును అంతం చేసే ఆ సాధన ఏదో తర్వాత శ్లోకంలో చెప్పబోతున్నారు.

–మనస్సు తిరిగి లేవకుండా మనోనాశనం సాధించాలంటే ఏం చేయాలి?

**శ్లో॥ ప్రాణబంధనాత్ లీనమానసం।**
**ఏకచింతనాత్ నాశమేత్యద:॥ –14**

**ప్రతిపదార్థం** :ప్రాణ బంధనాత్ = ప్రాణాయామం (వాయు రోధనం) వల్ల, లీన మానసం = లయమైన మనస్సు (శాంతించిన మనస్సు), ఏకచింతనాత్ = ఏకవస్తు (పరమాత్మ) చింతనవల్ల, నాశం ఇతి = నాశనము చెందుతుంది.

**భావం** : వాయు రోధనం లేదా ప్రాణ బంధనం వల్ల లయమైన మనస్సు

ఏకమైన సద్వస్తు చింతనం లేదా ఆత్మచింతనం చేయటం వల్ల నశించి పోతుంది.

**వ్యాఖ్య** : ప్రారంభంలో మనస్సు ప్రపంచంలోని అనేక వస్తువులను, విషయాలను గురించి తెలుసుకోవటం వల్ల, వాటిపైన ఆలోచనలు సాగిస్తుంది. ఆ కారణంగా మనస్సు పరుగులు తీస్తుంది. కోరికలతో, ఆశలతో, అలజడులతో, ఆందోళనలతో, ఉద్రేకాలతో మనస్సు అశాంతి పాలౌతుంది. అట్టి మనస్సును సులభంగా కట్టి పడెయ్యటానికి ప్రాణాయామం లేదా ప్రాణ వీక్షణం లేదా సో2హం అని శ్వాసతో శృతి కలిపి భావన చేయటం చక్కగా ఉపయోగపడుతుంది. ఇలా మనస్సు శాంతించిన తర్వాత ఏకవస్తు చింతనం చేస్తే మనో నాశననం. ఏక వస్తువు అంటే ప్రపంచంలో కనిపించే అనేక వస్తువులలో ఏదో ఒక వస్తువును చింతించటం కాదు. ఏకము, అద్వయము అయిన ఆత్మయొక్క చింతనమే. ఏక వస్తువుఅంటే ఆత్మయేనని ఎలా భావించాలి? ఆత్మయే ఏకవస్తువు.

ప్రపంచంలో అనేక వస్తువులున్నాయి. బల్ల, కుర్చీ, పుస్తకం, కలం, ఇల్లు, నగలు, ఆకాశం, కొండలు, నదులు.. ఇలా ఎన్నో. ఆ వస్తువులను చూడటానికి, వాటి గురించి తెలుసుకోవటానికి మన వద్ద ఇంద్రియాలున్నాయి. మనోబుద్ధులున్నాయి. అంటే అనేక వస్తువులు ప్రపంచంలో ఉన్నాయి. వాటిని తెలుసుకొనే అనేక ఇంద్రియాలున్నాయి. మనస్సులో అనేక ఆలోచనలున్నాయి. బుద్ధిలో అనేక కోరికలున్నాయి. అయితే వీటన్నింటిని తెలుసుకొనేవాడు, మార్పు చెందేవాటన్నింటి యొక్క మార్పులను తెలుసుకుంటూ ఉండేవాడు మాత్రం ఒక్కడే. తానెప్పుడూ మార్పు చెందకుండా ఉంటాడు. అతడే ఆత్మ. అతడెప్పుడూ ఒక్కడే. అందుకే ఆత్మ ఏక వస్తువు.

లడ్డు కొద్దిగా నోట్లో వేసుకొని చూచావు. అది తీపిగా

వుంది, చింతకాయ కొరికావు. పుల్లగా ఉంది, వేపకాయ రుచిచూచావు. చేదు, మిరపకాయ కొరికావు. కారంగా ఉంది, వీటన్నింటిని తెలుసుకొనే నీలో ఏం ఉంది? తీపి ఉందా? కారం ఉందా? పులుపు ఉందా? ఇవేవీ లేవు. కాని ఆయా వస్తువులలో ఉన్న రుచి ఏదో తెలుసుకొనే తెలివి ఉంది. అంటే తెలియబడే తీపి, పులుపు, కారం, చేదు అవేవి నేను కాదు. వాటిని తెలుసుకొనే తెలివిని నేను. అంటే ప్రజ్ఞను. జ్ఞానాన్ని. ఈ జ్ఞానం ఏకం. ఎప్పుడూ మారేది కాదు. రెండు రకాల జ్ఞానాలు లేవు. తీపిని తెలుసుకొనే జ్ఞానం ఒకటి, కారాన్ని తెలుసుకొనే జ్ఞానం ఒకటి – ఇలా లేదు. వున్నదంతా ఒక్కటే జ్ఞానం. ఆ జ్ఞానమే ఆత్మ. అదే నేను. సో2హం. దాన్నే చింతన చేయాల్సింది. ఈ ఏక వస్తుచింతనం వల్లనే మనో నాశం జరుగుతుంది.

ఎలా చేయగలం ఈ ఏక వస్తు చింతనం ? నీకన్న వేరుగా ఉన్న ఈ ప్రపంచాన్ని గురించిగాని, వ్యక్తుల గురించి గాని, పక్షుల గురించి గాని, శరీరాన్ని గురించి గాని, మనోబుద్ధుల గురించి గాని – ఇలా దేన్ని గురించైనా సరే చక్కగా చింతన చేయగలం, చేస్తున్నాం కూడా. అయితే ఆత్మనైన నన్ను నేను చింతన చేయాలంటేనే కుదరటం లేదు. ఆత్మ చింతనం అనేది చాలకష్ట సాధ్యంగా ఉంది. కనుక దీనిని నీకు నీవుగా తెలుసుకోవటం కుదరదు. నీవు మనోబుద్ధుల స్థాయిలో ఉన్నావు గనుక వాటికి అందినంత వరకే చింతన చేయటం కుదురుతున్నది. ఆ స్థాయిని దాటి పోవాలంటే ఏం చేయాలి?

"యత్ స్వతహా అప్రాప్యం తత్ శాస్త్రేన బోధితవ్యం" అని శంకర భాష్యం. ఏది నీకు స్వతహాగా లభించదో దానిని శాస్త్ర బోధ ద్వారానే గ్రహించాలి. శాస్త్రాన్ని అందించేవాడు గురువు. గురువు అంటే జ్ఞానం తానైనవాడు. వెలుగుతున్న దీపంలాంటి వాడు. వెలుగుతున్న దీపం ఎన్నిదీపాలనైనా వెలిగించగలదు. అలాగే గురువులోని జ్ఞానం శిష్యుని బుద్ధిని

ప్రచోదనం చేస్తుంది. గురుబోధను గ్రహించటం వల్ల శిష్యుడు దేదీప్యమానంగా జ్ఞానంతో ప్రకాశిస్తాడు. అలా గురుబోధ ద్వారా జ్ఞానాన్ని పొందినవారే ఏకవస్తు చింతనం చేయగలుగుతారు. అయితే ఈ గురుబోధను గ్రహించాలంటే మానసిక ప్రశాంతత కావాలి. బుద్ధి సూక్ష్మత కావాలి. ఏకాగ్రత కావాలి. ఇట్టి మానసిక ప్రశాంతత మనోలయం జరిగినప్పుడే కలుగుతుంది. ఈ మనోలయం అనేది ప్రాణాయామం ద్వారా లేదా వాయునిరోధనం ద్వారా సాధించవచ్చు. అంటే వాయు నిరోధనం లేదా ప్రాణాయామం ద్వారా మనోలయం. మనోలయం వల్ల మానసిక ప్రశాంతత. ప్రశాంతంగా ఉన్నప్పుడే గురుబోధను గ్రహించగలం. గురుబోధవల్లనే జ్ఞానం – ఏకవస్తువు గురించిన జ్ఞానం. అట్టి జ్ఞానం కలిగితేనే ఏకవస్తు చింతనం. ఆ ఏక వస్తు చింతనం వల్ల మనోనాశనం. ఇదీ వరుస.

ఇలా మనోనాశం సాధిస్తే ఇంతవరకు ఉన్న నానాత్వం అదృశ్యం. ఇంతవరకు మనస్సుతో చూచావు గనుక అనేకత్వం ఉంది. ఇప్పుడు మనస్సు నాశనమైనది గనుక అనేకత్వానికి ఆస్కారం లేదు. అంతటా ఆత్మదర్శనమే. ఏకత్వ దర్శనమే. ఆంతర్యంలో ఏందర్శించావో, అదే బాహ్యంలోను ఉన్నది.

'అంతర్ బహిశ్చ తత్ సర్వం వ్యాప్యనారాయణ స్థిత:' అని మంత్రపుష్పం చదువుతాం. కాని అలా లోపల వెలుపల అంతటా వ్యాపించియున్న నారాయణుని – పరమాత్మను దర్శించటం అంటే ఎలాగో తెలియటం లేదు. ఈ సర్వత్రా పరమాత్మ దర్శనంలోనే ద్వైతులకు, అద్వైతులకు తేడా ఉంది. ఇద్దరూ పరమాత్మ సర్వవ్యాపకుడని నమ్మేవారే. కాని చూచే విషయంలోనే కొంచెం భేదం.

సర్వం విష్ణుమయం అంటూ అంతటా పరమాత్మే ఉన్నాడు.

నేను మాత్రం ఆయన కన్నా వేరుగా ఉన్నాను అని భావిస్తాడు ద్వైత భావంలో ఉన్నవాడు. సర్వంఖల్విదం బ్రహ్మ అంటూ అంతటా పరమాత్మే ఉన్నాడు. నేను కూడా అందులోనే ఉన్నాను అని భావిస్తాడు అద్వైత భావనలో వున్నవాడు. అంతటా పరమాత్మే ఉంటే నేను వేరే ఎక్కడ ఉంటాను? నేను వేరే ఉంటే పరమాత్మ అంతటా ఉన్నాడనే మాట ఎలా సరిపోతుంది? ఈ ఆలోచన వస్తే చాలు ద్వైతి అద్వైతిగా మారిపోతాడు.

అయితే ఇలా అంతటా ఏక వస్తువైన పరమాత్మనే దర్శిస్తే నానాత్వం పోతుందా? ప్రపంచం అదృశ్యమై పోతుందా? కొండలు, నదులు, చెట్లు.. అన్నీ పోతాయా? ఇదే పెద్ద సందేహం. నిజంగా ఏకత్వ దర్శనంతో అన్నీ అదృశ్యం కావు. కాకపోతే అన్నింటిలోను ఆత్మనే దర్శిస్తాడు. పంచదార బొమ్మల్లో ఉన్నది పంచదారేనని దర్శిస్తారు పెద్దవారు. కాని ఇది కుక్క, ఇది నక్క అని దర్శిస్తారు పిల్లలు. అలాగే జ్ఞాని నామరూపాల కతీతంగా ఆత్మనే చూస్తాడు.

–అలా మనో నాశనం సాధించిన మహాత్ముని కర్తవ్యం ఏమిటి?

**శ్లో॥ నష్టమానస: ఉత్కృష్టయోగిన:।**
**కృత్యమస్తికిం స్వస్థితింయత:॥ –15**

**ప్రతిపదార్థం** : నష్టమానస: = మనోనాశం సాధించిన, ఉత్కృష్టయోగిన: = మహనీయుడైన యోగి, స్వస్థితింయత:= స్వస్థితిలో నిలిచిపోయిందున, కృత్యం కింఅస్తి = చేయదగిన పని ఇంకేమున్నది?

**భావం** : మనోనాశం సాధించిన మహాత్ముడైన యోగి తన స్థితిలో – ఆత్మలో తాను నిలిచి పోయినందున ఇక అతడికి నిర్వర్తించవలసిన కర్తవ్యం ఏముంటుంది? అంటే ఏమీ ఉండదు, అని భావం.

**వ్యాఖ్య** : మనోనాశనం సాధించినవాడు మహాయోగి. కర్మయోగి, భక్తియోగి, రాజయోగి, ధ్యానయోగి... ఇలా ఎందరినో యెగులుగా పిలుస్తాం. కాని

వీరెవ్వరూ ఉత్కృష్ట యోగులు కాదు. మహాయోగులుకాదు. ఎవరైతే మనస్సును పూర్తిగా నశింపజేసుకొన్నారో వారు ఇక ఆత్మ స్వరూపులే, బ్రహ్మస్వరూపులే గనుక వారే నిజమైన యోగులు.

"ది డెత్ ఆఫ్ ద మైండ్ ఈజ్ ద బర్త్ ఆఫ్ ఏ సేజ్" అని ఇంగ్లీషులో యోగి యొక్క పుట్టుకను చెబుతారు. మనో నాశనం జరిగింది అంటే అతడు మహనీయుడైన యోగి అయినట్లే. అట్టి యోగి బ్రహ్మైక్యాను భవాన్ని స్థిరంగా కలిగి ఉంటాడు. అతడెంత మాత్రమూ వ్యక్తిగా వ్యవహరించడు. అతడికి ఇక్కడ చేయవలసిన కర్మలంటూ ఇంకేమీ వుండవు. నేను అపరిపూర్ణుడను, అసంతృప్తితో ఉన్నవాణ్ణి అనుకున్నప్పుడే ఆనందం కోసం ఏవేవో కోరుకుంటూ పనులు చేస్తాడు. నేను ఆనంద స్వరూపుడను అనుకున్నప్పుడు ఇక అతడికి కావలసిందేమిటి? కోరవలసిందేమిటి? విషయ వస్తువుల ద్వారా ఆనందం పొందగలననే భ్రమ అతడిలో ఏమాత్రం వుండదు. మనకు మనస్సుంది గనుక, అది తెచ్చుకున్న అజ్ఞానం అలాగే ఉంది గనుక అన్నీ మనకే కావాలి. ఒక్కక్షణం కూడా వృధా చేయం. ఎవరెవరు ఏం చేస్తున్నారు? ఎలా సంపాదిస్తున్నారు? మనం ఇంకా ఏం చేయాలి? అనే ఆలోచనలే. రిక్షాలో ఎక్కికూర్చొని మనం పోవాల్సిన చోటును గురించి పట్టించుకోం. ఆ రిక్షావాణ్ణి అడుగుతాం, ఏమోయ్ ఈఊరేనా నీది? ఎంతమంది పిల్లలు? ఇది నీ స్వంత రిక్షా ఏనా? స్వంతం అన్నాడనుకోండి. ఎంత సంపాదిస్తావు రోజుకు? అద్దెది అన్నాడనుకోండి. ఎంత రోజుకు అద్దె? ఎవరిది ఈ రిక్షా? అతడికి మొత్తం ఎన్ని రిక్షాలున్నాయి? రిక్షాలైతే లాభమా? ఆటోలైతే లాభమా?.. ఇలా సాగిపోతాయి ప్రశ్నలు మన గమ్యం చేరేదాకా.

కనుక మనస్సుంటే మనం చెయ్యలేనిది లేదు. మనస్సు నశిస్తే ఇక చేయవలసిందేమి లేదు. అట్టివారు ఎక్కడ తిరుగుతున్నా, ఏం

చేస్తున్నా అతడు చేస్తున్నట్లు భావించడు. అతడికా పనులతో సంబంధం లేదు. చెయ్యాల్సిన అవసరమూ లేదు, తప్పించుకోవాల్సిన పనీ లేదు. అతడెప్పుడూ తత్త్వంలో నిలిచి ఉంటాడు, ఆత్మలో నిలిచి ఉంటాడు. కనుకనే కృత్యమస్తి కిం? అని మహర్షి ప్రశ్న వేస్తున్నాడు. అతడికి చేయదగిన పని ఏమున్నది? అని. తత్రకో మోహ:క: శోక: ఏకత్వమనుపశ్యత: అని ఈశావాస్యం చెబుతున్నది. అంతటా ఏకత్వాన్ని దర్శించేవానికి మోహమెక్కడ? శోకమెక్కడ? అతడు ఎల్లప్పుడు తనలోనే ఆనందాన్ని పొందుతూ ఉంటాడు. ఆ ఆనందం ఏ వస్తువు ద్వారా వచ్చేది కాదు. అలాగే దేనిద్వారా పోయేదీ కాదు. నిత్యానందం. అట్టి ఆనందాన్ని పొందే అతడికి ఈ లోకంలో కర్మలతో పనిలేదు. అలాగని కర్మలు చేయకుండా బిగబట్టుకొని కూర్చొంటాడా? అదేంలేదు. రమణ మహర్షి ఎప్పుడూ వంట విషయాన్ని ఏమరక చూస్తుంటాడు. అక్కడ వంటలో నిమగ్నమైన శిష్యురాండ్రకు వేదాంతాన్ని వండి వడ్డిస్తుంటాడు. కూర గిన్నెపైన మూతపెట్టు. ఆవిరి అణగిపోతుంది. దానితో కూర రుచిగా ఉంటుంది అంటాడు. అంటే మనస్సుకు మూత పెడితే ఆలోచనల ఆవిరి అణిగిపోతుంది. దానితో అహంకారనాశనమై ఆత్మస్థితిలో నిలిచి ఆనందాన్ని పొందుతావు అని బోధ చెయ్యటమే. తనకేదో కావాలని గాని, భాధ్యత అనిగాని ఏమీ చేయడు. నిర్లిప్తంగా, లోక కళ్యాణం కొరకు, ఇతరుల క్షేమం కొరకు అతడి ద్వారా కర్మలు జరుగుతాయి. తాను చేసే నిస్వార్థ కర్మల ద్వారా ప్రపంచాన్ని ప్రేమతో ముంచి వేస్తాడు. ఇట్టి వానినే జీవన్ముక్తుడు అంటారు. అతడే 'కృత్స్న కర్మకృత్' అని గీత చెబుతుంది. అంటే నెరవేర్చ వలసిన కర్తవ్యాల్ని నెరవేర్చిన వాడు. సార్ధకమైన జీవితాన్ని గడిపినవాడు అని. ఎందుకంటే అతడు స్వస్థితిని పొందాడు గనుక. చేరవలసిన గమ్యస్థానాన్ని చేరుకున్నాడు గనుక ఇక అతనికి పనేమీ లేదు.

అతడి జీవితం చరితార్థం కావటమే కాదు, తాను

మెట్టినభూమి అంతా పవిత్రమవుతుంది. తనను కన్నతల్లిదండ్రులు ధన్యులౌతారు. మొత్తం వంశంలో అటు 7 తరముల వారు, ఇటు 7 తరముల వారు – అంటే గతించిపోయిన 7 తరాల వారూ, రాబోయే 7 తరాల వారూ తరిస్తారు. "సర్వవేదాంత సిద్ధాంత ముక్తావళి" అనే గ్రంథంలో ఇలా అన్నారు.

కులం పవిత్రం జననీ కృతార్థా
వసుంధరా పుణ్యవతీచ తేన।
అపార సచ్చిత్సుఖి సాగరే2స్మిన్
లీనం పరే బ్రహ్మణి యస్యచేత:॥

భగవాన్ రమణ మహర్షి ఇట్టి మహాయోగి అనటంలో ఎవ్వరికీ సందేహం ఉండాల్సిన పనే లేదు. అందుకే అట్టి మహాత్ములను సందర్శించినా, వారు పాదం మోపిన, చరించిన స్థలాలను దర్శించినా మనకూ అట్టి ఆనంద స్థితి కలగాలనే భావం ధృఢమవుతుంది. ఎలా పొందాలి అట్టి స్థితిని? ఏం చేయాలిమనం? అసలు ఆత్మ సాక్షాత్కారం అంటే నిజంగా ఏమిటి?

– తత్వాన్ని దర్శించటం అంటే ఏమిటో, ఎలా దర్శించాలో, ఎలా ఉత్కృష్ట యోగివి కావాలో ఈ శ్లోకంలో వివరిస్తున్నారు.

**శ్లో॥ దృశ్యవారితం చిత్త మాత్మన:।**
**చిత్వ దర్శనం తత్వ దర్శనం॥ –16**

**ప్రతిపదార్థం** : చిత్తం = మనస్సు, దృశ్యవారితం = కనపడు విషయముల వెంట పరుగిడకుండ, ఆత్మన: = తనయందే (ఆత్మయందే) నిలిపిన, చిత్వదర్శనం = తన స్వభావం (చిన్మయం) చిత్ అని తెలుస్తుంది.(అదే); తత్వ దర్శనం = పరమార్థమునెరుగుట (స్వస్వరూప దర్శనం) (ఆత్మనిష్ట).

**భావం** : మనస్సును కనిపించే వస్తువుల వెంట పడనీయక, దానిని

ఆత్మయందు (తనయందే) నిలిపి ఆత్మ స్వరూపాన్నే అనుసంధానం చేస్తూ, తాను చిత్ (జ్ఞాన) స్వరూప ఆత్మను అని తెలుసుకున్నట్లైతే అదే తత్త్వ దర్శనం. ఆత్మ సాక్షాత్కారం.

**వ్యాఖ్య** :నిత్య సుఖాన్ని అందించే పరంధామాన్ని – పరబ్రహ్మాన్ని చేర్చటానికి మహర్షి మనకు చెయ్యి అందిస్తున్నారు ఇక్కడినుండి. ఈ శ్లోకం రాజయోగానికి జ్ఞానయోగానికి సంధి శ్లోకం. మనం ఎలా విచారణ చేయాలో ఏం విచారణ చేయాలో తెలియజేసే జ్ఞానయోగానికి పునాది వేస్తున్నాడు మహర్షి.

(ఆత్మసాక్షాత్కారం) తత్వ దర్శనం అంటే తత్వంలో నిలవటమే. బ్రహ్మంలో నిలిచి పోవటమే. ఇదే అపరోక్షాను భూతి. త్రిపుటి అనేది లేని అనుభవం. బ్రహ్మానుభూతి. ఆత్మనిష్ట.

ఇట్టి అనుభూతి, తత్వదర్శనం ఎలా కలుగుతంది? చిత్వ దర్శనం వల్ల. అదెలా కలుగుతుంది? 'దృశ్య వారితం చిత్తం ఆత్మన:' దృశ్యం వెంట పరుగులు తీసే మనస్సును వారించి తనయందే నిల్పాలి. దృశ్యం ఉన్నంత వరకు మనస్సు పరుగులు తీస్తూనే ఉంటుంది. ఏ వస్తువును చూచినా, ఎవరిని చూచినా, ఏదో ఒక ఆలోచన వస్తుంది. దానివెంట ఆలోచలన పరంపర కొనసాగుతుంది. ఇలా ఆలోచనలలో మునిగిపోయిన మనస్సు ఎంత దూరమైనా అలాపోతూనే ఉంటుంది. అట్టి మనస్సును వారించాలి. అలా పోకుండా కట్టడి చేయాలి. ఎలా? ఒక గులాబీపుష్పాన్ని చూచాం. దాని రంగును చూచాం. ఇలాంటి రంగులు కాకుండా ఇంకా నీవేంచూచావో గుర్తు తెచ్చుకుంటావు. మహారాష్ట్రలో ఎలాంటి గులాబీలున్నాయి? పంజాబ్‌లో ఎలాంటివి ఉన్నాయి? పంజాబ్ అంతా అల్లకల్లోలంగా ఉన్నది. తీవ్రవాదులు ఎక్కువ. స్వర్ణదేవాలయాన్ని కూడా ఉపయోగించుకుంటున్నారు. దీని మూలాన్నే ఇందిరాగాంధీ హత్య........

ఇలా గులాబీ నుండి ఇందిర హత్య దాకా......... ఎన్నో ఆలోచనలు. దీనిని మనం ప్రయత్నంతో నిరోధించాలి. ఎలా? గులాబీ బాగుంది. ఈ గులాబీని నేను చూస్తున్నాను. నేను కంటి సాయంతో చూస్తున్నాను. ఇంతకూ అది గులాబీ అని గ్రహించిన నేను ఎవరు? బుద్ధియే. బుద్ధి తెలుసుకుంటున్న విషయం నేను గ్రహించాను. ఈ నేను ఎవరు? బుద్ధిని కూడా చూస్తున్న ఆత్మను. గులాబీలు మారి పోతాయి. మనస్సు – బుద్ధి మారి పోతుంది. కాని వీటిని తెలుసుకునే నేను మారటం లేదు. నేను ఏ మార్పులు లేని ఆత్మను. ఎప్పుడూ బుద్ధికి సాక్షినే. జ్ఞాన స్వరూపాన్నే. చిత్‌స్వరూపాన్నే–ఇలా భావిస్తూ మన ఆలోచనలను దృశ్యవస్తువు పై నుండి మరలించి, వెనుకకు త్రిప్పి–అంతర్ముఖం చేసి, ఏ మార్పులు లేని, చిత్‌స్వరూపమైన ఆత్మపై నిలపాలి. ఇలా ఆలోచనలను నిరంతరం లోపలకు ప్రవహింపజేస్తుంటే మనస్సు విషయ వస్తువులనుండి–దృశ్యం నుండి ఉపసంహరించబడి తన స్వరూపమే అయిన ఆత్మలో – చిత్‌లో నిలిచి పోతుంది. ఇలా చిత్‌లో నిలవడమే చిత్వదర్శనం. ఆ చిత్వదర్శనమే తత్వదర్శనం. మనస్సు ఆలోచనారహితమైతే అక్కడ మిగిలేది ఆత్మయే. శుద్ధజ్ఞానస్వరూపమే. ఆలోచనారహిత చిత్ స్వరూపమే. అదే చిత్వం అవుతుంది. అదే జ్ఞాన నిష్ఠ. ఆత్మ నిష్ఠ. తత్వదర్శనం. తత్వదర్శనం అంటే ఆత్మనిష్ఠ–ఆత్మ గానే ఉండి పోవుట. త్రిపుటి లేని స్థితి. మరి దర్శనం అన్నారేమిటి? దర్శనం అంటే చూచుట. చూచువాడు, చూడబడేది కూడా ఉంటేనే చూచుట జరుగుతుంది గదా! ఇక్కడ దర్శనమంటే అనుభవమే. ప్రత్యక్ష–పరోక్ష అనుభవం కాదు. అపరోక్షానుభవం. ఆత్మ తాను తానుగానే ఉంటుంది– చూచేందుకు దృశ్యం ఉండదు. అదే తత్వదర్శనం– ఆత్మనిష్ఠ. (ప్రత్యక్ష= డైరెక్ట్‌గా చూచుట. పరోక్ష= చూచిన వాడు చెప్పుట. అపరోక్ష= తాను తానుగా కేవలంగా ఉండుట. చూచేందుకేమీ లేక పోవుట) అంటే

దృశ్యం ఉన్నది అంటే దృశ్యాన్ని చూచి ఆలోచనలు చేసే మనస్సు వుంటుంది. దృశ్యమే లేకపోతే ఇక మనస్సే ఉండదు. గాఢనిద్రలో ఏ దృశ్యమూ లేదు. కనుక దృశ్యాన్ని చూడటం అనేదే లేదు. చూచే మనస్సు లేదు. అయితే దృశ్యం లేక పోవటాన్ని, దృశ్యాన్ని చూచే మనస్సు కూడా లేక పోవటాన్ని తెలుసుకోనే ప్రజ్ఞ-జ్ఞానం ఉన్నది. అదే ఆత్మ. అదే నేను. నేనే గనుక లేకపోతే నిద్రలోని అనుభవాన్ని నేనెలా చెప్పగలను? కనుక దృశ్యం లేకపోయినా నేనున్నాను. నేనెలాగూ ఉంటాను గనుకనే రోజూ ధైర్యంగా నిద్రపోతున్నాను. నిద్రలో నేను లేకుండా పోతాను అనుకుంటే అసలు నిద్ర పోతామా? పోనే పోము. కనుకనే ధ్యానం చేస్తూ, హాయిగా ఉపన్యాసం వింటూ కూడా నిద్ర పోగలుగుతున్నాం. మెలుకువ రాగానే నిద్ర అనుభవాన్ని మాత్రం చెప్పగలుగుతున్నాం. ఏమని"అహం కిమపి న జానామి సుఖేన మయా నిద్ర అనుభూయత"-అని. అంటే నాకేమీ తెలియదు కాని హాయిగా నిద్రపోయాను అని. మిమ్మల్నెవరైనా "ఏమండీ! ఇంతకాలం నుంచీ వేదాంతం వింటున్నారు గదా! ఏం నేర్చుకున్నారు?" అని అడిగితే – ఏదో ఒకటి చెప్పాలి గనుక ఈ మాట చెప్పారు. 'అహం కిమపి న జానామి సుఖేన మయా నిద్ర అనుభూయత'- అని. అమ్మో! వీళ్ళకు తెలుగే సరిగ్గా రాదు, సంస్కృతం కూడా వచ్చిందే అని ఆశ్చర్యపోతారు. 'లో గుట్టు పెరుమాళ్ళ కెరుక'.

దృశ్యవారితం చిత్తం- దృశ్యాల వెంటపడి పోయే చిత్తాన్ని ఆపితే అది లోనికి తిరుగుతుంది. తనలోనే నిలుస్తుంది. అలా నిలిస్తే అక్కడ ఇప్పుడున్నది మనస్సు కాదు. మనస్సుకు ఆధారమైన చిత్, మనస్సు చిత్‌గా మారిపోయింది.

మనస్సు కదిలింది ఆత్మనుండే. విలీనమయ్యేదీ ఆత్మలోనే. మనస్సు కదిలి బాహ్యంగా వెళ్తే దు:ఖం. ఆత్మలోనే లీనమైపోతే ఆనందం.

బయటకు వెళ్తే చిత్తం అన్నారు. లోపల నిలిస్తే ఛిత్వం అన్నారు. సమస్య ఎక్కడో పరిష్కారం కూడా అక్కడే.

'కా శీతల వాహిని గంగా?' అని ప్రశ్నిస్తే 'కాశీ తలవాహిని గంగా' అని సమాధానం చెప్పారు. ప్రశ్నా అదే. సమాధానమూ అదే. కాకపోతే ప్రశ్నవేసేటప్పుడు కా వద్ద ఆపాలి. కా అంటే ఎక్కడ? అని. శీతలవాహిని గంగ ఎక్కడ? అని ప్రశ్న. జవాబులో 'కాశీ' వద్ద ఆపాలి. కాశీ తలంలో ప్రవహిస్తున్నది గంగ అని సమాధానం. ఒక స్వామీజీ భగవంతుని మహిమను గురించి అనర్గళంగా ఉపన్యసిస్తున్నాడు. శ్రోతలలో నుండి ఒక యువకుడు లేచి God is no where భగవంతుడెక్కడా లేడు – అని అరిచాడు పెద్దగా. అప్పుడా స్వామీజీ అతణ్ణి పిలిచి ఒక చాక్‌పీస్ ఇచ్చి బోర్డుమీద ఆమాట వ్రాయమన్నాడు. అతడు వ్రాశాడు God is no where అని. అప్పుడా స్వామీజీ 'W' అక్షరాన్ని No ప్రక్కకు జరిపి చదవమన్నాడు. 'God is now here' భగవంతుడు ఇప్పుడు ఇక్కడే వున్నాడు అని అర్థం వచ్చింది. చూచావా! నీవు కూడా భగవంతుడిక్కడే ఉన్నట్లు అంగీకరిస్తున్నావు! అన్నాడట స్వామీజీ

అలాగే ఎక్కడ నుండి బయలుదేరి మనస్సు బాహ్య ప్రపంచంలో తిరుగుతున్నదో–చివరకు ఈ మనస్సు అక్కడికే చేరిహాయిగా–ఆనందంగా ఉండి పోవాలి. ఏ ఆనందధామాన్ని వదలడం వల్ల దు:ఖ సముద్రంలో పడిపోయిందో, తిరిగి అక్కణ్ణించే లేచి ఆనందధామాన్ని చేరుకోవాలి. నది ఎలాగైతే సముద్రం నుండే వచ్చి తిరిగి సముద్రాన్నే చేరుకొని సముద్రాకారంగా మారి శాంతించిందో–అలాగే మనస్సు ఆత్మ నుండే వచ్చి, ప్రపంచంలో తిరిగి తిరిగి చివరకు ఆ ఆత్మనే చేరుకొని శాంతించాలి. అదే తత్వదర్శనం.

ఉపనిషత్తులలో గహనమై, మంత్ర స్వరూపమై,ఏదిగలదో

దానినే మహర్షి ఇక అఖండంగా చెప్పబోతున్నాడు. తత్త్వంలో నిలిచి, తత్త్వాన్ని దప్ప అన్యమును దర్శించని భగవాన్ రమణ మహర్షి, తన అనుభవ సారాన్ని ఇక నుండి జ్ఞానయోగం ద్వారా వినిపించబోతున్నారు. ప్రపంచంలో తిరిగే మనస్సును అరికట్టి ఆత్మలో నిల్పి - ఆత్మగా ఉండే ఉపాయాన్ని చెప్పబోతున్నారు.

## జ్ఞానయోగము

- అసలు మనస్సును అంతం చేయటంఎలా?

**శ్లో॥ మానసంతుకిం మార్గణేకృతే।**
**నైవ మానసం మార్గ ఆర్జవాత్॥ -17**

**ప్రతిపదార్థం** : మానసంతుకిం = (అయితే) ఇక మనస్సంటే ఏమిటి? (అని); మార్గణేకృతే = విచారణ జరిపినట్లైతే, నైవ మానసం = మనస్సు అనేది లేనే లేదు, మార్గ ఆర్జవాత్ = ఇది సూటియైన మార్గం.

**భావం** : ఇప్పుడిక మనస్సంటే ఏమిటి? అని విచారణచేస్తే మనస్సుఅనేది లేనే లేదని మనకు అనుభవమవుతుంది. మనస్సును నశింపజేయడానికి ఇదే సూటియైన మార్గం.

**వ్యాఖ్య** : భగవాన్ రమణ మహర్షి ఇప్పుడు తన అనుభవసారాన్ని అఖండంగా అందించబోతున్నారు. ఇంతవరకు ప్రపంచంలో పరుగులు పెట్టేమనస్సును ఆత్మయందు నిలపటానికి కర్మ, భక్తి, యోగ మార్గాలను విశదం చేశారు. 'హృత్స్థలే మన: స్వస్థతా క్రియా, భక్తి, యోగ, బోధాశ్చ నిశ్చితం' అని10వ శ్లోకంలోనే చెప్పారు. హృదయంలోనే మనస్సును శాంతింపజేయాలంటే క్రియ అంటే కర్మయోగం (1-3 శ్లో), భక్తియోగం (4-10), రాజయోగం (11-16) అనే మార్గాలను వరుసగా చెప్పి ఇప్పుడు 17వ శ్లోకం నుండి అఖండ జ్ఞానాన్ని అందించబోతున్నారు. ఈ శ్లోకంతో జ్ఞానయోగం ప్రారంభం.

సముద్రం నుండి బయలుదేరిన నది ఎక్కడెక్కడో తిరిగి చివరకు సముద్రాన్ని చేరి శాంతించినట్లు, ఆత్మ నుండి లేచిన మనస్సు ఎక్కడెక్కడోతిరిగి, ఏవేవో అనుభవాలు పొంది, చివరకు ఆత్మను చేరి శాంతించాలని, అదే తత్త్వ దర్శనం, ఆత్మ సాక్షాత్కారం అని క్రిందటి శ్లోకంలో చెప్పుకున్నాం. మన సమస్తమైన దు:ఖాలకు, బాధలకు, అలజడులకు, ఆందోళనలకు, ఆశలకు, ఆశయాలకు అన్నింటికీ కారణం ఈమనస్సే. ఈ మనస్సు గనుక అంతమైతే సమస్త దు:ఖాలు తొలగి శాశ్వత ఆనందం, శాంతి లభిస్తాయి. అట్టివారికి ఇక చేయదగిన కృత్యం అంటూ ఏమీ వుండదు అని 15వ శ్లోకంలో చెప్పుకున్నాం. మనస్సు నశించినట్లైతే అతడు మహాయోగియే. అతడు తన స్థితిలో తానుంటాడు. కనుక దృశ్యాల వెంట పరుగులిడే మనస్సును వారించి, దానిని ఆత్మలో నిలిపి ఆత్మనే దర్శించాలి. అదే ఆత్మ సాక్షాత్కారం అని 16వ శ్లోకంలో చెప్పుకున్నాం.

మనస్సును అంతం చేస్తే ఆత్మ సాక్షాత్కారమే, మోక్షమే. అయితే 'ఎలా అంతం చేయాలి ఆ మనస్సును? అనే విషయాన్ని వివరించటానికే ఇప్పుడు జ్ఞానయోగం ప్రారంభమవుతున్నది.

మనస్సంటే ఏమిటి? అని విచారణ ప్రారంభించి, సక్రమంగా ఆ విచారణ జరిపితే ఇక మనస్సనేది లేకుండా పోతుంది అని మహర్షి తన స్వానుభవాన్ని రంగరించి మనకు ఉపదేశం చేస్తున్నారు. పైగా ఇదే సూటియైన మార్గం అంటున్నారు. మనసు అనేది ఒకటి ఉంటే దాని వల్ల దు:ఖాలు, బాధలు, అలజడులు, ఆందోళనలు వస్తున్నాయి. దానిని కనుక అంతం చేస్తే శాంతి, ఆనందము అంటున్నారు. నిజమే, ఇదంతా మనస్సు అనేది ఒకటి ఉంటేనే గదా! అసలు మనస్సే లేదు అని తెలితే – అనుభవ పూర్వకంగా గ్రహిస్తే ఇక అశాంతి ఎక్కడ? శాంతి అనేమాటకు అర్థం ఏమిటి?

చీకటిలో నీవు నడచి వెళుతున్నావు. ఎదురుగా ఒకతాడు పడిఉంది. దానిని చూచి నీవు పాము అనుకున్నావు. అంతే. భయంతో ముచ్చెమటలు పోస్తున్నాయి. దానిని చంపటానికి కర్ర దొరుకుతుందేమోనని చుట్టూ పరికించి చూస్తున్నావు. ఎంతో ఆందోళనతో ఉన్నావు. అయితే అక్కడ అసలు పామే లేదు, ఉన్నది తాడేనని తెలుసుకుంటే భయపడతావా? దానిని చంపటానికి కర్రకోసం పరుగెడతావా? హమ్మయ్య భయం తీరిపోయింది, ప్రశాంతంగా ఉన్నాను – అని భావిస్తావా? ఏదీ లేదు – ఇదంతా అక్కడ పాముఉన్నది అని అనుకోవటంవల్ల వచ్చిన చిక్కే. అలాగే మనస్సు ఉన్నది అని అనుకున్నప్పుడే అన్ని చిక్కులూ, ఆందోళనలు. మనస్సే లేకపోతే ఇక ఏ చిక్కులు లేవు. స్వస్థితిలో హాయిగా, ఆనందంగా ఉంటావు. కనుక సమస్య అనేది ఉంటే పరిష్కారం కావాలి గాని, సమస్యే లేకపోతే పరిష్కారంతో పనిలేదు.

మరి మనస్సు లేనేలేదని ఎట్లా తెలుస్తుంది? "మనస్సంటే ఏమిటి? అది ఎక్కడ ఉంది? ఎలా ఉంటుంది?" అని విచారణ చేస్తే తెలుస్తుంది.

ఏదైనా వస్తువును ఉన్నది అని చెప్పామంటే అది అన్ని కాలాలలోను, అన్ని అవస్థలలోను ఉండాలి. అదే సత్. "కాలత్రయే అపితిష్ఠతి ఇతిసత్" అని శాస్త్ర నిర్వచనం. అసలు ఎప్పుడూ ఏకాలంలోను లేనిది అసత్. ఇంతకూ మనస్సు సత్తా? అసత్తా? రెండూ కాదు. ఎందుకంటే జాగ్రత్, స్వప్నావస్థలలో మనస్సున్నది. సుషుప్తిలో లేనేలేదు. కనుక అది సత్ అనే వీలు లేదు. పోనీ అసత్తా? కాదు ఎందుకంటే జాగ్రత్, స్వప్నావస్థలలో మన అనుభవంలో ఉన్నది గనుక. మరి ఆత్మ? ఆత్మ 3 అవస్థలలోనుఉన్నది గనుక సత్. కుందేటి కొమ్ము ఎప్పుడూ లేనిదే గనుక అసత్. కాని ఈ మనస్సు సత్తూ కాదు, అసత్తూ కాదు. ఇలా సత్తూ,

అసత్తూ కాని వాటినే వేదాంత పరిభాషలో మిధ్య అన్నారు. ఆత్మనిష్ఠలో నిలిచినవారికి మనస్సు లేదు. కాని మనకు అనుభవం అవుతూనే ఉన్నది. ఈ ప్రపంచం కూడా అంతే. ఇప్పుడు మన అనుభవంలో ఈ ప్రపంచం ఉన్నది. కాని ఆత్మానుభూతిని పొందిన వానికి ఈ ప్రపంచం లేదు. కనుక మిధ్య. అలాగే చీకటిలో ఉన్నంతవరకు పాము ఉన్నది. వెలుగు వస్తే పాము లేదు. అక్కడ తాడు మాత్రమే ఎప్పుడూ ఉన్నది. కనుక తాడు సత్. పాముమిధ్య. కల్పితమైన, భ్రమాత్మకమైన పాముకు ఆధారం సత్యమైన తాడే. తాడు లేకపోతే అసలుపాము అనే భ్రమకు ఆస్కారమే లేదు. అలాగే మిధ్యయైన ఈకల్పిత మనస్సుకు ఆధారం ఆత్మయే. ఆత్మజ్ఞానం కలిగితే ఇక కల్పిత మనస్సుకు స్థానం లేదు. అట్టి ఆత్మజ్ఞానం మనకు కలిగించటానికే మహర్షి ఇక్కడ మనస్సు యొక్క విశ్లేషణ ప్రారంభిస్తున్నారు.

అదే 'మానసం తు కిం?' అనే ప్రశ్న. మనస్సంటే ఏమిటి? ఎలా ఉంటుంది? అని విచారణ ప్రారంభించాలంటున్నారు.

రమణ మహర్షి ముఖ్య శిష్యులలో సాధుని శాంతమ్మ అనే వారొకరు. ఆమె చిన్న వయస్సులోనే భర్తను, కుమార్తెను, అల్లుణ్ణి – అందరినీ పోగొట్టుకొని రామేశ్వరంలో ఒక మహాత్ముని ద్వారా మహామంత్రాన్ని ఉపదేశం పొంది రమణమహర్షి పేరు విని ఆయన దర్శనానికి వచ్చింది. అప్పుడు రమణ మహర్షి, ఆయన ప్రక్కన మురుగనార్ కూర్చొని ఉన్నారు. ఆమె మహర్షికి నమస్కరించి "స్వామీ!ఈ మనస్సనేది లేకుండా చేసి నన్ను కటాక్షించండి" అని ప్రాధేయపడింది. అప్పుడు మహర్షి ప్రక్కనే ఉన్న మురుగనార్‌తో" మనస్సంటూ ఒకటి ఉన్నదా? ఉంటే ఎలా, ఏ రూపంలో ఉంటుంది? ఆ మనస్సు గారికి మీసాలు, గడ్డాలు ఉన్నాయా? అడగండి" అన్నారు. మనోనాశనమైన మహాత్ముడి దృష్టి అది.

ఇక్కడ ఆంతర్యం ఏమిటంటే మనస్సంటే ఏమిటి? అని

ప్రశ్న వెయ్యాలి, విచారణ చేయాలి. అలా చేస్తే మనస్సే లేదనితేలిపోతుంది – అనియే. ప్రశ్నవేస్తే చాలు, మనస్సుకు భయం పట్టుకుంటుంది. ఇప్పటి దాకా వీణ్ణి నా ఇష్టం వచ్చినట్లు ఆడించాను. నా వలలో పడిపోయి ఆడమన్నట్టల్లా ఆడాడు. ఇప్పుడు ఆట ఆపి ప్రశ్న వేస్తున్నాడు. నీవెవరు? అంటున్నాడు. ఆమ్మో! ఇక నాఆటలు సాగవు. అని భయపడిపోతుంది. పెట్టే బేడా సర్దుకుంటుంది.

అక్కడక్కడా పెళ్ళిళ్లు జరిగేటప్పుడు ఒక విచిత్ర వ్యక్తి తారసపడతాడు. వరుని తల్లిదండ్రుల వద్దకు వెళతాడు. క్షేమ సమాచారాలు విచారిస్తాడు. ఏమండీ అనుకున్నవి అనుకున్నట్లుగా అన్నీతెచ్చారుగదా! బావమర్ది ఉంగరం సైజు ప్రకారం చేయించారు గదా! మేనమామ బట్టలు మంచివేనా? అతడు ప్యాంటు షర్టు వేసుకుంటాడు. పంచలు కట్టడు. తర్వాత బాగుండదు – అంటాడు.ఇతడు వధువు తరపు బంధువని ఏదో సమాధానం చెప్పి పంపుతారు. ఇక అక్కణ్ణించి అమ్మాయి తరపు బంధువుల వద్ద చేరతాడు. ఏమండీ! గొడుగు తెచ్చారు గదా! కుర్చీ తెచ్చారా? మర్యాదలకు లోటు చెయ్యకండి! అసలే వియ్యంకుడు కరెక్టు మనిషి అంటూ అమ్మాయి తండ్రి వద్దకు చేరి చెవిలో చెబుతాడు. కట్నం డబ్బు పూర్తిగా ఇచ్చేయండి. లేకపోతే గొడవవుతుంది. ఇలా అటూ ఇటూ వాయించేస్తాడు. ఇక వీడి బాధ పడలేక ఆ వియ్యంకులు కలిసినపుడు ఇతడెవరండీ బావగారు! మీకేమవుతాడు? అని అడగ్గానే అదేమిటి అతడు మీ బంధువు కాదా! ఇందాక మా దగ్గరకు వచ్చి అదీ ఇదీ అని గోల చేశాడే – అంటాడు ఆ వియ్యంకుడు. 'ఇతడెవరు'? అని వారు మాట్లాడుకోవటం చూశాడా? ఇక వీడు ఆ పరిసరాలలో ఉండడు. అదృశ్యమైపోతాడు. ఇంతకీ ఇతడెవరు? సుష్టుగా భోజనం దొరుకుతుంది గదా? అని వచ్చినవాడు. అంతే. మనస్సు కూడా ఇంతే. మనం మెదలకుండా ఊరుకుంటున్నంత సేపు, దాని గోల భరిస్తున్నంత సేపు

అది తన ప్రభావాన్ని చూపిస్తూనే ఉంటుంది. 'మానసం తు కిం'? మనస్సంటే ఎవరు? అనే ప్రశ్న వచ్చిందా? అంతే సంగతులు. అదృశ్యమై పోతుంది.

తాడు తాడుగా ఉంటే ఏగోలా లేదు. దానిని పాము అని భ్రమ పడ్డప్పుడే అన్ని బాధలూ. అలాగే ఆత్మ ఆత్మగా ఉంటే ఏ గోలా లేదు. దానిని మనస్సు అని భ్రమ పడ్డప్పుడే అన్ని బాధలూ. కనుక ఆత్మ నుండి లేచిన మనస్సుఅనే రశ్మి మిధ్య యని, భ్రమయని తెలుసుకుంటే చాలు. ఆత్మ స్థితియే. ఆనంద స్థితియే. అలా తెలుసుకొనేందుకే ఈ ప్రశ్న 'మానసం తు కిం?' అని.

ఇలా మనసంటే ఏమిటి? మనసంటే ఏమిటి? అని లక్షసార్లు ప్రశ్నించుకున్నా ప్రయోజనం ఉండదు. లోతుకు దిగి విచారణ జరపాలి. ఎలా? తరువాత శ్లోకంలో

–మనసంటే అసలు ఏమిటో తెలుసుకోకుండా అలా ప్రశ్నించుకుంటూ పోతే ప్రయోజనం లేదు. దానినెప్పటికీ అంతం చేయలేం. కనుకనే వివరణ ఇస్తున్నారు.

**శ్లో॥ వృత్తయస్త్వహం వృత్తి మాశ్రిత:।**
**వృత్తయోమనో విద్ధ్యహం మన:॥ –18**

**ప్రతిపదార్థం** :వృత్తయోమన: = వృత్తులే (ఆలోచనలే) మనస్సు, వృత్తయ:తు = ఈ వృత్తులేమో, అహం వృత్తిం ఆశ్రితా: = అహం వృత్తిని (నేను అనే భావనను) ఆశ్రయించుకొని ఉన్నాయి, (కనుక) అహం మన: విద్ధి = 'నేను' అను భావనయే మనస్సు అని తెలుసుకో.

**భావం** : మనకు నిరంతరం వచ్చే ఆలోచనలే, సంకల్పాలే, వృత్తులే మనస్సు. అయితే ఈ ఆలోచలన్నీ అహం వృత్తిని ఆశ్రయించుకొని ఉన్నాయి. కనుక ఈ అహం వృత్తియే మనస్సు అని తెలుసుకో.

**వ్యాఖ్య** : మనస్సు అనేది ఒక వస్తువు కాదు. కాళ్ళు, చేతులు, తల, మీసాలు,

గడ్డాలు ఉన్న వ్యక్తి కాదు. మరేమిటి? నిరంతరం కదులుతుండే ఆలోచనలే. ఆలోచనలనే సంకల్పాలని, భావనలని, వృత్తులని అంటారు. ప్రతిరోజూ మనకు ఇలాంటి ఆలోచనలు, వృత్తులు ఎన్నో వస్తుంటాయి, పోతుంటాయి. ఇది చెట్టు, ఇది పుస్తకం, ఇది కుర్చీ, అది మేడ, అది ఆకాశం... ఇలా ఎన్నో వృత్తులు కదిలిపోతూ ఉంటాయి. ఇలా కదిలిపోయే వృత్తులు అనేకం, అనంతం. అయితే ఈ వృత్తులన్నీ నేను అనే ఒకే ఒక్క వృత్తి వల్ల – 'అహం వృత్తి' వల్లనే కదులుతున్నాయి. 'నేను' అనే భావన ఉంటేనే ఈవృత్తులన్నీ. 'నేను' అనే భావన లేనప్పుడు ఇక ఏ ఆలోచలనలు కదిలే అవకాశం లేదు. సముద్రం ఉన్నప్పుడే అనేక అలలు నిరంతరాయంగా కదులుతూ ఉంటాయి. సముద్రమే లేకపోతే ఇక అలలకు ఆస్కారమే లేదు. అందుకే జాగ్రదావస్థలో 'నేను' అనే భావన ఉన్నది గనుక ఆలోచనలు కదులుతూ ఉన్నాయి. మరి గాఢ నిద్రలో 'నేను' అనే భావన లేకపోవటం వల్ల ఏ ఆలోచనలు కదలటం లేదు.

ఈ ఆలోచనలన్నింటిని చేస్తున్నది ఎవరు? 'నేను' అనే భావనయే చేస్తున్నది. అది గోడ. ఎలా తెలిసింది? నేను చూచాను గనుక. అది పక్షి – నేను చూచాను గనుక. ఇది కర్నాటక సంగీతం – నేను విన్నాను గనుక. ఇది మల్లె పూల వాసన – నేను పీల్చాను గనుక. ఇది స్వీటు – నేను తిన్నాను గనుక. అంటే అనేక విషయాలు తెలియబడుతున్నాయి. వాటన్నింటిని తెలుసుకొనే 'నేను' ఒకటి ఉన్నది. ఇలా తెలియబడేవన్నీ 'ఇదం' భావనలనీ, తెలుసుకొనేది 'అహం' భావన అనీ వేదాంతం చెబుతున్నది. ఈరెండూ (ఇదం–అహం) బాగా అర్థమైనాయా? వేదాంతం బాగా తెలిసినట్లే. ఇదం భావనలన్నీ నాకన్నా వేరైనవి. వాటిని తెలుసుకొనేది, అర్థం చేసుకొనేది, భావించేది 'అహం' భావన. ఇదే 'నేను' (ఫాల్స్ ఐ). ఇదం భావనలన్నింటికి ఆధారం ఒకే

ఒక్కటైన అహం భావనయే. 'వృత్తయ:తు అహం వృత్తిం ఆశ్రితా:' అన్నివృత్తులు అహం వృత్తిని ఆశ్రయించుకొని ఉంటాయి. వృత్తులు అనేకం. కాని అహం వృత్తి మాత్రం ఒక్కటే. బిడ్డలు అనేకమంది ఉండొచ్చు. తల్లి మాత్రం ఒక్కరే. నేను చూచాను,నేను తిన్నాను, నేను వెళ్ళాను, నేను మాట్లాడాను, నేను విన్నాను, నేను కోప్పడ్డాను, నేను తప్పు చేశాను, నేను జపం చేశాను,నేను ఆలోచిస్తున్నాను... ఇలా అనేక వృత్తులు. అన్ని వృత్తులకు ఆధారం 'నేను' అనే వృత్తి – అహం వృత్తి ఒక్కటే. ఇదం వృత్తులు మారుతూ ఉంటాయి. కాని వీటికి ఆధారమైన అహం వృత్తి మాత్రం మారదు. సరే ఇదం వృత్తులు అహం వృత్తి మీద ఆధారపడి ఉన్నాయి. బాగానే ఉంది. ఇదం వృత్తులు లేకపోతే అహం వృత్తి ఉంటుందా? ఉండదా? ఇదం వృత్తులు ఉన్నా లేకున్నా అహం వృత్తి ఉండనే ఉంటుంది. అలలున్నా లేకున్నా ఆధారమైన సముద్రం తప్పకుండా ఉంటుంది. సముద్రమే అలలకు ఆధారం. అలాగే ఇదంవృత్తులున్నా లేకున్నా అహం వృత్తి తప్పక ఉంటుంది.

ఇక్కడే యోగ మార్గానికి జ్ఞాన మార్గానికి గల భేదం అద్భుతంగా అర్థం చేసుకోవచ్చు. యోగ: చిత్తవృత్తి నిరోధ: అన్నారు. చిత్తవృత్తులను అంటే ఇంతవరకు చెప్పుకున్న ఇదం వృత్తులను – అన్ని ఆలోచనలను నిరోధించటమే యోగం. అన్నిఆలోచనలు నిరోధించబడినా అన్ని ఆలోచనలు నిరోధించబడ్డాయి అనే ఆలోచన మాత్రంఉంటుంది. అదే అహంభావన, అహంవృత్తి. 'నేను' (ఫాల్స్ ఐ).

నాకీ రోజు ధ్యానం చక్కగా కుదిరిందండీ! అన్నారు. అంటే ఏమిటి? అని అడిగాను. ఒక్క ఆలోచన కూడా రాలేదు. మనస్సంతా ప్రశాంతంగా ఉంది అన్నారు. అంటే ఒక్క ఆలోచన కూడా రాలేదు అని గ్రహించారు గదా! ఆ గ్రహించినదే అహంభావన – అహంవృత్తి. ఇది కూడా తొలగిందా? లేదు. మరి దీన్ని కూడా తొలగించే మార్గం ఏమైనా

ఉన్నదా? ఆ! ఉన్నది. అదే జ్ఞాన మార్గం.కనుక యోగమార్గం ద్వారా ఇదం భావనలను నిరోధించవచ్చు. అహంభావన పోదు. జ్ఞాన మార్గం ద్వారా మాత్రమే అహంభావన కూడా తొలగిపోతుంది. పూజ, జపం, యోగం, చింతనం, వీటన్నింటి ద్వారా అన్ని వృత్తులను నిరోధించవచ్చు. కాని అహంవృత్తి మాత్రం పోదు. అహంవృత్తి ఉన్నదా మళ్ళీ మళ్ళీ ఇదంవృత్తులు కదులుతూనే ఉంటాయి. ఒక చెట్టుకు కొమ్మలు చాలా పెరిగిపోయాయి. మనకు అందనంత ఎత్తుకు పెరిగాయి. ఒక రోజున ఆ కొమ్మలన్నింటిని కొట్టివేస్తాం. ఇంకా చెట్టు మాత్రం అలాగే ఉంది. కొద్ది రోజుల తర్వాత మళ్ళీ కొత్త చిగుళ్ళు వేసి కొమ్మలు వస్తూనే ఉంటాయి. అలాగే ఏదో ఒక మార్గం ద్వారా మనకు కలిగే ఆలోచనలను–భావనలను నిరోధించవచ్చు. కాని అహంభావన మాత్రం అలాగే మిగిలి పోతుంది. కనుక అది మళ్లీ అనేక భావనలను–ఇదంభావనలను కదిలిస్తూనే ఉంటుంది.

మరి మనస్సంటే ఏమిటి? వృత్తయో మన: అన్నారు గనుక ఇదంభావనలన్నీ మనస్సే. మరి ఇదంభావనలన్నింటిని నిరోధిస్తే మనస్సును నిరోధించినట్లేనా? ఆలోచనలన్నీ ఆగిపోతే మనస్సు నశించినట్లేనా? మనస్సు లేనట్లేనా? కాదు. అని పై విశ్లేషణ వల్ల తెలుస్తుంది. అంటే అన్ని వృత్తులను, భావనలను నిరోధించినా వాటికి ఆధారమైన అహంవృత్తి లేదా అహంభావన ఉన్నది గనుక మనస్సు ఇంకా ఉన్నట్లే. అంటే దీనిని బట్టి మనకు ఏం అర్థం అవుతున్నది? అహంవృత్తియే మనస్సు అని. అహంవృత్తి ఉన్నంతవరకూ మనస్సు ఉన్నట్లే – ఆలోచనలున్నట్లే. అహంవృత్తి పోతేనే మనస్సు పోయినట్లు–లేనట్లు. కనుక మనస్సంటే అహంవృత్తియే.

కాకపోతే అనేక ఆలోచనలు పోయి ఒక్క ఆలోచన వుండటం కాస్త బెటర్. అనేక ఆలోచనల వల్ల అశాంతి, అలజడి, ఆందోళన. కనుక ముందు వాటిని నిరోధించాలి. పదిమంది చేత తన్నులు తినటం

కన్నా ఒక్కడి చేత తినటం మంచిది కదా! ఐతే మనకు కావలసింది మనస్సు లేకుండా పోవటమే. అంటే'అహంభావన' కూడా పోవటమే. దానికి మానసంతుకిం? అనే విచారణామార్గమే సరియైన సూటియైన మార్గం.

మనకు కావలసింది మనోలయం కాదు; మనోనాశనం అని ఇంతకు ముందే తెలుసుకున్నాం. ఇదంభావనలన్నీ తొలగిపోయినా వాటికి ఆధారమైన అహంభావన అలాగే ఉన్నప్పుడు మళ్ళీ మళ్ళీ ఇదంభావనలు కదులుతూనే ఉంటాయి అని తెలుసుకున్నాం. కనుక యోగం ద్వారా– అంటే ప్రాణబంధనం ద్వారా మనోలయం మాత్రం సాధించాము. అంటే అన్ని ఇదంభావనలు ఆపగలిగామేగాని అహంభావన అలాగే ఉన్నది అని. అలాగాకుండా జ్ఞానం ద్వారా–అంటే ఏకచింతనం లేదా విచారణ ద్వారా మనోనాశనం సాధించాము – అంటే అన్ని భావనలకు ఆధారమైన అహంభావన కూడా తొలగిపోయింది – అని భావం. కనుక మనస్సు నశించాలంటే – మనస్సు లేకుండా పోవాలంటే అహం భావన తొలగిపోవాలి. అహం భావన తొలగాలంటే జ్ఞానమార్గమే – విచారణ మార్గమే సూటియైన మార్గం.

–మరి ఈ అహంభావన – నేను అనే భావన ఎలా పోతుంది? 19వ శ్లోకంలో.

–ఈ అహంభావన ఎలా పోతుందో ఆ ఉపాయాన్ని చెబుతున్నారు.

**శ్లో॥ అహమయం కుతో భవతి చిన్వత:।**
**అయి పతత్యహం నిజ విచారణం ॥ –19**

**ప్రతిపదార్థం** :అయం అహం = ఈ అహం భావన, కుత: = ఎక్కడ, భవతి = పుడుతున్నది (అని), చిన్వత: = వెతికినట్లైతే, అయిఅహంపతతి = ఈ అహంభావన పడిపోతుంది, నిజ విచారణం = ఇదే నిజమైన విచారణ – ఆత్మ విచారణ.

**భావం** : ఈ (అహంభావన) నేను అనే ప్రథమ తలంపు ఎక్కడ పుడుతున్నదో వెతికినట్లైతే అది పడిపోతుంది. ఇదే నిజమైన విచారణ – ఆత్మ విచారణ.

**వ్యాఖ్య** :మానసంతుకిం? మనస్సంటే ఏమిటి? అని ప్రశ్న వేసుకొని విచారణ చేస్తే మనస్సు లేనే లేదని తెలుస్తుందని 17వ శ్లోకంలో తెలుసుకున్నాం. అసలు మనసంటే ఏమిటో 18వ శ్లోకంలో తెలిపారు. మనసు అంటే ఆలోచనలేనని, ఈ ఆలోచనలు రెండు రకాలని, అవి 1) ఇదం భావనలు 2) అహంభావన అని తెలుసుకున్నాం. అంతేగాక ఇదం భావనలన్నీ ప్రపంచానికి చెందినవని, అవి అనేకం అని, అన్ని ఇదం భావనలను పూజ, జపం, యోగం మొదలైన సాధనల ద్వారా పోగొట్టుకోవచ్చునని, కాని అన్ని ఇదం భావనలు పోయినా వాటికి ఆధారమైన అహంభావన మాత్రం అలాగే మిగిలిపోయి ఉంటుందనీ కూడా తెలుసుకున్నాం. ఈ అహంభావన ఉన్నంతవరకు మళ్ళీ మళ్ళీ ఇదంభావనలు కదులుతూనే ఉంటాయి. అలజడులు, ఆందోళనలు, దు:ఖాలు కలుగుతూనే ఉంటాయి. కనుక ఈ అహంభావనను పోగొట్టుకోవాలి? ఎలా పోగొట్టుకోవాలో ఈ శ్లోకంలో తెలియజేస్తున్నారు. ఏమని?

“అయం అహం కుత: చిన్వత:” ఈ ‘నేను’ ఎక్కడ నుండి పుడుతున్నదీ అని వెతకాలి. అలా వెతకటం మొదలుపెడితే ఈ అహంభావన – ‘నేను’ అనే భావన ఆశ్చర్యకరంగా పడిపోతుంది. ఇదే నిజమైన విచారణ – ఆత్మ విచారణ అంటున్నారు మహర్షి.

‘అయం అహం’ ఈ ‘నేను’ అంటున్నారు. ఏ ‘నేను’? ఏదో ఒక ఉపాయంతో – పూజ, జపం, చింతనం, ప్రాణ బంధనం మొదలైన ఏదో ఒక సాధన సహాయంతో అన్ని ఇదంభావనలు, అన్ని సంకల్పాలు, ఆలోచనలు ఆగిపోయిన తర్వాత, ఈ ఆలోచనలనకు ఆధారంగా మిగిలి ఉన్న ఒకే ఒక్క ‘నేను’ అనే భావన – అహంభావన ఏదైతే ఉందో ఆ

'నేను'. కనుక మనం విచారణ చెయ్యవలసింది ఏ నేనునో జాగ్రత్తగా గమనించాలి. అన్ని తలంపులకు ఆధారమైన ప్రధమ తలంపు 'నేను' అనే తలంపు. ఈ 'నేను' అనే తలంపును – అహంభావనను పట్టుకోవటం అంత తేలికైన విషయం కాదు. పాదరసంలా జారిపోతుంది. అలాగని వదిలేస్తే ఈనేను అనే తలంపు అనేక తలంపులకు, ఆలోచనలకు కారణమై మనను ఈ సుఖదు:ఖాలతో కూడిన ప్రపంచంలో బంధిస్తుంది. ఆనందానికి దూరం చేస్తుంది. ఎంతవరకు ఈ అహంభావన – నేను అనే తలంపు ఉ న్నదో అంతవరకు మనకు దు:ఖాలు, బాధలు, భయాలు తప్పవు.

ఒకచోట ఒక స్కూలు గదులు తగలబడిపోతున్నవి. అన్నీ పూరిపాకలే. అన్నీ అంటుకొని మండిపోతున్నాయి. టీచర్లు, పిల్లలు అందరూ భయంతో పరుగులు తీసుకుంటూ బయటపడ్డారు. పాకలన్నీ పూర్తిగా తగలబడి పోయాయి. పిల్లలందరినీ ఈ రోజుకు బడి లేదు ఇళ్లకు వెళ్లిపోండి అని టీచర్లు చెప్పారు. అందరూ సంతోషంతో ఎగురుకుంటూ ఇళ్ళకు వెళుతున్నారు. అంతలో ఆత్రోవన ఒక సాధువు వస్తున్నాడు. అతడు టీచరుతో 'బాబూ' ఏమిటి? ఏం జరిగింది? పిల్లలంతా అలా ఎగురుకుంటూ వెళ్తున్నారేమిటి? అన్నాడు. స్కూలు పాకలన్నీ తగలబడి పోయినాయ్, అందువల్ల సెలవు ఇచ్చి ఇంటికి పొమ్మన్నాం. అందుకే అందరూ ఎగురుకుంటూ వెళుతున్నారు అన్నాడు టీచరు. అదేమిటండీ! వాళ్లకంత ఆనందం ఎందుకు? అన్నాడు. అంతేనండి వాళ్లకి స్వేచ్ఛ వచ్చింది గదా! రోజూ క్లాసులో కూర్చోబెట్టి పాఠాలు చెబుతాం గదా! ఇవ్వాళ ఈ బందిఖానా తప్పిందని ఆనందం. పట్టి ఉంచితే దు:ఖం, వదిలిపెడితే ఆనందం పిల్లలకు. ఇప్పటి పిల్లల తీరే అంతలెండి, వాళ్ళకు చదువు మీద శ్రద్ధ ఉండదు అన్నాడు టీచరు. అంతలో దూరంగా చెట్టుక్రింద కూర్చొని ఏడుస్తున్న బాలుణ్ణి చూపి ఆ సాధువు, అడుగోనండి ఆ బాలుడు మాత్రం

ఆనందించటం లేదు, పైగా దు:ఖపడుతున్నాడు. అతడికి చదువు మీద ఎంత శ్రద్ధో పాపం! అన్నాడు. 'అంతశ్రద్ధ గల వాడెవడూ ఇక్కడ లేడే! అయినా అడిగి చూద్దాం అని వాడి దగ్గరకొచ్చి ఎందుకురా ఏడుస్తున్నావు? అని అడిగారు. దానికి వాడు ఏంచేద్దామండి స్కూలు పాకలు తగలబడి పోయాయే గాని టీచరు బ్రతికే ఉన్నాడు గదండీ. రేపు ఈ చెట్టు క్రిందే కూర్చోబెట్టి పాఠాలు చెబుతాడు. ఈ మాత్రం దానికి ఆనందం ఎందుకు? అన్నాడు. అలాగే పాకలన్నీ పోయినా టీచరు ఉంటే పాఠాల బాధ తప్పనట్లు అన్ని ఆలోచనలు పోయినా ఈ 'నేను' అనే భావన ఉంటే ఈ ప్రపంచం యొక్క అస్థిత్వం గాని, దీనివల్ల కలిగే బాధలు కాని తప్పవు. సాధకుడు ప్రయత్నంతో అన్ని ఆలోచనలను ఆపివేయగలుగుతాడే గాని ఈ 'నేను' అనే ప్రథమ తలంపును – అహంభావనను ఎలా తొలగించుకోవాలో తెలియక తికమకపడతాడు. ఇక్కడే ఉపనిషత్ గ్రంధాలు, మహాత్ములు, గురువులు చేయి అందించాలి. మార్గం చూపాలి. అందుకే ఇక్కడ ఉపాయం చెబుతున్నారు. ఈ 'అహంవృత్తి' – నేను అనే భావన ఎక్కడ పుడుతున్నదో అని వెతికితే, విచారణ చేస్తే ఈ 'నేను' అనే భావన పడిపోతుంది. ఇదే నిజమైన ఆత్మ విచారణ అని. కనుక ఇలా 'నేను' యొక్క పుట్టుకను వెదుకుతూ పోవాలి. అప్పుడే అది పడిపోతుంది ఆశ్చర్యకరంగా.

–ఈ మార్గం మహర్షియొక్క స్వంతమా? లేక శాస్త్ర ప్రమాణం ఉన్నదా? "సౌభాగ్య లక్ష్మి ఉపనిషత్"లో ఇలా ఉంది.

**మం॥ అహంభావం పరిత్యజ్య జగత్ భావం అనీ దృశం।**
**నిర్వికల్పే స్థితోవిద్వాన్ భూయోనాప్యనుశోచతి॥**

–అన్ని భావాలు వదిలిపోయిన తర్వాత మిగిలి ఉండే ఈ అహంభావనను పరిత్యజ్య – వదలగలిగితే జగద్భావం కూడా అదృశ్యమై పోతుంది. జగత్‌భావన తొలగితే ఇక మిగిలేది నిర్వికల్ప స్థితే. ఎట్టి

వికల్పాలు, భావనలు లేని భావాతీత స్థితియే. అట్టి స్థితిని పొందిన విద్వాంసుడు భూయ: – తిరిగి దు:ఖించాల్సిన పనిలేదు. ఇప్పటి దాకా జగద్భావన వల్ల దు:ఖాలు. అవి తొలగినప్పుడు శాశ్వత ఆనందంలోనే ఉండిపోతాడు. కనుక ఇది శ్రుతి సమ్మతం.

అయ్యో! ఈ 'నేను' అనే భావన కూడా వదిలించుకుంటే ఎట్లానండి. ఏదో పొందాలని ఇలాంటి చోట్లకు వస్తుంటాం. అన్నీ పోగొట్టుకోమని మీరు చెబుతారు – అని చాలా మంది భయపడతారు. ఇదంతా సరైన అవగాహన లేకపోవటం వల్లనే. మనం పోగొట్టుకుంటున్నది దు:ఖాలకు కారణమైన మనస్సునే అని గ్రహించాలి.

–ఈ చివరకు మిగిలిన అహంభావనను కూడా పోగొట్టుకున్న తర్వాత ఏం మిగిలి ఉంటుంది?

**శ్లో॥ అహమి నాశభాజ్యహ మహం తయా।**
**స్ఫురతి హృత్ స్వయం పరమపూర్ణ సత్॥ –20**

**ప్రతిపదార్థం** :అహమి నాశభాజి = 'అహం' భావన నాశనమైపోగా, అహం అహంతయా = నేను నేను అంటూ సత్యమైన నేను, హృత్ = హృదయమునందు, స్వయం స్ఫురతి = స్వయంగా ప్రకాశిస్తుంది, పరమ పూర్ణ సత్ = అదే అన్నింటి కన్న శ్రేష్ఠమైన, అఖండమైన సత్ స్వరూపం.

**భావం** : అహం భావన నాశనమై పోయినప్పుడు శ్రేష్ఠము, అఖండము అయిన సత్ స్వరూపం నేను నేను అంటూ హృదయము నందు స్వయంగా ప్రకాశిస్తుంది.

**వ్యాఖ్య** :'అహమి నాశభాజి' ఈ అహంభావన (జీవాహంకారము) – 'నేను' అనేప్రథమ తలంపు నాశనమైతే ఇక ఏం మిగిలి ఉంటుంది? నేను నేను అనే పరమ పూర్ణసత్ రూపం స్వయంగా ప్రకాశిస్తుంది. ఇదేమిటండీ! ఇప్పటి దాకా అన్ని ఇదంభావనలకు ఆధారమైన అహంభావన – 'నేను'

అనే భావన పోగొట్టుకోవాలన్నారు. అందుకోసం ఈ నేను అనే భావన ఎక్కడ పుడుతుందో వెతకమన్నారు. అలా వెతికితే 'అహం' భావన – ఈ నేను పడిపోతుంది అన్నారు. మరి ఇది పడిపోయిన తర్వాత ఇక మిగిలేదేమిటి? అంటే మళ్ళీ నేను–నేను అంటున్నారు. ఇంక ఎప్పటికీ ఈ నేను వదలదా? అంటే – మొదటి 'నేను' జీవాహంకారం – అహంవృత్తి. అది అపరిపూర్ణమైనది. సత్ కాదు. మిధ్య. దానివల్లనే అన్నిరకాల ఇదం భావనలు, వాటి వల్ల దు:ఖాలు. కాని ఆ 'నేను' పడిపోయిన తర్వాత స్వయంగా తనంతట తాను ప్రకాశించే ఈ 'నేను' సత్యమైన నేను. ఇది జ్ఞాన స్వరూపం. సత్‌రూపం,అఖండము, పరిపూర్ణము అయిన శాశ్వత వస్తువు. శ్రేష్ఠమైన పరవస్తువు. ఈ 'నేను'నే రమణ మహర్షి 'తాను' అని పేరుబెట్టి పలుకుతుంటారు. ఇదే సుషుప్తిలో అన్ని భావనలు, మనస్సు అంతమైనా ప్రకాశిస్తూ ఉండేది. కాకపోతే అక్కడ మనస్సు లయమైనదే తప్ప నశించలేదు కనుక మళ్ళీ మనస్సు, దానితో పాటు ఈ జగత్తు సుఖదు:ఖాలు అన్నీ పుట్టుకొస్తున్నాయి. ఇప్పుడు ప్రయత్నంతో – విచారణతో, ఈ 'అహం'భావనను నాశనం చేస్తే ఆ స్థానంలో తాను (ఆత్మ) నేను నేనని స్వయంగా ప్రకాశిస్తుంది. ఇదే ఆత్మసాక్షాత్కారం, ఆత్మదర్శనం. నిజంగా ఆత్మదర్శనం అనేమాట పెద్ద తప్పు. ఎందుకంటే ఆత్మను దర్శించటం సాధ్యమయ్యే పనికాదు. ఒక గృహస్థుడు పరిపూర్ణానందస్వామి వద్దకు వచ్చి ఆత్మ దర్శనం కావాలన్నాడు. దానికి స్వామి "నీకెప్పుడూ ఆత్మ దర్శనం కాదు పో!" అన్నాడట. పాపం ఆ అభాగ్యుడు అనవసరంగా ఈ స్వామిని కదిలించాను. శాపం పెట్టినట్లుగా కసిరాడే. అందుకే స్వాములతోను, పాములతోను స్నేహం చెయ్యకూడదంటారు అని బాధపడుతున్నాడు. అప్పుడాయన అతడితో అన్నాడు, ఆత్మ అనేది ఒక వస్తువు కాదు దర్శించటానికి, అది దృశ్యమూ కాదు. అది నీచే చూడబడే వస్తువే అయితే

పరిమితమైనదే అవుతుంది. పరిమితమైనది నశిస్తుంది. నశించే దానిని ఆత్మ అని ఎలా అంటాం? అది ఏకం, అద్వయం, సర్వ వ్యాపకం. అది నీకన్నా వేరుకాదు. కనుక వేరుగా దానిని దర్శించలేవు. అది నేనేనని అనుభవం కలగాలి. అజ్ఞానం తొలగాలి. అంతే అన్నాడు. ఈ అహంభావన నశించటమంటే అజ్ఞానం తొలగిపోవుటే. అజ్ఞానం తొలగిపోతున్నందుకు ఎవరైనా దు:ఖిస్తారా? అప్పులన్నీ రద్దైపోతున్నాయని ఎవరైనా బాధపడతారా? కనుక ఈ అహంభావన నశిస్తే ఆనందించాలి.

అయితే ఈ అజ్ఞానం ఎప్పుడు నశిస్తుంది? ఈ అహంభావన ఎప్పుడు తొలగిపోతుంది? కేవలం విచారణ వల్లనే. ఏ అన్యమైన సాధనల వల్ల ఇది తొలగిపోదు. పూజ, యజ్ఞం, దానధర్మాలు మొదలైన కర్మల వల్లగాని, జపం, ధ్యానం మొదలైన సాధనల వల్ల గాని, ప్రాణాయామం మొదలైన ప్రక్రియల వల్ల గాని ఈ అహంభావన తొలగిపోదు. ఈ సాధనలన్నీ కొన్ని ప్రక్రియలు మాత్రమే. సహాయకారులయ్యే ప్రక్రియలు మాత్రమే. మరి దేని వల్ల తొలగిపోతుంది?

ఈ అహంవృత్తి అంటే ఏమిటి? దీని పుట్టుకస్థానం ఏది? అని వెతకటం వల్లనే – నిజ విచారణం వల్లనే ఇది పడిపోతుంది. గంటల కొద్దీ నిర్వికల్ప సమాధిలో కూర్చుందాం అని ప్రయత్నం చేసినా ఫలితం ఉండదు. అజ్ఞానం తొలగాలి. అప్పుడే ఆత్మదర్శనం. మనస్సు యొక్క పుట్టుక చోటు యేది? అని విచారణ చేస్తేనే మన మనస్సు (అహంభావన) నాశనమౌతుంది. రోజుకు 24 గంటల చొప్పున 365 రోజులు ధ్యానం చేసినా, జపం చేసినా ఇదంభావనలు తొలగిపోతాయే గాని అహంభావన పోదు, ఆత్మదర్శనం కాదు. సాధకుడు సాధన చతుష్టయ సంపన్నుడై, అధికారియై ఉంటే, తగిన శ్రద్ధ చూపిస్తే సద్గురువు ద్వారా వేదాంత బోధవింటూ వింటూ ఉండగానే అతడికీస్థితి సద్యోఫలంగా లభిస్తుంది.

ఒక వేళ అట్టి అర్హతలు లేని వాడైతే వాటిని సంపాదించటానికే జపధ్యానాదులు. వీటి ద్వారా అర్హత సంపాదిస్తే విచారణ చేయగలుగుతాడు.

ఇలా అహంభావన యొక్క మూలాన్ని వెతికితే అది పడిపోతుంది. అది పడిపోతే - నశించిపోతే ఆత్మ అనేది ఎక్కణ్ణించైనా వస్తుందా? లేదు. అది స్వయం వ్యక్తం. అందుకే "స్ఫురతి హత్ స్వయం" అన్నారు. శుద్ధ చైతన్య స్వరూపమైన ఆత్మ 'నేను-నేను' అంటూ స్వయంగా ప్రకాశిస్తుంది. వర్షాకాలంలో సూర్యుడు అప్పుడప్పుడూ సరిగ్గా కనిపించడు. ఎందుకంటే వర్షమేఘాలు కప్పటం వల్ల. నిజంగా సూర్యుడు అక్కడ లేడా? లేక ప్రకాశించటం లేదా? రెండూకాదు. సూర్యుడెక్కడికీ పోయేవాడూ కాదు. వెలుగుతూ ఆరుతూ ఉండే వాడూకాదు. ఎప్పుడూ జ్వాజ్వల్యమానంగా ప్రచండ కిరణాలతో భాసిస్తూనే ఉంటాడు. కాకపోతే మన కంటికి అడ్డంగా మేఘాలు వచ్చాయి. కనుక చూడలేక పోతున్నాం. ఒక్క గాలి వచ్చి ఆ మేఘాలు తొలగిపోతే అక్కడ యధాప్రకారం సూర్యుడు ప్రకాశిస్తూ కనిపిస్తాడు.

అలాగే ఇక్కడ ఆత్మ సూర్యుడు ఎప్పుడూ ప్రకాశిస్తూనే వుంటాడు. అయితే అజ్ఞానమనే మేఘాలు కప్పివేసినయ్. ఇప్పుడు జ్ఞానమనే గాలి వీస్తే - ఈ నేను ఎక్కడ పుట్టింది? - అనే ఆత్మ విచారణ వాయువులు ప్రచండంగా వీస్తే ఈ అజ్ఞాన మేఘాలు తొలగిపోతాయి. యధాప్రకారంగా ఆత్మ సూర్యుడు స్వయంగా ప్రకాశిస్తాడు. "నేనడంగిన చోట నేను నేననుచు తానుగా తోచును తానుపూర్ణంబు" - (రమణమహర్షి).

కనుక అహంభావన పోవాలి, అహంకారం నశించాలి, మనోనాశనం జరగాలి. అహంకార నాశనమంటే శరీరమనోబుద్ధులను నాశనం చెయ్యటం కాదు. వాటితో తాదాత్మ్యాన్ని వదలటమే. నాటకం అయిపోయిన తర్వాత నటుడు వేషాన్ని పూర్తిగా తీసేస్తేనే తాను మిగులుతాడు. కిరీటం బాగుందనో, డ్రెస్ బాగుందనో ఉంచుకుంటే కుక్కలు

వెంటబడతాయ్.

అన్నపూర్ణోపనిషత్‌లో ఇదే విషయం ప్రస్తావించబడింది.

మం॥ యావత్ సర్వం నసంశ్యక్తం తావత్ ఆత్మానలభ్యతే।
సర్వవస్తు పరిత్యాగే శేష ఆత్మేతికచ్చతే॥

సమస్తాన్నీ వదలనంత వరకు ఆత్మానుభూతి కలగదు. అన్నింటిని త్యజిస్తే మిగిలేది ఆత్మయే. నేనే. ఎవరు ఈ నేను? ఎట్టిది అది?

–అహం వృత్తి నశించిన తర్వాత మిగిలిన ఆ 'నేను' ఎట్టిదో ఆ నేను ఎవరో తెలియజేస్తున్నారు.

**శ్లో॥ ఇదమహంపదా 2 భిఖ్యమన్వహం।**
**అహమిలీనకే 2 ప్యలయ సత్తయా॥ –21**

**ప్రతిపదార్థం**:– అన్వహం=నిత్యము, అహమిలీనకే అపి=అహంవృత్తి లీనమైనప్పుడు (గాఢనిద్రయందు) కూడా, అలయసత్తయా=ఏ నేను లయించిపోకుండా ఉంటున్నదో, ఇదం= ఈ నేను, అహంపద= అహం అనే పదముచేత, ఆభిఖ్యం=చెప్పబడుచున్నది.

**భావం**:– నిత్యము గాఢనిద్రయందు మన అహంవృత్తి లయించి పోయినప్పటికి ఏ నేను – పరమపూర్ణ సద్రూప ఆత్మ లయించిపోకుండా ఉంటున్నదో ఆ నేను 'అహం' అనే పదం చేత చెప్పబడుచున్నది.

**వ్యాఖ్య** :– అహంభావన పడిపోయినప్పటికీ ఏది లయించకుండా ఉంటుందో అదే నేను. 'అహం' అనే పదం చేత చెప్పబడుచున్నది. మరి అక్కడా నేను అన్నాం. ఇక్కడా నేను అంటున్నాం. ఏమిటి ఈ రెంటికి తేడా? (1) అక్కడిది 'అహంభావన' లేదా 'అహంవృత్తి'. ఇక్కడ చెప్పింది 'అహం'. ఈ అహమే తాను. (2)అహంభావన అనేది అజ్ఞానంలో పుట్టింది. అహం ఎల్లప్పుడూ జ్ఞానంలో ఉండేది. (3) అహంభావన అనేక ఇదంభావనల పుట్టుకకు ఆధారమవుతుంది. అహం అనేది ఏ భావనలు లేని భావశూన్య సద్భావస్థితి.

(4) అహంభావన జ్ఞానంతో నశించిపోయేది. అహం ఎట్టి నాశనం లేనిది. చావుపుట్టుకలు లేని నిత్య సత్యం. (5) అహంభావన కర్తృత్వం, భోక్తృత్వం, ప్రమాతృత్వం (నేను తెలుసుకుంటున్నాను)–వీటిని తనపై ఆపాదించు కుంటుంది. అహం కు కర్తృత్వం గాని భోక్తృత్వంగాని, ప్రమాతృత్వం గాని ఏమీ ఉండవు. ఈ అహం కేవలం నిర్లిప్తం.(6) అహంభావన జననమరణ సంసార చక్రంలో ఇరుక్కోవడానికి కారణమౌతుంది. కాని అహంకు జననమరణాలనేవి ఉండవు. అది నిత్యం, శాశ్వతం.

ఈ అహం ను రమణమహర్షి 'తాను' అని పలుకుతూ వుంటాడు. అందుకే ముందటి శ్లోకానికి తెలుగులో మహర్షి ఇలా వ్రాశారు.

"నే నడంగినచోట 'నేనునేన'నుచు
తానుగాదోచును తాను పూర్ణంబు" – అని.

అహంభావన అణగినచోట నేను – నేను అంటూ తాను స్వయంగా వ్యక్తమవుతుంది. తాను పూర్ణము అని. (చిత్ స్వరూపం. సత్‌స్వరూపం).

రమణమహర్షి వద్దకు ఒక చిన్న బిడ్డతో సహా ఒక తల్లి వచ్చి, మహర్షికి నమస్కరించింది. ఆ బిడ్డ మహర్షిని చూచి తాతా తాతా అని పిలిచింది. దానికి తల్లి తప్పు అలా అనకూడదు అని బిడ్డను మందలించింది. అప్పుడు మహర్షి ఆమెతో, ఎందుకు ఆ బిడ్డను కోప్పడతావు? అందులో తప్పేముంది. అసలు సత్యాన్నే చెప్పిందే ఆ బిడ్డ. తా తా అంటే తాను తానే అనే. అహంభావన పడిపోతే మిగిలేది తాతా.

పూర్వ కాలంలో బుర్రకథలు మీరు వినే ఉంటారు."తందానా తందానా తాన తందనానా" అని పాడతారు.తాను తానే తాన్ తానే తానే తాన్ తానే అనే పదాలు కలిసి పోయినవి. అంతే.

ఏ సత్యమైతే మోడరన్ ఫిజిక్స్‌కు మింగుడు పడలేదో అదే సత్యాన్ని పురాతన కాలంలో భారతదేశపు గ్రామీణ వీధులలో పెద్దగా చదువుకోని వారు, అక్షర జ్ఞానం కూడా లేని వారు అయిన కథకులు పాడుకుంటూ

వుండేవారు.

అంతా నశించిన దశలో ఏముందో తెలియటం లేదు. దేని నుండి ఈ ప్రపపంచం వచ్చిందో, దేనికారణంగా ఈ ప్రపంచం నిలిచి వుందో, ఎక్కడ ఇదంతా లయమౌతుందో తెలుసుకోలేక "సమ్‌తింగ్ అన్‌నోన్ ఈజ్ డూయింగ్"అని చెప్పి సైన్స్ వదిలివేసిన చోట భారతీయ వేదాంతం చెబుతున్నది.

ఎవ్వనిచే జనించు జగమెవ్వనిలోపల నుండు లీనమై
ఎవ్వనియందు డిందు పరమేశ్వరుడెవ్వడు మూలకారణం
బెవ్వడనాది మధ్యలయుడెవ్వడు సర్వముతానయైనవా
డెవ్వడు వాని నాత్మ భవునీశ్వరునే శరణంబువేడెదన్.

సర్వము అహం వృత్తిలో లయమై పోగా ఆ అహంవృత్తి నశించిన చోట 'నేను నేను' అంటూ స్వయంగా 'తాను' పరిపూర్ణ సద్రూప చైతన్యం ప్రకాశిస్తున్నది అని. ఇదే విషయాన్ని వీధులలో తిరిగే బుర్రకథ చెప్పేవారు పలుకుతున్నారు. ఇది నిజంగా బుర్రకథ కాదు, బుర్ర ఉన్నవాడి కథ, బుర్రలోని కథ, బుర్రలో ఉండాల్సిన కథ.

మనస్సులోని సమస్త సంకల్ప వికల్పాలు ఆగిపోయిన తర్వాత, వీటిని తయారు చేసిన 'అహంభావన' కూడా నశించి పోయిన తర్వాత, శరదృతువులో మేఘాలు తొలగిన తర్వాత ఆకాశం ఎలా నిర్మలంగా కనిపిస్తుందో అలాగే అహంభావన అనే అజ్ఞాన మేఘాలు తొలగిన తర్వాత హృదయాకాశం నిర్మలంగా ఉంటుంది. అంతేకాదు ఏకంగా, అద్వయంగా, అఖండంగా, కేవలంగా, సత్‌రూపంగా, చిత్‌రూపంగా, ఆనంద స్వరూపంగా సమస్తము తానే ఐ భాసిస్తుంది. అదే సచ్చిదానంద స్వరూప ఆత్మచైతన్యం. అదే బ్రహ్మం. ఇప్పటి వరకు కర్తగా, భోక్తగా, ప్రమాతగాఉన్న అహంభావన అన్ని భావనలను, అస్థిత్వాన్ని పోగొట్టుకొని కేవల 'అహం'గా 'తాను'గా ఆత్మగా మిగిలిపోతుంది. ఇప్పుడు అక్కడి నుండి చూస్తే ఎలా ఉంటుంది?

ఈ జగత్తు జీవుళ్ళూ ఎలా కనిపిస్తారు?.........

–ఆ 'నేను' – సద్రూప చైతన్యంలో ఏముంది? ఎలా ఉంటుంది అది?

**శ్లో॥ విగ్రహేంద్రియ ప్రాణధీతమః।**

**నాహమేక సత్ తజ్జడం హ్యసత్॥ –22**

**ప్రతిపదార్థం** :విగ్రహ = శరీరం, ఇంద్రియ = ఇంద్రియాలు, ప్రాణ = ప్రాణ వాయువులు, ధీ = బుద్ధి (మనస్సు) తమః = అజ్ఞానము, అహం న = నేను కాదు, తత్ = అవి అన్నీ, జడం = జడమైనవి, హి = ఎందుకంటే, అసత్ = అవి అసత్ కనుక, అహం = నేను, ఏక సత్ = ఒకే ఒక్కటైన సత్ రూపమును.

**భావం** = ఈ శరీరం, ఇంద్రియాలు, ప్రాణాలు, మనస్సు, బుద్ధి, అజ్ఞానం ఇవన్నీ జడమైనవి. నేను కాదు. ఎందుకంటే అవి అసత్‌గనుక. నేను ఏకమైన సద్రూప చైతన్యాన్ని .

**వ్యాఖ్య** :ఇంతవరకు నా నిజ స్వరూపం ఏదో తెలుసుకోలేని అజ్ఞానంలో ఉన్నాను గనుక దేహమే నేను అనుకున్నాను. అందుకే దేహానికి జబ్బు చేస్తే నాకు జబ్బు చేసింది అన్నాను. ఇంద్రియాలు నేననుకున్నాను. అందుకే కళ్లకు మసక వస్తే నాకు మసక వచ్చింది అని, చెవిలో తేడా వస్తే నాకు చెముడు వచ్చిందని అంటున్నాం. అలాగే ప్రాణాలు నేనేనని భావిస్తున్నాం. అందుకే ప్రాణధర్మమైన ఆకలి, దప్పికలను నాకు ఆకలిగా ఉంది, దప్పికగా ఉంది – అంటున్నాం. అలాగే మనస్సు, బుద్ధి నేనేనని భావిస్తున్నాం. అందుకే మనస్సు అశాంతిగా ఉంటే నేను అశాంతిగా ఉన్నానని, మనసు సంతోషంగా ఉంటే నేను సంతోషంగా ఉన్నానని అంటున్నాం. బుద్ధిలో వైద్య శాస్త్ర సంబంధ జ్ఞానం ఉంటే డాక్టరునని, చట్ట సంబంధ జ్ఞానం వుంటే లాయరునని అంటున్నాం.

ఇలా వివిధ ఉపాధులతో తాదాత్మ్యం చెంది అవే నేను అనుకుంటున్నాను. ఇదంతా నిజంగా నేనెవరో తెలుసుకోక పోవటం వల్లనే.

అజ్ఞానం వల్లనే. నిజంగా ఇవేవీ నేను కానే కాదు. నేను ఏకమైన సత్ రూపచైతన్యాన్ని. ఇవన్నీ అసత్ రూపములు. జడ రూపములు. వీటన్నింటిని నేను తెలుసుకుంటున్నాను. తెలుసుకొనే నేను తెలియబడేవాటికన్నా ఎప్పుడూ వేరుగానే ఉంటాను. పుస్తకాన్ని పుస్తకమని తెలుసుకుంటున్నానంటే పుస్తకం నాకన్నా వేరుగా ఉన్నట్టే గదా! అలాగే ఈ దేహాన్ని, ఇంద్రియాలను, ప్రాణాలను, మనస్సును, బుద్ధిని, చివరకు అజ్ఞానాన్ని కూడా నేను తెలుసుకుంటున్నాను. కనుక నేను వాటన్నిటి కన్నా వేరుగా ఉన్నట్లే. నేనెన్నటికీ అవికాదు. అవి నేను కాదు.అవి అన్నీ అసత్. సత్యం కాదు. పైగా అవి జడం కూడా. అవి దృశ్యం.

'యత్ దృశ్యం తత్ జడం' ఏది దృశ్యమో, తెలియబడేదో, అది జడమైనది. కనుక నాచే తెలియబడే శరీరం, ఇంద్రియాలు, ప్రాణాలు, మనో బుద్ధులు అన్నీ జడములే. చైతన్యవంతంగా కనిపిస్తాయేగాని అవి నిజంగా చైతన్యం కాదు. లైట్, ఫ్యాన్ లాగా వాటికి స్వతస్సిద్ధ చైతన్యం లేదు. అవి నేను అనబడే చైతన్యాన్ని అధారం చేసుకొని ఉన్నాయి. శరీరం నిజంగా చైతన్యమే అయితే ఎప్పుడూ చైతన్యంగానే ఉండాలి. కాని ప్రతి శరీరము ఎప్పుడో ఒకప్పుడు చైతన్య రహితమై పోతున్నది. కనుక అది జడం. మరినేనో–

నేను అన్నింటిని తెలుసుకొనే వాణ్ణి. కనుక చిత్ రూప చైతన్యాన్ని, జ్ఞాన స్వరూపుణ్ణి. నేను శాశ్వతుణ్ణి. ఏకమైన వాణ్ణి కనుక సత్ రూప చైతన్యాన్ని. అన్నిరకాల ఆలోచనలు, ఇదం భావనలు, అహంభావనపై ఆధారపడి ఉన్నాయి. ఇదంభావనలు పోయినా అహంభావన ఉంది. ఈ అహంభావన యొక్క పుట్టిన చోటు ఎక్కడ? అని ప్రశ్నించి విచారణ చేస్తే అదీ పడిపోతున్నది. అది పడిపోయిన క్షణంలోనే నేను నేను అంటూ సత్ రూపచైతన్యం స్వయంగా ప్రకాశిస్తున్నది. ఈ 'నేనే' నిజమైననేను. ఇదే తాను. ఈ నేను అన్నీ లయమైన గాఢ నిద్రలో కూడా లయంకాకుండా

వుండిపోతున్నది. అలా ఉండటం వల్లనే గాఢ నిద్రలోని స్థితిని, ఏమి తెలియని స్థితిని మనం మేలుకున్న తర్వాత చెప్పగలుగుతున్నాం. గాఢనిద్రలో అన్నీ లయమై పోయినప్పుడు ముఖ్యంగా మనస్సు కూడా లయమైనప్పుడు అక్కడి అనుభవాన్ని మనస్సు ఇప్పుడెలా చెప్పగలుగుతున్నది? అంటే అన్నీ లయమైనా అక్కడి అనుభవాన్ని చూసే సాక్షి ఒకరున్నారని అంగీకరించక తప్పదు. ఆసాక్షియే నేను. అందుకే అప్పుడు హాయిగా ఉన్నదని చెప్పగలుగుతున్నాం. కనుక నేను ఎల్లప్పుడూ ఉంటున్నాను. త్రికాల సత్యం.

దేహేంద్రియ ప్రాణమనోబుద్ధులు నేను కాదు అని చెప్పటానికి మన అనుభవంలో ఋజువు ఏమైనా ఉన్నదా? పరిశీలించండి.

రాత్రి నిద్ర పోయింది ఈ దేహం. కల వచ్చింది. ఆ కలలో ఒక దేహం, దానికి వస్త్రాలు, అన్ని ఇంద్రియాలు, ప్రాణాలు, మనోబుద్ధులు అన్నీ ఉన్నాయి. ఆ దేహానికి ప్రమాదం జరిగింది. రక్తం పోయింది. హాస్పిటల్‌లో చేర్చారు.ఎంతో బాధ కలిగింది. దప్పిక అయినా మంచినీరివ్వలేదు.నర్సులతో పోట్లాట పెట్టుకున్నావు. ఇంతలో మెలుకువ వచ్చింది. ఇప్పుడు నిన్ను అడుగుతున్నాను. ఆ దేహం నీవా? ఆ దప్పిక నీదా? ఆ గాయాలు నీవా? పోట్లాడింది, బాధపడింది నీవేనా? అహ! కాదు.కాదు.కాదు. నేను కాదు. నేను ఏ బాధలు లేకుండా హాయిగా ప్రక్కమీదనే ఉన్నాను అంటావు. అయితే ఇదంతా నీవు మేలుకున్న తర్వాతనే.

అలాగే ఈ అజ్ఞానావస్థలో, జాగ్రదావస్థలో ఈ దేహ, ఇంద్రియ, ప్రాణ, మనోబుద్ధులు నేనేనని భావిస్తున్నావుగాని, అజ్ఞానం తొలగించుకొని, నీవు నీవుగా, తానుగా – ఆత్మగా నిలిచిపోతే ఇప్పుడు చెబుతావు, ఆ దేహము నేను కాదు, ఇంద్రియాలు నేను కాదు, ప్రాణాలు నేను కాదు, బుద్ధి నేను కాదు, ఆకలి దప్పికలు నాకు కాదు. బాధలు దు:ఖాలు నాకు కాదు. నేను కేవలంగా ఉండే ఏకమైన సద్రూప చైతన్యాన్ని అని. నీవెప్పుడూ సచ్చిదానంద స్వరూపుడవే. అజ్ఞానం చేత నీవు కాని

వాటిని నీపై ఆరోపించుకొని ఇలా తయారయ్యావు అంతే. కనుక నీవు కాని వాటిని తొలగించి, నీవైన నీవుగాఉండిపోవాలి.

ఒక శిల్పిని పిలిచి గంధపు చెక్కతో కృష్ణ విగ్రహాన్ని చెక్కమన్నావు. నీ ఇంట్లోనే ఉన్న పనికిరాని వస్తువుల్లో నుంచి ఒక గంధపు మొద్దును తీసుకెళ్ళి కృష్ణ విగ్రహాన్ని అందంగా చెక్కి తీసుకొచ్చాడు శిల్పి. ఆహా ! ఎంత అందంగా చెక్కావయ్యా, ఇది దేనితో చేశావు? అన్నావు. దానికా శిల్పి నీ ఇంటిలోని చెక్కతోనే అన్నాడు. ఆహా! అంత వికారమైన కొయ్యలో ఇంత అందాన్ని ఎట్లా నింపావయ్యా? అన్నావు ! నేను అందాన్ని నింపలేదు.అది అందులోనే ఉంది. కాకపోతే వికారాన్ని తీసేశాను అన్నాడట శిల్పి. అలాగే నీవు కాని అనాత్మను తొలగిస్తే చాలు అందమైన, ఆనంద స్వరూపమైన 'నీవు' మిగులుతావు. ఇదంభావనలు అహం భావన పోతే నేను నేను అనే అహం - సద్రూప చైతన్యం మిగులుతోంది. మరి ఆ సద్రూప చైతన్యాన్ని తెలుసుకొనేదెవరు?

–దేహేంద్రియ మనో బుద్ధులను నిరశించిన తరువాత మిగిలిన సద్‌రూప చైతన్యాన్ని తెలుసుకొనే దెవరు? ఏ ప్రకాశం వల్ల ఆత్మ తెలియబడుతుంది?–

**శ్లో॥ సత్వభాసికా చిత్క్వవేతరా ।**
**సత్తయాహిచిత్ చిత్త యాహ్యహం॥ –23**

**ప్రతిపదార్థం** :– సత్వభాసికా = సద్రూప ఆత్మను ప్రకాశింపజేసే, ఇతరా= వేరొక, చిత్ = జ్ఞానము, క్వవా = ఎక్కడ ఉన్నది? (లేనేలేదు),హి = ఎందుకంటే, సత్తయాచిత్ = సత్‌రూప చైతన్యమే చిత్ (జ్ఞానం) తెలుసుకొనేది, హి అహం చిత్ = అందువల్ల ప్రకాశింపజేసే జ్ఞానాన్ని కూడా నేనే.

**భావం** :ఆత్మను (నేనును) తెలియజేసే వేరొక చిత్తు (జ్ఞానము) ఎక్కడ వున్నది? లేదు. కనుక ఉన్న సత్‌యే చిత్. అనగా ఉన్నదే జ్ఞానము. కనుక జ్ఞానముగా నున్న ఆ సద్వస్తువే నేను.

**వ్యాఖ్య :**- ఈ లోకంలో మనకు కలిగే అన్ని ఆలోచనలను మనస్సు తెలుసుకో గలుగుతున్నది. అంటే అన్ని ఇదం భావనలను అహంభావన తెలుసు కుంటున్నది. ఈ అహం భావనను అహం - నేను తెలుసు కుంటున్నాను. మరి ఈ నేనును - సద్రూప చైతన్యమును తెలుసుకొనేది ఎవరు? నిజంగా సత్ ఐన ఆత్మను తెలుసుకోవటానికి దానికన్నా వేరుగా మరొక జ్ఞానం (చిత్) ఉన్నట్లైతే ఈ జ్ఞానం చేత ఆ సత్ రూప ఆత్మ పరిమితమై పోతుంది. పరిమితమైనది ఏదైనా నశిస్తుంది. నశించే దానిని సత్ అని ఎలా అంటాం? సత్ అంటే ఎన్నటికి నశించనిది. అన్ని కాలాలలోను ఉండేది. 'కాలత్రయే అపితిష్టతి ఇతి సత్' అన్నారు.కనుక సత్ కన్నా వేరుగా చిత్ ఉండే అవకాశం లేదు. సత్తే చిత్తు అయివుండాలి. అదే సత్యం. కనుకనే సత్తయాహిచిత్ అని మహర్షి చెబుతున్నారు. ఏదైతే సద్రూప చైతన్యం ఉందో అదే చిత్ - జ్ఞాన స్వరూపం కూడా అని. ఆత్మలో సత్-చిత్-ఆనందమని 3 భాగాలు లేవు. అలా ఉంటే ఆత్మలో స్వగత భేదం ఉన్నట్లే. చెట్టులో కొమ్మలు, ఆకులు, పూలు, కాయలు ఉన్నట్లుగా ఆత్మలో సత్ చిత్ ఆనందం అనే 3 అవయవాలు లేవు. ఆత్మలో సజాతీయ-విజాతీయ భేదాలు కూడా ఉండే వీల్లేదు. ఆత్మ ఒక్కటే. సత్తే చిత్, చిత్తే ఆనందం. అంటే ఎల్లప్పుడూ ఉండే జ్ఞాన స్వరూపమే, ఆనంద స్వరూపమే ఆత్మ అని భావం. అది తనను తాను ప్రకాశింపజేసుకోవటం లేదు. దాని స్వరూపమే ప్రకాశం. సూర్యుని ప్రకాశింపజేయటానికి వేరొక వెలుగు లేనట్లే ఆత్మను ప్రకాశింప జేయటానికి వేరొక ప్రకాశం లేదు. స్వసంవేద్యమై, స్వయం ప్రకాశమై ఉండే సత్తును తెలిపేందుకు వేరొక చిత్తు లేనేలేదు. సత్తే చిత్తు. చిత్తే నేను. 'చిత్తయా హ్యాహం'.

నిజంగా ఒక దాన్ని మరొకటి తెలుసుకోవాలంటే ప్రయత్నం కావాలి. జ్ఞానం కావాలి. కాని తనను తాను తెలుసుకొనుటకు వేరే జ్ఞానం అక్కర లేదు. ఇప్పుడు కరెంటు పోయింది. మీరందరూ ఉన్నారో లేదో

తెలుసుకోవాలంటే దీపం కావాలి. కనుక క్యాండిల్ వెలిగించి చూచి తెలుసుకుంటాను. మరి మీకు అనుమానం వచ్చింది గురువుగారున్నారా? దిగిపోయారా? అని. మీ దగ్గర క్యాండిల్ లేదు గదా! అందుకని అడిగారు, గురువుగారూ! మీరు అక్కడే ఉన్నారా? అని. ఉండండి చూచి చెబుతాను అని క్యాండిల్ వెలిగించి నన్ను నేను చూచి నిర్ధారణ చేసుకొని చెప్పాను. ఆ నేనిక్కడే ఉన్నాను అని . ఇదంతా చూచి మీరనుకుంటారు. ఆ ఉన్నా ఒకటే లేకపోయినా ఒకటేలే! అని. కనుక నన్ను నేను తెలుసుకోవటానికి ఏ వెలుగూ, ఏజ్ఞానము, ఏ ప్రయత్నము అక్కర లేదు. స్వయం వ్యక్తం.

అయితే నాకన్నా వేరైన దానిని నేను తెలుసుకోవటం ఎంతో తేలిక. కాని ఆత్మను తెలుసుకోవటం అంత తేలిక కాదు. ఎందుకంటే దాని కన్నా వేరుగా మరొక ఆత్మ లేదు గనుక. 'స్వయం ప్రమాణత్వాత్" తనకు తానే ప్రమాణం గనుక అది అనుభవం ద్వారానే గ్రహించాలి.

ఏదైనా వస్తువును చూడాలంటే వెలుగుండాలి. వెలుగు ఆ వస్తువు మీద పడితేనే అది తెలియబడేది. వెలుగున్నంత మాత్రాన ఎవరైనా చూడగలరా? గ్రుడ్డివాడు చూడగలడా? లేదు. కనుక కళ్ళల్లో వెలుగుండాలి. కళ్ళల్లో వెలుగుండీ మనస్సు అక్కడ లేక ఎక్కడో ఉంటేనో అప్పుడూ లాభం లేదు. కనుక మనస్సులోనూ వెలుగుండాలి, ప్రకాశం ఉండాలి. మరి ఈ మనస్సులోని ప్రకాశాన్ని ఏది ప్రకాశింపజేస్తున్నది? మనస్సు ఆలోచనలు చేస్తుంటే ఫలానా ఆలోచన చేస్తున్నదని, అనుభవాలు పొందుతుంటే ఫలానా అనుభవం పొందుతున్నదని ఏ ప్రకాశం వల్ల తెలుస్తున్నది? నావల్లనే - ఆత్మ ప్రకాశం వల్లనే. కనుక నేనే ప్రకాశాన్ని. నేనే ఆత్మను. నేనే అన్ని అవయవాలలోను ఉన్నది. నేనే అన్ని ప్రాణులలోను ఉన్నది.

మం॥ సర్వ భూతాంతరాత్మాహం అహమస్మి సనాతనః।
అహం సకృత్ విభాతోస్మి స్వేమహిమ్ని సదాస్థితః॥ (ఉపనిషత్)

అన్ని ఘటాలలో ఆకాశం లాగా అన్ని భూతాలలో నేనే ఉన్నాను. ఎప్పటి

నుండి? సనాతన:= ఎప్పుడూ ఉన్నాను. అహం సకృత్ విభాతోస్మి = నేను ఒక్కసారే వెలిగాను. సదాస్థిత: స్వేమహిమ్ని = కేవలం నా మహిమతో నేను వెలిగేవాణ్ణి – వేరొకరిపై ఆధారపడి వెలిగేవాణ్ణి కాదు. కనుక నేను స్వయం ప్రకాశం, స్వసంవేద్యం, నన్ను నేనే తెలుసుకుంటాను. నన్ను తెలుసుకునేందుకు వేరే ఏదీ లేదు. సరే ఉన్నదంతా నేనే. బాగానే ఉంది. మరి ఈశ్వరుడు, భగవంతుడు, దేవుడు, జీవుడు, ఆలయాలు, విగ్రహాలు – అక్కడున్నది దేవుడు, ఈశ్వరుడు. నేను జీవుణ్ణి అంటామే, జీవుడెవరు? ఈశ్వరుడెవరు?

–జీవుడెవరు? ఈశ్వరుడెవరు? జీవేశ్వరులు వేరు వేరని సామాన్యంగా అందరి భావన. జీవేశ్వరులొక్కటేనని జ్ఞానుల భావన. ఎందువల్ల ఇట్టి భావనలు?

**శ్లో॥ ఈశజీవయో ర్వేషధీ భిదా।**
**సత్స్వభావతో వస్తు కేవలం॥ –24**

**ప్రతిపదార్థం** :ఈశజీవయో: = ఈశ్వరునకు జీవునకు, భిదా = భేదము, వేషధీ= ఉపాధులను బట్టియే. సత్ స్వభావత: = శుద్ధ చైతన్యము దృష్ట్యా చూస్తే, వస్తు కేవలం = నిజంగా ఉన్నది ఒక్కటే పరబ్రహ్మం.

**భావం** : ఈశ్వరునకు జీవునకు భేదం కేవలం ఉపాధుల దృష్ట్యా చూచినప్పుడే. కాని శుద్ధ చైతన్యం దృష్ట్యా చూచినప్పుడు అక్కడ నిజంగా ఉన్నది ఒక్కటే అయిన పరబ్రహ్మమే.

**వ్యాఖ్య** :ఇంతవరకు సాధకుడు తన ఇదంభావనలన్నీ వదిలినా అహంభావన మాత్రం ఉంటుందని, ఆ అహం భావనను కూడా వదిలి మనోనాశనం చేసుకోవాలంటే ఈ అహంభావన లేదా నేను అనే ప్రథమ తలంపు ఎక్కడ పుడుతున్నదో? అని దాని పుట్టుచోటును వెదికితే అది పడిపోతుందని, అది పడిన చోట నేను, నేను అంటూ పరిపూర్ణ సత్ రూప ఆత్మ చైతన్యం స్వయంగా ప్రకాశిస్తుందని, అట్టి ఆత్మయైన నేను ఎప్పటికీ లయము కాని

శాశ్వత సత్యమునని తెలుసుకున్నాం. అంటే ఇప్పటి వరకు జీవుణ్ణి అనుకునే నేను సద్రూప చిద్రూపచైతన్యాన్ని, పరమాత్మను అని తెలుసుకున్నాం.

మరి ఎన్నో కథలలో భగవంతుడు స్వయంగా వచ్చి భక్తుల ఎదుట ప్రత్యక్షమైనట్లు, భక్తులను కాపాడినట్లు చదువుతున్నాం. శ్రీ మహావిష్ణువు గజేంద్రునికి ప్రత్యక్షమై మొసలి బారినుండి కాపాడాడు, ప్రహ్లాదునికి నరశింహస్వామిగా ప్రత్యక్షమై హిరణ్యకశిపుని సంహరించాడు. అలాగే మత్స్యావతారం, వరాహావతారాలతో ఎన్నో విధాల దుష్టశిక్షణ చేయటం జరిగింది. ఈశ్వరుడు రావణాది రాక్షసులకు ప్రత్యక్షమై వారి కోరికలు తీర్చాడు. ఇలా గనుక ఆలోచిస్తే జీవుడు వేరు ఈశ్వరుడు (భగవంతుడు) వేరు గదా! పైగా జీవుడంటే చావుపుట్టుకలు గలవాడు. ఈశ్వరుడేమో ఎప్పుడూ ఉండేవాడు. జీవుడికి ముసలితనం, రోగాలు వున్నవి. ఈశ్వరునికి అలాంటివేవీ లేవు. జీవుడు దు:ఖాల్లో బాధల్లో ఉండేవాడు. ఈశ్వరుడేమో ఎప్పుడూ ఆనందంగా ఉంటాడు. జీవుడు కోరికలు కోరుకుంటూ ఉండేవాడు. ఈశ్వరుడు కోరికలు తీర్చేవాడు. జీవుడు కొద్ది జ్ఞానం గలవాడు. ఈశ్వరుడు అపరిమిత జ్ఞానం గలవాడు. జీవుడు ఎక్కడో ఒకచోట ఉండేవాడు. ఈశ్వరుడు అంతటా ఉండేవాడు.

ఇలా ఎన్నో తేడాలు కనిపిస్తున్నాయి గదా! మరి జీవుడు ఈశ్వరుడు ఒక్కటే ఎలా అవుతారు? అని సామాన్యుల సందేహం. దానికి మహర్షి ఈ శ్లోకంలో సమాధానం ఇస్తున్నారు. జీవునికి, ఈశ్వరునికి భేదం అంతా వేషంలోనే, డ్రెస్‌లోనే అంటున్నారు. 'వేషధీభిదా'. ఇద్దరు ఒకే రకంగా ఉన్న కవల పిల్లలకు – ఏ తేడా లేనివారికి ఒకరికి ప్యాంటు, షర్టు వేసి, మరొకరికి కాకీ ప్యాంటు,షర్టు వేసి టోపి పెడితే ఒకరు విద్యార్థిలాగా మరొకరు పోలీస్‌లాగా ఉంటారు. ఆరెండు వేషాలు తీసేస్తే ఇద్దరూ ఒక్కటిగానే ఉంటారు. అలాగే ఇక్కడ జీవుని యొక్క ఉపాధులు (వేషం) వేరు ఈశ్వరుని యొక్క ఉపాధులు (వేషం) వేరు. యదార్థంగా ఇద్దరూ

ఒకే ఒక సద్రూప చిద్రూప ఆనంద రూప చైతన్యమే - పరమాత్మయే. పరమాత్మ శరీర మనోబుద్ధులనే వేషం వేసుకొని వ్యష్టిగా ఉన్నప్పుడు జీవుడు అన్నారు. అదే పరమాత్మ అన్ని శరీర మనో బుద్ధులనే వేషం వేసుకొని సమిష్టిగా ఉన్నప్పుడు అంతటా ఉన్న ఈశ్వరునిగా చలామణి అవుతున్నాడు. కాని ఇరువురూ స్వభావరీత్యా ఒక్కరే. పరమాత్మే. చైతన్యమే.

నిజంగా జీవుడి యొక్క స్వభావం ఏమిటి? సత్-చిత్-ఆనందమే. ప్రతి వ్యక్తి ఎల్లప్పుడూ ఉండాలనుకుంటాడు. అందరూ పోయినా తాను మాత్రం పోకూడదనుకుంటాడు. ఇదే సత్ స్వభావం. అలాగే ప్రతివాడూ తనకు తెలిసిన దానితో తృప్తి చెందడు. ఇంకా ఇంకా తెలుసుకోవాలను కుంటాడు. ఇదే చిత్ స్వభావం. అలాగే ఆనందంగా ఉండాలనుకుంటాడు. దు:ఖం వస్తే ఎంతో బాధపడతాడు. దానిని ఎలాగైనా తొలగించుకోవాలని తాపత్రయ పడతాడు. అనేక ప్రయత్నాలు చేస్తాడు. ఇదే ఆనంద స్వభావం. నిజంగా మన స్వభావం ఆనంద స్వభావం గనుక ఆనందం వస్తే హాయిగా ఉంటున్నాం. దు:ఖం వస్తే పారద్రోలటానికి ప్రయత్నిస్తున్నాం. అదే మన స్వభావం దు:ఖమే అయితే ఎప్పుడూ దు:ఖంలో ఉండాలని కోరుకుంటాం. దు:ఖం వస్తే హాయిగా ఉంటాం. ఆనందం వస్తే పారద్రోలాలని ప్రయత్నిస్తాం. కనుక సత్-చిత్-ఆనందమే మన స్వభావం. స్వభావం పోతే స్వరూపమే పోతుంది. తీపి పోతే పంచదార లేదు. వేడి పోతే అగ్ని లేదు. చల్లదనం పోతే మంచులేదు. అలాగే సత్-చిత్-ఆనందం పోతే జీవుడే లేడు. మరి జీవుడి స్వభావం సచ్చిదానందమై, ఈశ్వరునిస్వభావమూ సచ్చిదానందమైతే జీవేశ్వరులకు భేదమెక్కడ? స్వభావరీత్యా భేదం లేనే లేదు. భేదం అంతా ఉపాధులకు చెందినదే.

దేహంతో, మనస్సుతో తాదాత్మ్యం చెంది వీటికి పరిమిత మైనప్పుడు నేను జీవుణ్ణి. ఈ ఒక్క దేహానికి చెందిన విషయాలే నాకు తెలుసు. ఈ ఒక్క మనస్సులో కదిలే ఆలోచనలు, పొందుతున్న సుఖదు:ఖ

అనుభవాలే నాకు తెలుసు. అదే ఈశ్వరుడైతే అతడికి అన్ని దేహాలకు, మనస్సులకు చెందిన విషయాలు, ఆలోచనలు, అనుభవాలు అన్నీ తెలుస్తాయి. ఒక్క దేహానికి, మనస్సుకు చెందినవానిని తెలుసుకొనే నేను జీవుణ్ణి. అన్ని దేహాలకు మనస్సులకు చెందినవానిని తెలుసుకొనే ఆయన ఈశ్వరుడు. నేను వ్యష్టి, ఆయన సమిష్టి. ఇదే భేదం. అయితే ఈ ఒక్కదేహంలో, మనస్సులో ఉన్నదానిని తెలుసుకొనుటకు ఆధారం ఏజ్ఞానమో ఏ "చిత్" అయితే ఉందో అదే జ్ఞానము లేక చిత్ అన్ని దేహాలలో, మనస్సులలో ఉండేదానిని తెలుసుకొనుటకు ఆధారం. కనుక అదీ చిత్తే. ఇదీచిత్తే. జీవుడూ చిత్తే. ఈశ్వరుడు చిత్తే.

40 క్యాండిల్ బల్బు తక్కువ కాంతితో వెలుగుతుంది. 1000 క్యాండిల్ బల్బు చాలా ఎక్కువ కాంతితో వెలుగుతుంది. అయితే అందులోని శక్తి ఇందులోని శక్తీ రెండూ ఒకే విద్యుత్ శక్తి.

అల చిన్నది, నశించేది. సముద్రం పెద్దది నశించనిది. అయినా రెండింటిలో ఉన్నది ఒకే నీరు. నామరూపాల దృష్టితో చూస్తే భేదం. నీటి దృష్టితో చూస్తే అభేదం. అలాగే ఉపాధుల దృష్టితో, వేషం దృష్టితో చూచినప్పుడే ఈ జీవేశ్వర భేదం. అసలు వస్తు దృష్టితో – చైతన్యం దృష్టితో చూచినప్పుడు అంతా ఒక్కటే. ఇదే అద్వైత సిద్ధి. అయితే ద్వైతులు దీని నంగీకరించరు.

"నను సాహంకారస్య,కించిజ్ఞస్య, జీవస్య – నిరహంకారస్య, సర్వజ్ఞస్య ఈశ్వరస్య తత్త్వమసీతి మహావాక్యాత్ కధం అభేద బుద్ధిస్యాత్? ఉభయో విరుద్ధ ధర్మాక్రాంతత్వాత్॥" అని తత్త్వబోధలో అద్వైత బుద్ధి గలవాని సందేహాన్ని బయటపెట్టటం జరిగింది.

జీవుడు అహంకారంతో ఉండేవాడు, అల్పజ్ఞుడు, పరిమితుడు. ఈశ్వరుడు నిరహంకారి, సర్వజ్ఞుడు, అపరిమితుడు.

ఇద్దరికీ విరుద్ధ ధర్మాలుండగా 'తత్త్వమసి' మహావాక్యం ద్వారా

ఇద్దరికీ అభేదం ఎట్లా కుదురుతుంది? ఇద్దరు ఒక్కటేననటం ఎలా కుదురుతుంది? 'తత్త్వమసి – మహావాక్యం' సామాన్య వాక్యం కాదు. అది ఉపదేశ వాక్యం. అంటే మామూలుగా ఉన్నది ఉన్నట్లుగా అర్థం చేసుకోవటం కుదరదు. అపార్థం అవుతుంది. దాని ఆంతర్యాన్ని విజ్ఞులు విశ్లేషించి చెబితేనే అర్థమయ్యేది. కొంత వదిలి కొంత కలిపి అర్థం చేసుకోవాలి. ఎలా? ఉపాధి వినిర్ముక్తం సమాధిదశాసంపన్నం శుద్ధ చైతన్యం త్వంపదలక్ష్యార్థం. ఉపాధి శూన్యం శుద్ధ చైతన్యం తత్ పద లక్ష్యార్థం. రెండూ శుద్ధ చైతన్యమే. చైతన్య దృష్టితో జీవునికి ఈశ్వరునికి భేదంలేదు. భేదం అంతా ఉపాధులలోనే. నటుడు నాటకం అయిపోయిన తర్వాత తన వేషాన్ని తొలగించి తాను తానుగా ఉండిపోయినట్లు, జీవుడు తన ఉపాధుల తాదాత్మ్యాన్ని వదిలివేస్తే తానుతానుగానే ఉండిపోతాడు.

'ఆ దేవదత్తుడితడే' అన్నట్లుగా ఆ జీవుడు ఈ ఈశ్వరుడే. ఇద్దరూ ఒక్కటే అని గ్రహించాలి. నా స్నేహితుడు 35 సం॥ముల క్రితం పెళ్ళి చేసుకున్నాడు. ఆ పెళ్ళికి నేను వెళ్ళాను. ఇప్పుడతడు షష్టిపూర్తి చేసుకుంటున్నాడు. అనుకోకుండా ఇప్పుడు పెళ్ళిపీటలమీద కూర్చున్న వాణ్ణి చూచాను. అరే ఇతడు నా స్నేహితుడు గోపాలే గదా! అనుకున్నాను. అప్పటికీ ఇప్పటికీ రూపంలో తేడా ఉంది. అప్పుడు ఎర్రగా ఉన్నాడు. జుట్టుంది. ఇప్పుడు రంగు తగ్గాడు. బోడిగుండు. ఈ రంగు, జుట్టు మొదలైన తేడాలను తొలగిస్తే అతడే ఇతడు అని తెలిసిపోయింది. అలాగే జీవేశ్వరులలోని ఉపాధులు తొలగించగా మిగిలిన ఆత్మ వస్తువు ఒక్కటే. జీవుడే ఈశ్వరుడు.

–జీవేశ్వరుల మధ్య ఉపాధి దృష్ట్యా భేదమే తప్ప ఆత్మ చైతన్యం దృష్ట్యా భేదం లేదని తెలుసుకున్న తర్వాత మరి పరమాత్మ సాక్షాత్కారం ఎలా కలుగుతుంది?

**శ్లో॥ వేషహానత: స్వాత్మదర్శనం।**
**ఈశదర్శనం స్వాత్మరూపత:॥ -25**

**ప్రతిపదార్థం** : వేష హానత: = ఉపాధులను తొలగించినట్లైతే, స్వాత్మ దర్శనం = స్వరూప దర్శనం – తన స్వరూపంలో తానుంటాడు, స్వాత్మ రూపత: = తనస్వరూపంగా (ఆత్మగా) తానుండటమే, ఈశ దర్శనం = పరమాత్మ సాక్షాత్కారం.

**భావం** : ఉపాధులను గనుక వదిలినట్లైతే తన స్వరూపంలో తానుంటాడు. తన స్వరూపంగా, ఆత్మ స్వరూపంగా తానుండి పోవటమే పరమాత్మ సాక్షాత్కారం.

**వ్యాఖ్య** : 'వేష హానత:' జీవుడియొక్క ఉపాధులు, ఈశ్వరుని యొక్క ఉపాధులు తొలగితే మిగిలేది ఒకే ఒక్క సద్రూప చైతన్యం ఆత్మచైతన్యమే. అయితే జీవుడు తన ఉపాధులు తొలగించుకుంటే చాలు. ఈశ్వరుని ఉపాధి తనంతట తానే తొలగిపోతుంది. జీవుడు ఉపాధితో తాదాత్మ్యం పొందినంత కాలమే ఈశ్వరుడు మాయ అనే ఉపాధిని కలిగి ఉంటాడు. నీవు ఎర్రకళ్ళ జోడు పెట్టుకొని చూస్తున్నంత సేపే ఎర్రని గోడ కనిపిస్తుంది. నీవు కళ్ళజోడు తీసెయ్యగానే గోడ యొక్క ఎరుపురంగు తొలగిపోతుంది. అయితే జీవుడు తన ఉపాధులనెట్లా తొలగించుకోవాలి? శరీరాన్ని కొయ్యాలా? హింసించాలా? చంపేయాలా? ఊహు! నేను శరీరాన్ని అనే భ్రమను వదిలిపెట్టాలి. దే.మ.బు.లతో గల తాదాత్మ్యాన్ని వదిలి తన యదార్థ స్వరూపమైన ఆత్మ చైతన్యంగా ఉండి పోవాలి.

ఉపాధులను వదిలినంత మాత్రాన అసలు వస్తువు (చైతన్యం) నశించదు. అక్కడ 40 క్యాండిల్ బల్బు వెలుగుతున్నది. 1000 క్యాండిల్ బల్బు వెలుగుతున్నది. రెంటి వెలుగులో పెద్ద తేడా ఉంది. ఇప్పుడా 2 బల్బులను పగలగొట్టు. ఇప్పుడే భేదం లేదు, రెండూ ఒక్కటే. బల్బులు పగిలినా కరెంటు ఉందా? లేదా? సందేహమైతే వేలుపెట్టి చూడు. వున్నదని

తెలుస్తుంది. అంటే బల్బులు పగిలిపోయినా విద్యుచ్ఛక్తి అలాగే ఉంది. అలాగే ఉపాధులు వదిలినా ఆత్మచైతన్యం ఎక్కడికీ పోదు. ఉపాధులు పోతే ఉపాధుల వల్ల వచ్చిన తేడాలు కూడా పోయినవి. ఇప్పుడంతా ఒక్కటే చైతన్యం. అలా చైతన్యంగా ఉండి పోవటమే స్వాత్మదర్శనం. దర్శనమనే మాట నిజంగా తప్పు. కాని అంతకన్నా అర్థమయ్యేట్లు చెప్పటానికి మరొక మాట లేదు. ఆత్మగా ఉండిపోవటమే ఆత్మ దర్శనం. అదే ఈశదర్శనం. ఈశ్వర దర్శనం. పరమాత్మ సాక్షాత్కారం.

అయితే ఇది ఒక్కసారి కలిగిపోతే లాభం లేదు. అలా వుండి పోవాలి. ధ్యానం చేసేటప్పుడు గాఢమైన భక్తి, అమితమైన శ్రద్ధ పరమేశ్వర కృప కలిగిన వారికి వారి ఇష్టదైవ స్వరూపం లీలామాత్రంగా కనిపిస్తుంది. అంతమాత్రాన అదే పరమాత్మ సాక్షాత్కారంగా భావించి సాధన ఆపకూడదు. అది కేవలం కల్పిత భావనయే.

అలాగే భగవంతుడంటే సమిష్టి రూపుడు. అంటే అన్ని శరీరాల, మనస్సుల యొక్క భావాలను తెలుసుకోగలిగే దశ అది. అదే ఈశ్వర దర్శనం. అంటే ఈశ్వర స్థితి. ఈ స్థితిని సాధనలో జీవుడు క్రమంగా పొందటం జరుగుతుంది. గీత 13వ అధ్యాయంలో చెప్పినట్లుగా భగవంతుడు ఉపద్రష్టగా, అనుమంతగా, భర్తగా, భోక్తగా, మహేశ్వరుడుగా ఉంటాడు సాధకుల స్థాయిని బట్టి. ఎవరు వ్యష్టిని వదలి కేవలం సమిష్టి భావనతో వుంటారో వారే ఈశ్వరుడు. అయినా అట్టివారు కూడా సాధన చేసి పరమాత్మ సాక్షాత్కారాన్ని పొందాలి.

భగవంతుడు సమిష్టిరూపుడు గనుక మొత్తం సమిష్టి రూపాన్ని చూడగలిగితే అదే విశ్వరూప సందర్శనం. అది ఏ అర్జునుని లాంటివారికో, నారదాది దేవర్షులకో, మహర్షులకో సాధ్యమవుతుంది గాని అందరికీ సాధ్యం కాదు. దీని వల్ల కూడా ముక్తి కలుగుతుందనే నియమం లేదు. విశ్వరూప సందర్శనం ఆత్మ సాక్షాత్కారం కాదు. ఎందుకంటే

విశ్వరూపాన్ని సందర్శించిన అర్జునుడు మరుజన్మలో తిన్నడుగా జన్మించినట్లు పురాణగాధ ఉన్నది. అలాగే యశోదగాని, ఉదంకుడు గాని, ధృతరాష్ట్రుడు గాని ముక్తిని పొందినట్లు ఎక్కడా లేదు. కనుక కేవలం దర్శనాదుల వల్ల ముక్తిలేదు. ముక్తి ఆత్మజ్ఞానం వల్లనే. నేను ఆత్మను అని గ్రహించి, సమస్త ఉపాధుల తాదాత్మ్యాన్ని వదలి, తన స్వరూపంలో తానుండటం వల్లనే (స్వాత్మదర్శనం వల్లనే) ఈశదర్శనం లేదా పరమాత్మ సాక్షాత్కారం. ఇదే నిజమైన భగవద్దర్శనం, మోక్షం.

ఉపాధులను పూర్తిగా వదిలి, తన యదార్ధ స్వరూపం ఏదో తెలుసుకొని, అట్టి సత్–చిత్–ఆనంద స్వరూప ఆత్మతో అనుసంధానమై, ఆత్మగా ఉండిపోవాలి. ఎల్లప్పుడూ తాను తానుగానే ఉండిపోవాలి. అదే ఆత్మ నిష్ట. అదే అద్వైత సిద్ధి. ఈ విషయాన్ని స్పష్టం చేస్తూ భగవాన్ రమణ మహర్షి తరువాత శ్లోకంలో వివరణ ఇస్తున్నారు. ఆత్మానుభూతి అంటే ఏమిటో వివరిస్తున్నారు?

–ఆత్మానుభూతి – ఆత్మనిష్ట అంటే ఏమిటో విశదీకరిస్తున్నారు.

**శ్లో॥ ఆత్మ సంస్థితి: స్వాత్మదర్శనం।**
**ఆత్మనిర్ద్వయాత్ ఆత్మ నిష్ఠతా॥ –26**

**ప్రతిపదార్థం** : ఆత్మ సంస్థితి: = తానుతానుగా (ఆత్మగా) నుండుటే, స్వాత్మ దర్శనం = స్వరూప సాక్షాత్కారం – ఆత్మదర్శనం. ఆత్మ నిర్ద్వయాత్ = ఆత్మలో రెండు లేవు గనుక, ఆత్మ నిష్టతా = (తానుతానుగా ఉండుటే) అదే ఆత్మ నిష్ఠ. (ఆత్మ నిష్ఠయందు జీవేశ్వర భేదం లేదు)

**భావం** : తానుతానుగా తన స్వస్థితిలో తానుండటమే ఆత్మదర్శనం లేదా ఆత్మ సాక్షాత్కారం. దర్శించటానికి ఆత్మలో రెండు లేవుగనుక తాను తానుగా ఉండటమే ఆత్మనిష్ట. ఆత్మ నిష్టలో జీవేశ్వరభేదానికి తావులేదు.

**వ్యాఖ్య** : ఆత్మదర్శనం అంటే ఇక్కడ కుర్చీని, బల్లను, విగ్రహాన్ని దర్శించినట్లుగా ఆత్మను దర్శించటం కాదు. ఎందుకంటే ఆత్మ ఒక వస్తువు

కాదు. దాని కన్నా వేరుగా మరొకటి ఉండే వీలులేదు. 'నేహనానాస్తి కించన' అన్నారు. కనుక ఆత్మను దర్శించే మరొక ఆత్మ లేదా జీవుడు ఉండే వీలులేదు. మరి ఏమిటీ ఆత్మ దర్శనం అంటే 'నేను సర్వవ్యాపకమై - ఏకమై - అద్వయమై ఉన్న ఆత్మను. నాకన్నా వేరుగా ఏమీ లేదు అనే అనుభవంలో ఉండి పోవటమే. ఇదే అపరోక్షానుభవం అని శ్రుతులు చెప్పేది.

ఒక కోటీశ్వరుడు నిద్రపోతున్నాడు. కలవచ్చింది. కలలో తానొక బిచ్చగాడు. ఆకలితో అలమటిస్తున్నాడు. ఎన్నో వ్యాధులతో అడుక్కుంటున్నాడు. ఎక్కడా ముద్ద దొరకటం లేదు. పైగా తిట్లు. ఎంతో బాధ పడుతున్నాడు. ఇప్పుడు ఒక్కసారిగా మేలుకున్నాడు. అంతే ఇప్పుడా బిచ్చగాడుగాని, వాడి బొచ్చగాని, అడుక్కుతినటం గాని, ముద్దదొరకక బాధపడటం గాని, తిట్లు గాని, అన్నీ అదృశ్యం. ఇప్పుడు నేను బిచ్చగాణ్ణి కాదని, కోటేశ్వరుణ్ణి అని ఎవరూ చెప్పకుండానే, ఏమి ఆలోచించకుండానే గ్రహిస్తాడు. అదే నిద్రలో ఉన్నంత సేపూ నేను కోటీశ్వరుణ్ణి అని అనుకోనే అనుకోలేడు. అలాంటి భావనయే అసాధ్యం. కాని మేలుకుంటే చాలు తాను కోటీశ్వరుణ్ణని గ్రహిస్తాడు. ఇంతవరకు బిచ్చగాడుగా ఉన్నది భ్రమ, కల, అబద్ధము అని తెలుసుకుంటాడు. అంతేకాదు అతడు కోటీశ్వరునిగానే ఉండిపోతాడు. అప్పుడప్పుడు మర్చిపోవటమూ మరలా గుర్తు చేసుకోవటము ఉండదు. అదే అనుభవం అదే స్వానుభవం. అదే స్వస్థితిలో ఉండటం. (కోటీశ్వర సాక్షాత్కారం ఇదే).

అలాగే ప్రపంచంలో జీవుడుగా వ్యవహరిస్తున్న నేను శ్రవణ, మనన, నిధిధ్యాసనల ద్వారా, సాధనల ద్వారా, సమాధి నిష్టలో నేను జీవుణ్ణి కాదు ఆత్మనే అని స్వానుభవంగా గ్రహిస్తాను. స్వస్థితిలో అంటే ఆత్మగానే ఉండిపోతాను. మరిచిపోవటం, గుర్తు తెచ్చుకోవటం వుండదు. అదే ఆత్మ సంస్థితి. అంటే ఇలా ఆత్మ సంస్థితిలో ఉండటమే స్వాత్మ దర్శనం. పరమాత్మ సాక్షాత్కారం అంటారు. ఆత్మ నిర్ద్వయాత్ రెండు

లేవు. ఆత్మ ఏకం – అద్వయం. నీవు ఆత్మవేగాని ఆత్మకన్నా వేరు కాదు. (ఆత్మకన్నా నీవు వేరైతే ఆత్మ నీచేత చూడబడేది అవుతున్నది. చూడబడేది దృశ్యం. దృశ్యం పరిమితం, పరిమితమైనది నశిస్తుంది. నశించేది ఆత్మ కావటానికి వీలులేదు) కనుక ఆత్మను నీవు వేరుగా ఉండి చూడడం కుదరదు. వేరుగా చూచిన భగవంతుని రూపాలుగాని, జ్యోతులు గాని, ఇంకా ఏవైనా – అవి అన్నీ నశించేవే. కనుక ఆత్మ ఒక్కటే, అద్వయం. అది నీవే. నీకు వేరుగా ఉన్నది ఏదైనా నీకు బరువే.

ఒక బాటసారి తన గ్రామం నుండి చాలా దూరంలో నున్న బంధువుల పట్టణానికి బయలుదేరాడు. ప్రయాణ సాధనాలు లేని ఆ రోజుల్లో కాలినడకన వెళ్తుంటే మధ్యలో బాగా ఆకలవుతుంది గనుక చద్ది అన్నం మూటను గట్టుకొని ప్రయాణిస్తూ ఉంటారు. అలాగే ఇతడూ ఒక చద్దన్నం మూటను నెత్తిన బెట్టుకొని బయలుదేరాడు. చాలాదూరం నడిచాడు. ఇప్పుడు నడవటం చాలాకష్టంగా ఉంది. ఆకలి వేస్తున్నది. నెత్తిమీది మూట చాలా బరువుగా ఉన్నట్లుంది. అడుగులు తడబడుతున్నాయి. అలాగే ఈసురోమంటూ అడుగులు వేస్తుంటే దూరంగా మంచినీరున్న కుంట ఒకటి కన్పించింది. వెంటనే అక్కడకు వెళ్ళి మూటవిప్పి అన్నం తిని, ఆ కుంటలోని మంచినీరు త్రాగి బ్రేవ్‌మన్నాడు. కొంచెంసేపు రెస్ట్ తీసుకున్నాడు. ఇప్పుడతడికి హాయిగా ఉంది. ఆకలి తీరింది. నెత్తిమీద బరువు పోయింది. బలం వచ్చింది. ఇప్పుడు చకచకా నడవగలుగుతున్నాడు.

ఇంతవరకు మూట నెత్తిమీద ఉంటే బరువు. ఇప్పుడు బొజ్జలోకి పోతే బరువు లేకపోగా బలంగా ఉంది. అంటే వేరుగా ఉంటే భారంగా ఉంది. ఒక్కటైపోతే భారం లేక పోగా బలం, హాయి. ద్వైతం ఇలా ఏడిపిస్తుంది ఎవరినైనా. అద్వైతమే ఆనందం. నేను పంచదారను తింటానుగాని పంచదారను కాను అని అంటే అది మూర్ఖత్వం. పంచదార తియ్యగా ఉంటుంది. షుగర్ ఉన్నవాడికి ప్రమాదం తెస్తుంది. మోదం

ఖేదం రెండూ ఉంటాయి ద్వైతంలో. అద్వైతంలో ఒకటే అనుభవం. ఆత్మ అద్వైతమే. ఆత్మకన్న అన్యంగా మరొకటి లేదు.కనుక ఆత్మ దర్శనం అంటే ఆత్మ నిష్టయే. ఆత్మగా ఉండుటే. ఇక జీవుడనేవాడే లేడు. అంతా తానే. తానే తప్ప అన్యమేదీ ఉండదు. అదే ఆత్మ నిష్ఠ. మరి జ్ఞానమో? అదీ లేదు. ఎందుకంటే జ్ఞానము అనగానే అజ్ఞానమనేది మరొకటి ఉంటుంది. అద్వైతంలో రెండు ఉండే వీలు లేదు. మరి జ్ఞానము (ఆత్మజ్ఞానము) అంటే ఏమిటి?

–ఆత్మ జ్ఞానము అనేది ఆత్మ కన్నా వేరా? జ్ఞానమంటే దేనినైనా తెలియజెప్పేది గదా ! అలాగే ఆత్మ జ్ఞానము అంటే ఆత్మను గురించి తెలియజెప్పేదేనా?

**శ్లో॥ జ్ఞానవర్జితా2 జ్ఞానహీన చిత్।**
**జ్ఞానమస్తి కిం జ్ఞాతు మంతరం ॥ –27**

**ప్రతిపదార్థం** : జ్ఞానం = శుద్ధమైన జ్ఞానం అంటే, జ్ఞానవర్జితా = తెలియును అనే వృత్తిని అధిగమించిన, అజ్ఞాన హీన = తెలియదు అనే వృత్తిని అధిగమించిన, చిత్ = చిత్ స్వరూపమే (ఆత్మయే), జ్ఞాతుం = తెలుసుకునేందుకు, అంతరం = వేరుగా, కింఅస్తి = ఏముంటుంది?

**భావం** : శుద్ధ జ్ఞానం అంటే విషయ వస్తువుల గురించి తెలుసును అనే వృత్తిని, తెలియదు అనే వృత్తిని అధిగమించిన చిత్ స్వరూపమే. (సమస్తానికి అతీతమైన, సర్వాత్మకమై, ఏకమైన చిత్ స్వరూప) ఆత్మను తెలుసుకొనుటకు వేరే జ్ఞానం ఏం ఉంటుంది? ఏమీ ఉండదు అని.

**వ్యాఖ్య** : జడమైన దేదీ మరొకదానిని తెలుసుకోలేదు. ఈపుస్తకానికి తాను పుస్తకాన్ననీ తెలియదు, తనపైన వ్రాస్తున్నది కలమనీ తెలియదు. మరి బుద్ధి కూడా జడమే గనుక అది కూడా దేనినీ తెలుసుకోలేదు. అయితే ఆ బుద్ధి చిత్ప్రకాశమైన ఆత్మతో కలిసి ఉండటం వల్ల బుద్ధికి చైతన్యం కలిగింది. కనుకనే కొన్ని విషయాలను తెలుసుకుంటుంది. కొన్నింటిని తెలుసుకోలేక

పోతున్నది. నీది ఏ ఊరు? అని అడిగితే ఫలానా ఊరు అని చెబుతున్నావు. బిల్‌క్లింటన్ ఇప్పుడేవూరిలో ఉంటున్నాడు? అంటే నాకు తెలియదు అంటున్నావు. అంటే నీ బుద్ధిలో తగిన సమాచారం ఉంటే నాకు తెలుసు అంటున్నావు. సమాచారం లేకపోతే తెలియదు అంటున్నావు. నాకు తెలుసు అంటే బుద్ధికి తెలుసు అని, నాకు తెలియదు అంటే బుద్ధికి తెలియదు అని. అయితే బుద్ధికి తెలుసు అన్న విషయమూ నాకు తెలుసు, బుద్ధికి తెలియదు అన్న విషయము నాకు తెలుసు.తెలిసేది, తెలియనిది బుద్ధికే. అయితే ఆ రెండూ నాకుతెలుసు. ఎందుకంటే నేను బుద్ధికన్న వేరుగా వుండి, ఆ బుద్ధికి ఆధారంగా ఉన్న చైతన్యాన్ని. చిత్ రూప చైతన్యాన్ని. అంటే తెలుసును అనే జ్ఞానవృత్తిని, తెలియదు అనే అజ్ఞానవృత్తిని రెంటిని తెలుసుకొనేది శుద్ధ జ్ఞానస్వరూపం. అదే చిత్. అదే ఆత్మ. కనుక ఆత్మయే జ్ఞానం. జ్ఞానమే ఆత్మ.

బుద్ధిలోని తెలుసును అనే జ్ఞానవృత్తిని, తెలియదు అనే అజ్ఞాన వృత్తిని తెలుసుకొనే నన్ను (ఆత్మను) తెలుసుకొనేది ఎవరు? నా ప్రకాశం వల్ల జడమైన బుద్ధి పనిచేయగలుగుతున్నది. కొన్నిటిని తెలుసుకుంటున్నది. కొన్నిటిని తెలుసుకోలేక పోతున్నది. అట్టి బుద్ధి నా ప్రకాశం వల్ల నన్ను తెలుసుకో గలుగుతుందా? తెలుసుకోలేదు. ఏ సెల్సు సహాయంతో టార్చిలోని బల్బు వెలిగి అన్నింటిని చూస్తున్నదో అది ఎన్నటికీ తనకు వెలుగునిచ్చిన సెల్స్‌ను చూడలేదు. ఆత్మ స్వయం ప్రకాశం. అది వెలుగుతూ అన్నింటికీ వెలుగునిచ్చేది. దానిని ప్రకాశింపజేయటానికి వేరొక వెలుగు అవసరం లేదు. సూర్యుని చూడటానికి ఏ టార్చి లైటు అక్కర లేదు. వెలుగుతున్న దీపాన్ని చూడటానికి వేరొక వెలుగు అక్కరలేదు. అందుకే ఈ చిత్‌ను తెలుసుకొనుటకు వేరొకటి ఏమి ఉన్నది? 'జ్ఞాతుం అంతరం కిం అస్తి?' అని మహర్షి ప్రశ్నిస్తున్నారు. కనుక నిజమైన జ్ఞానము ఆత్మను తెలియజేసేది కాదు. అది ఆత్మయే. జ్ఞానం అనేది అజ్ఞానాన్ని

పోగొట్టుకోటానికే గాని ఆత్మ దర్శనానికి కాదు. ఇప్పటిదాకా జ్ఞానం వల్లనే ఆత్మ దర్శనం అన్నారు కదా! అది ఆ స్థాయిలో. మరి ఆత్మానుభూతి ఎలా? శాశ్వత ఆనందం ఎలా కలుగుతుంది?....

–పరమపూర్ణ చిదానందాన్ని పొందటానికి... ఆత్మానుభూతికి భగవాన్ రమణ మహర్షి వారిచ్చిన అంతిమ ఉపదేశం

**శ్లో॥ కిం స్వరూప మిత్యాత్మ దర్శనే ।**

**అవ్యయా2 భవా 22 పూర్ణ చిత్సుఖం॥ –28**

**ప్రతిపదార్థం** : కిం స్వరూపం = నా స్వరూపం ఏమిటి? ఇతి = అని విచారణ చేస్తే, ఆత్మ దర్శనే = ఆత్మానుభూతి కలిగి, అవ్యయ = తరిగిపోని, అభవ = పుట్టుక లేని, ఆపూర్ణ = నిండైన, చిత్ సుఖం = అనుభవ పూర్వకమైన ఆనందం కలుగుతుంది.

**భావం** : నా నిజ స్వరూపం ఏమిటి? అని విచారణ చేసినప్పుడు ఆత్మానుభూతి కలిగి తరిగి పోని, పుట్టుకలేని, నిండైన ఆనందం అనుభవంలో ఉంటుంది. తాను అనంత, అఖండ, చిదానంద స్వరూపుడుగానే వుండిపోతాడు.

**వ్యాఖ్య** :ఈ లోకంలో ప్రతిప్రాణీ సుఖాన్ని, ఆనందాన్నే కోరుకుంటున్నది. అందుకోసం ఎన్నో విషయ వస్తువుల వెంట, భోగాల వెంట పిచ్చిగా పరుగులు పెడుతూ వాటిని అందుకుంటూ, అనుభవిస్తూ ఆనందిస్తున్నాం. అలా అనుభవించి మరలా మరొక వస్తువు కొరకు, భోగం కొరకు పరుగుతీస్తున్నాం. అందినప్పుడు ఆనందిస్తున్నాం. అందకపోతే దు:ఖ పడుతున్నాం. అందితే అంతటితో ఊరుకోవటం లేదు. మరొక దానికోసం పరుగులు పెడుతున్నాం. ఇలా ఎప్పుడూ పరుగులు తీస్తూ శాశ్వత సుఖాన్ని పొందలేక నిరాశ నిస్పృహలకు గురవుతున్నాం. మరి ఆనందం – శాశ్వత ఆనందం ఎలా వస్తుంది? అది బయట వస్తువులలో ఉందా? లేక లోపల నీలోనే ఉందా? ఆనందం బయటి వస్తువులలో లేదని తేలిపోయింది.

కనుక నాలోనే ఉందేమో పరిశీలన చేయాలి. అంటే నా యదార్థ స్వరూపం ఏమిటో పరిశీలన చెయ్యాలి. ప్రతి వస్తువుకు ఒక సహజ స్వభావం వుంటుంది. ఆ వస్తువు దాని స్వభావాన్ని విడిచి ఉండదు. అగ్ని యొక్క స్వభావం వేడి. అగ్ని వేడిని విడిచి ఉండదు. మంచు యొక్క స్వభావం చల్లదనం. ఈ మంచుముక్క చల్లదనాన్ని విడిచి ఉండదు. పంచదార తీపి. పంచదార తీపిని విడిచి ఉండదు. ఈ విధంగా ఆలోచిస్తే మన సహజ స్వభావం ఏమిటి? దు:ఖమా, ఆనందమా? మన సహజ స్వభావం దు:ఖం అనుకుందాం. ఇదే నిజమైతే మనం దు:ఖాన్ని విడిచి ఉండలేం. అలాంటప్పుడు దు:ఖం కలిగితే ఎందుకు పారద్రోలాలని ప్రయత్నిస్తాం? ఎప్పుడూ దు:ఖం ఉండాలనుకుంటాం. ఎందుకంటే దు:ఖం బాధ కలిగించదు. భారం కాదు. కాని మన అనుభవం దీనికి పూర్తిగా వ్యతిరేకం. మనం ఆనందం కావాలనుకుంటున్నాం. దు:ఖం వస్తే పంపేయాలను కుంటున్నాం. దీనిని బట్టి మన సహజ స్వభావం దు:ఖం కాదు. అయితే మరేమిటి? మన సహజ స్వభావం సుఖమే అయివుండాలి. అందుకే సుఖంగా ఉండాలనుకుంటున్నాం. అలా ఉంటే హాయిగా ఉంటున్నాం. అలా లేకపోతే ఎలా ఆనందాన్ని, సుఖాన్ని పొందాలా? అని ఆలోచిస్తున్నాం. కనుక మనం ఆనంద స్వరూపులమే. కాని ఆనందంగా ఎల్లప్పుడూ ఉంటున్నామా? వుండటం లేదు. ఎందువల్ల? అజ్ఞానం వల్ల – మన నిజస్వరూపంలో మనం ఉండనందువల్ల. నేను దేహాన్ని అనుకోవటం వల్ల. ఆత్మను అని గ్రహించక పోవటం వల్లనే. నేను దేహాన్ని అనుకొని, దు:ఖంలో ఉన్నాను అనుకొని, ఆనందం కోసం ఏవో విషయాలతో సంపర్కం పెట్టుకుంటున్నాం. రాత్రింబవళ్లు ఇలా సంబంధం పెట్టుకున్నా కోరుకున్న ఆనందం లభ్యం కావటం లేదు.

పటిక బెల్లం ముక్క తీపికోసమని బెల్లంతో, పంచదారతో సంబంధం పెట్టుకొని ఎంత సేపు దానిలో పొరలాడినా ఏం ప్రయోజనం?

అది తాను తీపి వస్తువునే అని తెలుసుకుంటే చాలు. తన అజ్ఞానాన్ని పోగొట్టుకుంటే చాలు. అలాగే మనం దేహాదులు కాదని, మన యదార్ధ స్వరూపం ఆత్మయేనని తెలుసుకుంటే, ఆత్మ ఆనంద స్వరూపం గనుక మనం ఎల్లప్పుడూ ఆనందంలో ఉన్నట్టే. కనుకనే ఈ దిశగా విచారణ సాగాలి. నా సహజ స్వభావం, స్వరూపంఏమిటి? అని విచారణ సాగాలి. అందుకు సద్గురువు ద్వారా నిరంతర శాస్త్ర శ్రవణం చేసి విచారణ చేయాలి. అప్పుడు తెలుస్తుంది నేను ఆత్మను, అవ్యయ, అభవ, ఆపూర్ణచిత్ ఆనంద స్వరూపాన్ని అని.

నేను అవ్యయుణ్ణి ఏమార్పులు, వికారాలు, నాశనం లేనివాణ్ణి. దేహం నశించినా నేను నశించను. 'నహన్యతే హన్యమానే శరీరే' అని గీత చెబుతున్నది. ఆత్మ నిష్ఠునికి, ఆత్మారామునికి నాశనం లేదు. అతడికి శరీరంతో సంబంధం లేదు.

సదాశివ బ్రహ్మేంద్ర స్వాముల వారు కావేరి ఒడ్డున ఇసుకలో పడుకున్నారు. నది పొంగి వస్తున్నది. అది చూచిన వారు ఆయనకుచెప్పి దూరంగా రమ్మన్నారు. ఆత్మానందంలో రమించే ఆయనకు ఇదేమీ తెలియదు. వారు చేసేది లేక దూరంగా వెళ్ళి నిలబడ్డారు. నీరు రావటం, ఆయనను ముంచి వెయ్యటం, కొట్టుకు పోవటం కూడా చూచారు. 4 నెలల తరువాత బండ్లతో ఇసుకను తోలుతున్నారు. పారతో తవ్వుతుంటే రక్తం. జాగ్రత్తగా త్రవ్వి చూస్తే ఈ మహాత్ముడు. ప్రాణాలతోనే ఉన్నాడు. స్వామి ఎలా ఉండగలిగారు? అని అడిగితే" పూర్ణ బోధోహం, సదానంద పూర్ణ బ్రహ్మోహం, నిత్యోహం, అభయోహం, అద్భుతాత్మాహం" అని కీర్తన ద్వారా తెలిపాడు. అట్టి మహాత్ములకు దేహంతో సంబంధం ఉండదు. రమణ మహర్షి అంతే. వారికి పుట్టుక లేదు. నాశం లేదు. ఆ రెండూ దేహానికే. 'ఆపూర్ణ చిత్సుఖం' పరిపూర్ణమైన ఆనందాన్ని ఆత్మానుభూతి చెందిన వారు స్వానుభవంగా పొందుతూ ఉంటారు. ఇలా సద్గురువు వద్ద విచారణ

చేస్తూ అవ్యయ, అభవ, ఆపూర్ణచిత్ సుఖస్వరూపంగా ఉండిపోతారు.

ఆపూర్ణం = ఏ కొరతలు లేక ఎల్లప్పుడు సమస్త శుభాలతో పూర్ణంగా ఉండేది. చిత్ = ఎఱుక రూపంలో ఉండేది, తానుగా ఉండేది, సుఖం = దు:ఖ వాసన లేనిది, ఆనందసారమైనది. అట్టి సచ్చిదానంద అత్మననే అనుభవం కలుగుతుంది.

కనుక ఎవరైతే నా స్వరూపం ఏమిటి? అని విచారణ సాగిస్తారో అట్టివారు తాము ఆత్మయేనని, అంతటా ఉన్నది తామేనని, తమ కన్నా అన్యంగా మరేమీ లేదని, తమకు పుట్టుక, నాశము లేవని, పరిమితుల్లేని ఆనందాన్ని అని అనుభవ పూర్వకంగా గ్రహించి, ఎల్లప్పుడూ అట్టి ఆనందంలోనే ఉండిపోతారు. కనుక ఆనందమనేది వస్తువుల ద్వారా, విషయాల ద్వారా పొందేది కాదు. అది తాత్కాలిక సుఖం మాత్రమే. మోక్షమే ఆనందము. నిజమైన ఆనందము. మోక్షమంటే జీవించియుండగానే మన యదార్ధ స్వరూపం ఏమిటో గ్రహించి అందులోనే నిష్ట గలిగి ఉండుట, స్వస్థితిలో ఉండుట, ఆత్మ స్థితిలో ఉండటమే. ఆత్మగా ఉండటమే.

ఆత్మ బంధానికి ముక్తికి అతీతమైనది. మరి మనం ముక్తినెందుకు కోరుకుంటున్నాం? ఆత్మనని తెలియని అజ్ఞానం వల్ల. దేహాన్ని అనుకోవటం వల్ల. ఈ దేహ భావన వల్ల బంధంతో ఉన్నామనుకుంటున్నాం. ముక్తిని కోరుకుంటున్నాం. రాత్రి కలవచ్చింది. ఏదో నేరం చేశావు. జైలులో వేశారు. ఎలా బయట పడటమా? అని ఎన్నో ప్రయత్నాలు చేశావు. కాని ఫలించలేదు. మేలుకున్నావు. అంతే, ఇప్పుడు బందీవనుకుంటున్నావా? బయట పడాలని ప్రయత్నిస్తావా. లేదు గదా! జైలూ లేదు, విడుదలా లేదు. అలాగే అజ్ఞానంలో ఉన్నంత వరకు బంధంలో ఉన్నానని భావిస్తావు. ముక్తి కొరకు ప్రయత్నిస్తావు. జ్ఞానం చేత అజ్ఞానం తొలగిందా! ఆత్మనని గ్రహించావా? బంధమూ లేదు, ముక్తీ లేదు. ఇట్టి బంధముక్తులకతీతమైన శాశ్వత సుఖాన్ని ఎవరు పొందగలుగుతారు?

-బంధ ముక్తులకతీతమైన పరిపూర్ణ సుఖాన్ని పొందేదెవరు?.......

**శ్లో॥ బంధముక్త్యతీతం పరం సుఖం।**
**విందతీహజీవస్తు దైవిక:॥ -29**

**ప్రతిపదార్థము** : దైవిక : దేవుడే అయిన (తన స్వస్థితిలో తాను నిలిచిన) జీవ: = జీవుడు, ఇహ = ఇక్కడే ( ఈదేహంలో ఉండగానే) బంధ ముక్తి అతీతం = బంధానికి, ముక్తికి అతీతమైన, పరం సుఖం = శ్రేష్ఠమైన బ్రహ్మానందాన్ని, విందతి = పొందుతాడు.

**భావం** : దైవికుడైన పుణ్యచరితుడు లేదా తన్ను తాను తెలుసుకొన్న జీవుడు ఇక్కడే – ఈ దేహంలో ఉండగానే బంధ ముక్తులు లేని పరమ సుఖమును – ఆత్మ సుఖమును పొందుతాడు.

**వ్యాఖ్య** : నేను జీవుడను, అల్పజ్ఞుడను, పరిమితమైన వాణ్ణి అనే భావన కలిగి ఉన్నందు వల్లనే బంధంలో ఉన్నాననే భావన కలుగుతున్నది. ఈ భావన అజ్ఞానం వల్ల, నేను ఆత్మను అని తెలియనందు వల్లనే. ఈ అజ్ఞానాన్ని పోగొట్టుకొని జ్ఞానంలో నిలవటమే ముక్తి అని తెలుస్తున్నది. అయితే సాధన చేసి అట్టి ఆత్మగా – ఆద్యంత రహితము, సూక్ష్మాతి సూక్ష్మము, సర్వ వ్యాపకము, సచ్చిదానంద స్వరూపము అయిన ఆత్మగా ఉన్నట్లైతే ఇక బంధం ఏమిటి? ముక్తి ఏమిటి? ఆత్మ సర్వస్వతంత్రము, అది ఒక్కటే. రెండవదేదీ లేదు. కనుక దానిని బంధించే మరొకటి ఉండే వీలులేదు. కనుక బంధం నుండి విడిపించుకొని ముక్తిని పొందటం అన్న ప్రశ్నే లేదు.

స్వప్నంలో ఉన్నంతకాలం అయ్యో జైలులో ఉన్నానే! ఎలా తప్పించుకోవటమా? అని మధనపడతావు. ఏవో ప్రయత్నాలు చేస్తావు. కాని మేలుకొని నీ ఇంటిలో, నీ బెడ్‌రూమ్‌లో ప్రక్కపై హాయిగా పడుకొని ఉన్న నీవు (జైలు) బంధంలో ఉన్నాననుకుంటున్నావా? తప్పించుకోవాలని ప్రయత్నం చేస్తావా? ఏమీ లేదు. స్వప్నంలో – భ్రమలో ఉన్నంత కాలమే ఈ భావన. స్వప్నం నుండి మేలుకుంటే ఎలాగైతే జైలులో బంధింపబడటం

గాని, బయటపడాలనే తపన గాని ఉండవో; అలాగే బ్రహ్మానుభూతిలో – నేను ఆత్మను అనే ఆత్మ సంస్థితి – ఆత్మ నిష్ఠలో నిలిస్తే ఇక బంధమూ లేదు, ముక్తీ లేదు. చీకటిలో త్రాడును చూచి పాము అనుకోవటమే నీ భయానికి కారణం. వెలుగులో అది త్రాడేనని తెలుసుకుంటే భయం నుండి విముక్తి కలుగుతుంది. పాము అనేభావన భ్రమ. భ్రమలోనే భయం, తొలగించుకోవాలనే తాపత్రయం. త్రాడు అనుకుంటే భయమూ లేదు. తొలగించుకోవాలనే ప్రయత్నమూ ఉండదు. అలాగే ఆత్మగా ఉంటే భయమూ లేదు. తొలగించుకోవాలనే ప్రయత్నమూ ఉండదు. కనుక ఆత్మగా ఉంటే బంధమూ లేదు, ముక్తీ లేదు.

ఇలా ఆత్మగా ఉండటానికి, బ్రహ్మానందానుభవంలో నిలిచిపోవటానికి జీవుడు మరణం వరకు ఎదురు చూడనక్కరలేదు. స్వర్గాదిలోకాలకు వెళ్ళి అనుభవం సంపాదించనక్కరలేదు. ఇక్కడే ఈ దేహంలో ఉండగానే నేను ఆత్మను, నన్ను నేను ఇంతవరకు మరచిపోయాను. నేను ఎల్లప్పుడూ ఆత్మనే అని సద్గురువు ద్వారా శ్రవణం చేసి, మనన నిధిధ్యాసనలతో అన్ని అర్హతలు పొందిన జీవుడు అనుభూతి పొందవచ్చును. జీవుడు ఆత్మగా మారనక్కర లేదు. నేనసలు ఆత్మనే అని గ్రహించాలి. అంతే. అయితే అట్టి జీవులు అరుదుగా ఉంటారు. వారు సర్వత్రా పూజనీయులే. వారే దైవిక జీవులు.

కనుక తన స్వరూపాన్ని మరచిపోవటమే బంధం. తన స్వరూపం సూక్ష్మాతి సూక్ష్మమై, సర్వవ్యాపకమైన చైతన్యం – ఆత్మయేనని దృఢంగా గ్రహించుటయే ముక్తి. ఆత్మభావన సహజమై పోయిన తర్వాత బంధంలో ఉన్నాననే భావన పోతుంది. అది పోతే ముక్తిని పొందాననే స్మరణా పోతుంది. ఇదే బంధ ముక్తులకు అతీతమైన స్థితి.

–చివరిగా రమణ మహర్షి యొక్క అంతరంగిక దివ్యానుభవం నుండి పలికిన పలుకు. చేసిన ఉపదేశం.

**శ్లో॥ అహమపేతకం నిజవిభానకం।**
**మహదిదం తపో రమణ వాగియం॥ -30**

**ప్రతిపదార్థం** : అహం అపేతకం = 'నేను' అనే ప్రథమ తలంపు (అహంవృత్తి) పూర్తిగ తొలగిపోయిన దశలో, నిజ విభానకం = స్వయం ప్రకాశమై తన స్వరూపం ప్రకాశిస్తుంది, ఇదం = ఈ విచారణయే, మహత్ తప: = గొప్పదైన తపస్సు, ఇయం = ఇదే, రమణవాక్ = రమణ మహర్షి యొక్క దివ్య వాక్కు.

**భావం** :నేను అనే ప్రథమ తలంపు (అహంవృత్తి) పూర్తిగా నాశనమై పోయిన దశలో స్వస్వరూపంగా ఏది స్వయం ప్రకాశమై వ్యక్తమవుతున్నదో; దానికి సంబంధించిన విచారణ – ఆత్మ విచారణయే గొప్పదైన, శ్రేష్ఠమైన తపస్సు. ఇదే భగవాన్ రమణ మహర్షి యొక్క దివ్యవాక్కు.

**వ్యాఖ్య** :ఆత్మగా సంస్థితమై ఉండటమే ఆత్మ దర్శనమని, అదే పరమాత్మ సాక్షాత్కారమని, అదే శాశ్వతానందమని, అదే జీవితపరమార్థమని తెలియజేసిన మహర్షి అట్టి స్థితిలో ఉండాలంటే ముందు తాను ఆత్మను అని తెలుసుకోవాలని; అహంకారమును – జీవభావమును పోగొట్టుకోవాలని తెలియజేశారు. ఈ అహంకారము లేదా జీవభావమునే 'అహంవృత్తి' అని, ఇదే ప్రథమ తలంపు అని, ఇది ఉన్నంత కాలం అనేక తలంపులు – ఇదం భావనలు వస్తూనే ఉంటాయని చెప్పారు. ముందుగా ఈ తలంపులన్నింటినీ పోగొట్టుకోవాలని తెలియజేశారు. ఇదంభావనలు పోగొట్టుకొనుటకు కర్మ, భక్తి, ప్రాణ వీక్షణాది సాధనలను గురించి చెప్పారు. అయితే ఇవన్నీ పోయినా అహం వృత్తి పోదని, అది ఉన్నంతవరకు ఈ ఇదం భావనలు మళ్ళీ మళ్ళీ వస్తూనే ఉంటాయని, కనుక అహం వృత్తిని పూర్తిగా నాశనం చెయ్యాలని, అదే మనోనాశనమని చెప్పారు. ఈ మనోనాశనం సాధించాలంటే మనస్సంటే ఏమిటి? అని విచారణ కొనసాగించాలని, మనస్సంటే అహంవృత్తే గనుక ఈ అహంవృత్తి యొక్క

పుట్టుక స్థానం ఏది? అని వెతికితే అది పడిపోతుందని, అది పడిపోయిన చోట అహం అహం అంటూ నిజమైన నేను – ఆత్మ స్వయం వ్యక్తమౌతుందని తెలియజేశారు. ఈ స్వయం ప్రకాశక పరిపూర్ణ చిదానంద స్వరూప ఆత్మయే నేను అని తెలుస్తుంది. అప్పుడు నేను దేహేంద్రియ ప్రాణ మనోబుద్ధులుకాదు, నేను సద్రూపచిద్రూప ఆనంద స్వరూప ఆత్మను అనే అనుభూతి కలుగుతుందని, ఇదే ఆత్మ నిష్ఠ, ఇదే ఆత్మ సాక్షాత్కారం, ఇదే బంధ ముక్తులకతీతమైన బ్రహ్మానందానుభూతి అని తెలియజేశారు. ఇప్పుడు దీనిని ముగిస్తూ భగవాన్ రమణ మహర్షి మూర్తీభవించిన కారుణ్య స్వరూపులై మనకు నిగూఢమైన చివరి రహస్యాన్ని తెలియజేస్తున్నారు. చాలామందిలో ఉండే ఒక సందేహాన్ని నివృత్తి చేస్తున్నారు.

పురాణాలు చదివిన వారికి వశిష్ఠుడు, విశ్వామిత్రుడు, అత్రి, గౌతముడు మొదలగు మహర్షులు ఎంతో గొప్ప తపస్సులు చేసి దివ్యశక్తులు సాధించారని, మరి మనం కూడా ఘోర తపస్సులు చేయకపోతే ఎలాగ? అని సందేహం కలుగుతూ ఉంటుంది. మరి మహర్షి ఏమో మనకు ఇక్కడ ముక్తిని పొందటానికి, ఆత్మ నిష్ఠలో నిలవటానికి, బ్రహ్మ సాక్షాత్కారం పొందటానికి విచారణ మార్గాన్ని అనుగ్రహించారే గాని, గొప్ప గొప్ప తపస్సుల ప్రసక్తే లేదు. మరి ఘోరమైన తపస్సులు చేయవద్దా? మనం కూడా మహర్షుల లాగా అత్యున్నత స్థితికి చేరుకోవద్దా? అని కలిగే సందేహానికి ఇక్కడ సమాధానం ఇస్తున్నారు.

నేను నేను అంటూ నిత్యమూ అహంగా చలామణి అవుతున్న అహంకారము – అహంవృత్తి లేక మనస్సు ఏ విచారణలో – ఏ జ్ఞాన సాధనలో భస్మమైపోయి జీవునికి ముక్తి ప్రదమైన స్వస్వరూపానుభవము సంపూర్ణంగా, శాశ్వతంగా కలుగుతుందో ఆ విచారణయే మహత్తరమైన, గొప్పదైన, తపస్సు, ఘోరమైన తపస్సు, శ్రేష్ఠమైన తపస్సు అని స్పష్టం చేస్తున్నారు. వారి తపస్సులు కామ క్రోధాదులను జయించలేకపోయినవి.

కాని ఈ తపస్సు అలాంటి అవలక్షణాలను జయించి స్వస్థితిలో – ప్రశాంత స్థితిలో నిలుపుతుంది. "యస్య జ్ఞాన మయం తప:" అనే ఉపనిషత్ వాక్యాన్ని దృష్టిలో పెట్టుకొని ఈతపస్సే – ఈ జ్ఞాన తపస్సే తానింతవరకు బోధించిన వాక్కుల సారాంశమని మహర్షి తన హృదయాన్ని విశదం చేశారు. ఒక్క మాటలో చెప్పాలంటే "తనను తాను తెలుసుకొనుటకు చేసే విచారణ కన్న గొప్పదైన తపస్సు మరొకటి లేదని, అన్ని తపస్సుల కన్న ఈ జ్ఞాన తపస్సు గొప్పదని" తెలియజేస్తున్నారు. ఎందుకంటే అనేక ఆలోచనలు చేయడానికి ఏ కష్టమూ పడనక్కరలేదు. ఆ ఆలోచనలన్నింటిని ఆపి ఒక్క ఆలోచన చెయ్యటం చాలా కష్టం. ఇక ఆ ఆలోచనను కూడా ఆపి అన్ని ఆలోచనలకు ఆధారంగా ఉన్న దానిని గుర్తింటం మరింత కష్టం. అందుకే అహంవృత్తి యొక్క పుట్టుకచోటు ఏది? అనే నిజమైన ఆత్మ విచారణ చేసి ఆత్మ సాక్షాత్కారాన్ని పొందటం 'గొప్పతపస్సు' అన్నారు. ఇది రమణ మహర్షి యొక్క అంతర్యపు లోతుల నుండి కదిలిన వాక్కు.

ఆత్మానుభవంలో నిరంతరము నిల్చిన రమణ మహర్షి యొక్క అంతర్యపులోతుల నుండి, వారి ఆత్మానుభవం నుండి కదిలిన గొప్పసత్యమే ఈ ఉపనిషత్తుల సారమైన ఉపదేశసారం. శాస్త్రాన్ని ఎవరైనా చెప్పొచ్చు. కాని ఆత్మానుభవాన్ని అందులో ఉన్న వారే చెప్పగలరు. ఆయన బోధించిన మార్గంలో పయనించి బ్రహ్మసాక్షాత్కారం పొందేందుకు మనకు భగవాన్ రమణ మహర్షి ఆశీస్సులు లభించును గాక!

# మా ఇతర ప్రచురణలు

| | | | |
|---|---|---|---|
| 1) | కర్మ సిద్ధాంతం | - | వెల 15-00 |
| 2) | భజగోవిందం | - | వెల 35-00 |
| 3) | భగవద్గీత (1,2 అధ్యాయములు) | - | వెల 80-00 |

## ప్రవచనముల సి.డి.లు ఒక్కొక్కటి రు.80/-లు

| | | |
|---|---|---|
| 1) | మహాభారతం - జీవనసత్యాలు; ధర్మాధర్మ విశ్లేషణ | 16 గం. |
| 2) | మహభారతం - ద్రౌపది (11గం); కర్ణుడు(6గం) | 17 గం. |
| 3) | ఆదిశంకరాచార్యుల 'తత్త్వబోధ' | 12 గం. |
| 4) | ఆదిశంకరాచర్యుల 'భజగోవిందం' | 19 గం. |
| 5) | శ్రీమద్భాగవతం దశమ స్కందం. | 20 గం. |
| 6) | ఆధ్యాత్మిక ప్రవచనములు, కర్మ సిద్ధాంతం మొ॥వి | 12 గం. |
| 7) | భగవద్గీత (ప్రథమ అధ్యాయం) | 17 గం. |
| 8) | భగవద్గీత (ద్వితీయ అధ్యాయం) | 26 గం. |
| 9) | భగవద్గీత (తృతీయ అధ్యాయం) | 20 గం. |
| 10) | ఉపనిషత్తులు, దర్శనోపనిషత్తు | 6 గం. |
| 11) | పరమార్ధ సాధనలు | 6 గం. |
| 12) | కైవల్యోపనిషత్తు | 22 గం. |
| 13) | గీతాపారాయణ, భజగోవింద శ్లో. పాటలు | 8 గం. |

**పై గ్రంథముల కొరకు, సి.డి.ల కొరకు సంప్రదించవలసిన చిరునామా.**

ఆంధ్ర : 80085 39770 / 08647 - 254716

కర్నాటక : 98862 65225 / 080 - 40972033

**E.mail : care@srichalapathirao.com**

గ్రంథములు, ప్రవచనములు, భక్తిపాటలు మొ॥వాని కొరకు

**Visit www.srichalapathirao.com**

నేను వ్యాఖ్యానించిన 'శ్రీ రమణ మహర్షుల **ఉపదేశ సారం**' గ్రంథ ముద్రణకు సహకరించిన ఒంగోలు వాస్తవ్యులు -

**శ్రీ మామిడి బాలసుబ్రహ్మణ్యం గారికి**

నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. వారికి సదా భగవానుని దివ్య ఆశిస్సులు లభించగలవని ఆశిస్తూ ...

శ్రీ దేవిశెట్టి చలపతిరావు
గ్రంథ వ్యాఖ్యాత